తాళ్ళపాక పదసాహిత్యం - సంపుటం - 23

# శృంగార సంకీర్తనలు

(తాళ్ళపాక అన్నమాచార్య విరచితములు)

పరిష్కర్త

కీ॥ శే॥ గౌరిపెద్ది రామసుబ్బశర్మ




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

1998

T.T.D. Religious Series - 555

ప్రథమ ముద్రణ : 1980
ద్వితీయ ముద్రణ : 1998




© తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి




ప్రతులు : 2,000

వెల : రు. 30-00

ప్రచురణ :
శ్రీ M.K.R. వినాయక్, I.A.S.
కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

ముద్రణ :
త్రివేణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
14/264, ఈడేపల్లి
మచిలీపట్నం - 1
ఆంధ్రప్రదేశ్

# విన్నపము

*ఇందరికి అభయంబు లిచ్చు చేయి*
*కందువగు మంచిబంగారు చేయి ॥*

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్లపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్లపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్లపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్లపాక అన్నమాచార్యుల, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమలలో శ్రీవారి ఆలయంలో 'తాళ్లపాక అర'లో లభించాయి.

తాళ్లపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్లపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్లపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్లపాక లఘుకృతులు, తాళ్లపాక కవుల సంకీర్తనలు సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్లపాక పదకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్లపాక పదకవుల సంకీర్తనలు కొన్ని సంపుటాలు వరకు, మరియు అధ్యాత్మ సంకీర్తనలు కొన్ని సంపుటాలు పునర్ముద్రింపబడ్డాయి.

తదుపరి 1992 సంవత్సరంలో ఒక సంపుటం ముద్రింపబడినది.

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల ఇతర సాహిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది.

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులనుండి పరిష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పండిత విజయరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు.

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యాప్తంగా విశేషవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు సాహితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి. ఈ సంకీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక కవుల సంకీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడువున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబడిన తాళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమతః తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటాలుగా లోకానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త) విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A.,Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడానికి ప్రణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటేశ్వర స్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**
కార్యనిర్వహణాధికారి
**తిరుమల తిరుపతి దేవస్థానములు**

# నివేదిక

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో భక్తి, ప్రపత్తి, దేహాత్మైక విచారాదులను తెలిపే అధ్యాత్మసంకీర్తనలు; జీవాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తాళ్లపాక కవులు. సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్త్వాన్ని ఎన్నోవేల సంకీర్తనలద్వారా లోకవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార్యులు, వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు. శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణాలను ఎన్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు. శరణాగతి తత్త్వాన్ని ప్రబోధించారు.

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తాళ్లపాక అన్నమాచార్యులు జన్మించాడు. తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స్వామి ఆదేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు. పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తన రచనకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు. అన్నమయ్య పదాలలో సంగీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి.

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుతుడైన వైభవమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు. ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యులదే!

అన్నమయ్య భగవత్తత్త్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అందించే ప్రయత్నంచేశాడు. అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృతాంధ్ర సంకీర్తనల్ని రచించాడు. జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీర్తనల రచనాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు.

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు. వీరి బాటను అనుసరించిన వారు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు.

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తనలను భక్తజనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకల్పించి అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది. అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయబడిన తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్రేతర రాష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి.

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచారం-పరిశోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించింది. మరియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామోదం పొందింది.

**తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవాలు జయప్రదంగా నేటికీ నిర్వహింప బడుచున్నవి. మరియు అన్నమాచార్య సంకీర్తనోత్సవాలు కుగ్రామ స్థాయినుండి మహానగరాలస్థాయివరకు జరుగుచున్నాయి. అన్నమాచార్య ప్రాజెక్ట్ వివిధ విశ్వవిద్యాలయాల**

సమన్వయంతో తాళ్లపాక కవుల సాహితీ సదస్సులు నిర్వహిస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థానం 1978సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాదాపు 50 సిద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి.

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచున్న ప్రజాదరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమయ్య, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపోయిన కారణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్రింపబడుచున్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్రణకు సంబంధించినవి. తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్యంతో పూర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి. సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యేకంగా పట్టికలో చూపబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానానికి రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు మొత్తం నేడు ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించుటకు ఆమోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీకలిదిండి రామచంద్రరాజుగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి.

ఈ సంపుటాల ముద్రణకు ఆధికారికమైన ఆమోదాన్ని తెలిపిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె.ఆర్.వినాయక్ I.A.S. గారికి కృతజ్ఞతాంజలి.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యుమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం. లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి.తి.దే పౌరసంబంధ శాఖాధికారి శ్రీ పి. సుభాష్‌గౌడ్ గారికి కృతజ్ఞతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M.A., Ph.D
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు

తేది : 10-2-98

# తాళ్లపాక పదకవుల సంకీర్తనల సంపుటాలు

## సంఖ్యా వివరణ పట్టిక - 1998

| సంపుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| అధ్యాత్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 2 | 2 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 10+11(1,2భాగాలు) | 4 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 12 | 5 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 4 | 6 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 13 | 7 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 14 | 8 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 15 | 9 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 17 | 11 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 18 | 12 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 19 | 13 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 20 | 14 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 21 | 15 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 22 | 16 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 23 | 17 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 24 | 18 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 25 | 19 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 26 | 20 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 27 | 21 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 28 | 22 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 29 | 23 | తాళ్లపాక అన్నమాచార్యులు |

| | | | |
|---|---|---|---|
| శృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచార్యులు |

* తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచేయబడుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధతిలో ఉండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టికలోని మునుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవరకు ముద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్పటికి ప్రస్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు ఈ ప్రథమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినది. ఈ మార్పును సహృదయ పాఠకులు గమనించగలరు.

# పీఠిక

వేంకటేశపరిష్వంగపుష్పితా మాత్మవిస్మృతిం ।
రసభూషితామాంధ్రవచనైః యోఽకరోత్తముపాస్మహే ॥

1301 నుండి 1400 వరకుగల నూరురేకులలోని 600 ల శృంగార భక్తిసంకీర్తనలుగల సంపుటమిది. ఈ వందలో నూరు రేకులు సమగ్రముగ నున్నవి.

తాళ్లపాకకవుల సారస్వతము సర్వకావ్యధర్మములకు కాణాచి. 25 వ సంపుటమున కృద్ధిత్తనామధాతువులను గూర్చి లఘువుగ చర్చించితిని. ఈ సంపుటమున ప్రాచీనాచార్యులగుణాలంకారసరణి లఘువుగ చర్చింపదలచితిని.

ప్రాచీను లంగీకరించిన ఓజః ప్రసాదమాధుర్యములలో మొదటి గుణము ఈతని రచనలలో అరుదుగా కన్పట్టును. తుది రెండు గుణములు ఈతని రచనయందంతటా అలముకొనియున్నవి. మరి శృంగారకీర్తనలయందు సంభోగవిప్రలంభాత్మకమైన శృంగారము మాధుర్యమునకు ఆటపట్టుగా, ప్రసాదగుణము అధ్యాత్మశృంగారముల-యందంతటను స్థానమేర్పరచుకొన్నది. పొదిపొదిను తెలుగు-పదములతో రచన బహుళముగా సాగినది. కావున ప్రసాదగుణమునకు కొరతే లేదు. ఎక్కడనైన కవి తానుగా కావలసి కూర్చిన-ప్రహేళికలయందుమాత్రము అర్థము దుర్గమముగా కన్పట్టును. అదీ గాక నిరంతరస్వామిస్మరణము. స్వామియందు లగ్నమైనమనస్సు ఈ సంకీర్తనధారకు కారణములు. ఎప్పుడైన భాషను, భావమును మరచి తన్మయీభావము చేకూరినపుడు, తననోటివెంట ఏమివచ్చుచున్నదో కూడ ఈ కవిమహాత్ముడు గమనించినట్లగపడదు. అట్టి పట్టులమాత్రమే శృంగారమునందుకూడ దుర్గమత్వము గోచరించు

చుండును. అట్టులను పాటలలో 'ఈ పాటలోని భావము సుస్పష్టమగుటలేదు' అని సూచించుచునే వచ్చినాను. అధ్యాత్మకీర్తనలలో ప్రతిస్మృతిపురాణసిద్ధములైన భావములు స్పష్టముగనే తెలియుచుండును. ఎక్కడనో అలౌకికముగ తాము భావించినప్పుడు మాత్రమే అవి కొంచెము మరుగుననుండును. అట్టి స్థలములందుకూడ 'ఈ పాటలోని భావము అర్థమగుటలేదు' ఇత్యాదిగా సూచించుచునే వచ్చినాను.

ప్రకృతమైన విరామము. గుణములు సంఘటనాశ్రయములని, అలంకారములు శబ్ద, అర్థ, ఉభయాశ్రయములని పెద్దలమాట. ఇక్కడ సంఘటనలు రసానుగుణముగ మార్పు చెందవలసినఅవసరము లేదు; ఎక్కడనైన ఒకటి భావోద్వేగము కలిగినప్పుడు తప్ప. అదీక్వాచిత్కమే. గుణములు సంఘటనను (పదబంధమును) ఆశ్రయించి సాక్షాత్తుగ రసస్ఫోరకములు అలంకారములు శబ్దార్థములద్వారా రసస్ఫోరకములు. 'అలంక్రియతే అనేన ఇతి అలంకారః' ఈ శబ్దార్థములు అలంకరించునని మాత్రమే. అలంకరింపబడునది వేరొకటి ఉండవలెనుగదా. ఆ అలంకార్య వస్తువు ఏది? అని ప్రశ్నించుకుంటే మరల రసముదగ్గరకే ప్రయాణము. అధ్యాత్మకీర్తనలయందు శాంతరసము, శృంగారకీర్తనలందు నానావిధములైన శృంగార-రసాలు అలంకారములను [illegible]చుచున్నవి.

ఈ శృంగారరసముకూడ అన్నికీర్తనలయందును అలంకారములను పాటించదు. ఎక్కువ భాగము విభావానుభావ సంచారిభావములను ఉద్దీప్తము చేయుచు, వాని మూలమున శృంగారరసమును ధ్వనించుచువచ్చినది. ఉపయోగించిన రూపక పరిణామ, అపహ్నవ, స్మరణ, ఉదాత్త, అతిశయోక్త్యలంకారములు ప్రధానముగ ఎక్కడ చూచినా కన్పడునవి. తక్కిన అలంకారములు సాధారణముగ అరుదనే చెప్పవచ్చు. అక్కడక్కడ ఉదాహరణములను జోడించినపుడు

మాత్రము శ్లేషకూడ స్థానము కల్పించుకొనుచు వచ్చినది. రస వత్త్వయోఽలంకారము లంతటా నిండినవే.

సంస్కృతమున సంఘటనను గూర్చి అసమాస, అల్పసమాస, దీర్ఘసమాస యని మూడువిధములుగ విభజించి చూపించినారు. రసానుకూలముగ వాటివాటిస్థానములనుకూడ ఉదాహరించినారు. ఆయాగుణములకు ఆయాసంఘటనలు ఆశ్రయమౌటచే, అట్లుకాక విపరీతమైనప్పుడుకూడ పదములయందలిశక్తితో రసభావములు కుంటువడవనికూడ నిరూపించినారు. ఇట్టి విషయములకు ధ్వన్యాలోక-కావ్యప్రకాశాదులు నిధానములు. మనఅన్నమయ్యలో[4] తొలి రెండు తెగలసమాసములకే తప్ప, మూడవ తెంగతి సమాసమునకెక్కడనో గాని స్థానములేదు.

తెలుగు సమాసముల రచనలలో "ఆంధ్రం షడ్వర్ణవర్జితం" అను నియమమును ఈత డెప్పుడు లెక్కగొనలేదు.

ఉదాహరణము :

గట్టివలిపెపుచంద్రకావి యిది (12-284);

మేనవారిపిన్నదాని; గాంటమెనగుబ్బలచక్కనిదాన (12-285) ముదితజఘనముమీంది మొలనూలిగంటలు; కొమ్మ పయ్యెదలోని కుచమూలరుచి (12-259)

పిడికిటితలంబాలపెండ్లికూంతురు (12-185)

జోకైనతనవాలుంజూపులచేం (12-177) ఇత్యాదులు. ఇంకను పెద్ద పెద్దతెలుగుసమాసములుకూడ కలవు.

సమాసరచనలో ఈతని దొకకొత్తపద్ధతి. ఆ విశేషము 27 వ పుటమున నిశదముగా వ్రాసినాను. ఏమైనను రచనలో ఎక్కువ

భాగము తునకతునుకతెలుగుపదములతో తిక్కనగారు చెప్పినట్లు 'కాహళ' సంధించినవిధముగా కూర్చుచే ఈతవిసరళి. ఈతని రచన పైకి తేటగా కనపడినను యోచించుకొద్ది లోతులు దాకు పద్ధతి అడుగడుగున కన్పట్టుచుండును. ఈ క్రింది పాటలో ఈ భావము స్పష్టముగ తెలియుచున్నది.

శంకరాభరణం

తరుణి నీయలుక కెంతటి దింతి నీవేళఁ
గరుణించఁగదర వేంకటశైలనాథా ॥ పల్లవి ॥

వొకమారు సంసారమెల్లఁ బొమ్మని తలఁచు
వొకమారు విధినేఁత లూహించి పొగడు
వొకమారు తనుఁజూచి వూరకే తలవూఁచు
నొకమారు హర్షమున నొంది మే మఱచు ॥ తరు ॥

విన్నుఁజూచి వొకమారు విలువెల్లఁ బులకించు
తన్నుఁజూచి వొకమారు తలపోసి నగును
కన్నుఁ దెరచి విన్నుఁజూచి కడు సిగ్గువడి నిలిచి
యిన్నియును దలపోసి యింతలో మఱచు ॥ తరు ॥

వదలైనమొలనూలు గదియించు నొకమారు
చెదరిన కురులెల్లఁ జెరుగు నొకమారు
అదనెరిఁగి తిరువేంకటాధీశ పొందితివి
చదురుఁడవు నినుఁబాయఁజాల దొకమారు ॥ తరు ॥

(12 సం—70పాట)

ప్రణయకలహములో అలిగినపతిమతి నొప్పి తీరునట్లు నాయిక దశను అప్పటి ఆమె దయనీయస్థితివి. కేవలము సంచారిభావములతో

ఊహింపజేసి రసములొలికించినాడు. వియంతటి మహావియుడు కోపగించుటకు తగినస్థానమా దానిది. ఇది పిచ్చికపై బ్రహ్మాస్త్రము కాదా. ఈ నాటికి చెలిని కరుణించరాదా, అని పల్లవిలో చెప్పి, 'ఒక మారు సంసార మొల్లఁబొమ్మని తలఁచు' అను పాదముతో నిర్వేద మును, 'వొకమారు విధినేఁతలూహించి పొగడు' అనుపాదముతో దైన్యమును, 'వొకమారు తనుఁజూచి వూరకే తలవూఁచు' అను దానితో వితర్కమును, 'వొకమారు హర్షమున నొంది మే మరచు' అను దానితో మోహమును' 'విన్నుఁజూచి వొకమారు విలువెల్లఁ బులకించు' అను దానితో ఔత్సుక్యమును, 'తన్నుఁజూచి వొకమారు తలపోసి నగును' అనుపాదముతో అపస్మారమును 'కన్నుఁదెరచి నినుఁజూచి కడుసిగ్గువడి నిలిచి' అను దానితో వ్రీడను, 'యిన్నియును దలపోసి యింతలో మరచు' అన్నపాదముతో మరల మోహమును, 'వదలైనమొలనూలు గడియించు నొకమారు' అను దానితో మరల ఔత్సుక్యమును, 'చెదరిన కురులెల్లఁ జెరుగు నొకమారు' అను-దానితో మరల ఆవేగమును, ఈ భావములన్నింటితో భావశబలతను సృష్టించి, మూడవచరణము కడపటి రెండుపాదములలో దానికంతటికి ఫలితముగ సమాగమమును వర్ణించి చరితార్థుడైనాడు.

శృంగారము వర్ణించుపట్టులందు విభావ, అనుభావ, సాత్త్విక-భావ, సంచారిభావములనే ఎక్కువగ వర్ణించుచు తిమ్మాలమున రసా-స్వాదనకు దారి చూపినాడు. "విభావానుభావసంచారిసంయోగాద్రస-నిష్పత్తిః" అనునది భరతసూత్రము. దీనికి మమ్మటాచార్యులు "యద్యపి విభావానాం అనుభావానాం ఔత్సుక్య-వ్రీడా-హర్ష-కోపాఽ-సూయా-ప్రసాదానాం చ కేవలనామత్రస్థితిః, తథాప్యేతేషాం అసా ధారణత్వం ఇత్యన్యతమద్వయాక్షేపకత్వే సతి నానైకాంతికత్వమితి "(కావ్యప్రకాశః 4 ఉల్లాసః 28 కారికావృత్తిః)" అని వ్యాఖ్యానించి పైవానిలో ఏ ఒకటి రెండు బలవత్తరములైనను తక్కినవి ఊహతో

తమంతకు తామే తోచి సహృదయుని రసపరవశుని చేయును అని నిరూపించినాడు. దీనినే "యత్రక్వచిత్ ఏకస్మాదేవ అసాధారణాత్ రసోద్భేదః తత్ర ఇతరద్వయమాక్షేప్యమ్" అని పండితరాయలు ధ్రువీకరించినాడు.

మన అన్నమయ్యలో రచన అంతయు ఎక్కువ భాగము. గుణ ప్రధానముగ సాగుచున్నది. అనగా శ్రోతులు తాకి పరామర్శించిన గాని భావము బయటపడదన్న మాట. గుణములు శౌర్యాదులవలె ఆత్మధర్మములు కదా. మనిషి బక్కచిక్కియున్నను పరపరాక్రమ అసహిష్ణుత, దానిని క్రిందు చేయవలెనను ఉత్సాహము, కొందరి-యందు గోచరించుట మనమెరుగుదుము. అట్టులే అన్నమయ్యశైలి తేటతెలుగు పదములతో దుర్బలముగ కనబడుచున్నను నెమరువేయు-కొద్ది భావములు ఉవ్విళ్లూరుచుండును. ఈ క్రింది పాటను రసికులు గమనింపగలరు.

శ్రీరాగం

మరువనగరిదండ మాయిల్లెఱఁగవా
విరులతావులు వెల్లవిరిసేటిచోటు ॥ పల్లవి ॥

మఱఁగుమూఁకచింతల మా యిల్లెఱఁగవా
గుఱుతైన బంగారుకొండలసంది
మఱపుఁదెలివియిక్క మాయిల్లెఱఁగవా
వెఱవక మదనుఁడు వేఁటాడేచోటు ॥ మరు ॥

మదనువిపెదసంత మాయిల్లెఱఁగవా
చెదరియుఁజెదరనిచిమ్మఁజీఁకటి
మదిలోన పీపులదేటిమాయి ల్లెఱఁగవా
కొదలేక మమతలు కొలువుండేచోటు ॥ మరు ॥

మరులుమ్మొతలతోఁడ మాయిల్లెఅఁగవా
తిరువేంకటగిరిదేవుఁడ నీవు
సరుమ్ముద్రలవాకిలి మాయిల్లెఅఁగవా
విరతము నీసిరులు వించేటిచోటు ॥ మరు ॥

(12 సం—282 పాట)

ఇందు 'గురుతైన బంగారుకొండలసంది' 'వెరవక మదనుఁడు వేఁటాదే చోటు', 'చెదరియుఁజెదరని చిమ్మఁజీఁకటి' 'కొదలేక మమతలు కొలువుండేచోటు' మొదలగు పదములలోని భావములు వివరించితే పచ్చియగునని వదలితిని.

ఈతని సంపుటనాగుణము శృంగారమును అధ్యాత్మ విద్యగా కూడ మార్చించుచున్నవి.

ముఖారి

పలుకుఁదేనియల మపారమియ్యవే
అలరువాసనలనీయధరబింబానకు ॥ పల్లవి ॥

పుక్కిటిలేనగవు పొంగుఁబాలు చూపవే
చక్కనినీవదనంపుచందమామకు
అక్కరో నీవాలుఁగన్ను లారతిగా నెత్తవే
గక్కన నీచెక్కుతొలకరిమెరుపులకు ॥ పలు ॥

కమ్మనినీమేనితావి కానుకగా నియ్యవే
పమ్మగిఁత చల్లెడినీవూరుపులకు
చిమ్ములనీచెమటలఁ జేయవే మజ్జనము
దిమ్మరి నీమురిపెపుతీగెమేనికి ॥ పలు ॥

పతి వేంకటేశుఁ గూడి పరవశమియ్యావే
యితవైన నీమంచిహృదయానకు
అతనినే తలఁచఁగ నావతియ్యఁగదవె
తతితోడ నీలోనితలపోఁతలకు ॥ పలు ॥

(సం. 12–221 పాట)

శ్రీరాగం

ప్రతిలేనిపూజ దలఁపఁగఁ గోటిమణుఁగులై
అతిపరవశము బ్రహ్మానందమాయ ॥ పల్లవి ॥

మాపనీమణిమనసు మంచియాసనమాయ
నానందబాష్పజలమర్ఘ్యాదులాయ
మీనాశికనుదోయి మించుదీపములాయ–
నాననసుధారసం బభిషేకమాయ ॥ ప్రతి ॥

మగువచిరునవ్వులే మంచిక్రొవ్విరులాయ
తగుమేనిశావి చందనమలఁదుటాయ
విగవిగవితనుకాంతి నీరాజనంబాయ
జగడంపుటలుక లుపచారంబులాయ ॥ ప్రతి ॥

ననుపైనపొందులే నైవేద్యతతులాయ
తనివోనివేడుకలు తాంబూలమాయ
వనిత తిరువేంకటేశ్వరునికౌఁగిటఁ జేయు–
వినయవిసరంబు లరవిరిమొక్కులాయ ॥ ప్రతి ॥

(సం. 12–301 పాట)

ఈపాటల్లో పూజకుపయోగపడు షోడశోపచారములు శృంగారమునకు ఎట్లు వాదిగి వచ్చినవో ప్రసాదగుణము, మాధుర్యము చెప్పక చెప్పు చున్నవి.

శృంగారరస సామ్రాజ్యముగ ఈతవి సంఘటన ఈ క్రింది పాటలో వెల్లివిరియుచున్నది.

ముఖారి

చెప్పరా దీయింతిసిరులు దీని—
    చొప్పులిన్నియుఁ జూడ చొరవులోకావి ॥ పల్లవి ॥

ముదితజఘనముమీఁదిమొలనూలిగంట లవి
    కదలురవ మెట్లుండెఁ గంటిరే చెలులు
    మదనుఁ డుండెడిహేమమందిరము దిరిగిరాఁ
    గదిసి మ్రోసెడి పాంఠఘంటలోకావి ॥ చెప్ప ॥

కొమ్మపయ్యెదలోనికుచమూలరుచి వెలికిఁ
    జిమ్ముటది యెట్లుండెఁ జెప్పరే చెలులు
    యిమ్మైనమురుధనములెల్ల రాసులువోసి
    కమ్ముకొని చెంగావి గప్పిరోకావి ॥ చెప్ప ॥

నెలతకంఠమునందు నీలమణిహారములు
    అలరు టెట్లుండు కొనికూడరే చెలులు
    లలితాంగి ప్రాణవల్లభుఁడు వేంకటవిభుఁడు
    నెలకొన్నకౌఁగిటనే పిలిచెనోకావి ॥ చెప్ప ॥

(12 సం—259 పాట.)

ఈపాటలోవి అపూర్వభావరచన కొన్ని వేలసందిప్రబంధకవులను వెలకు కొనగలదు గదా? మొదటి రెండు చరణములను వ్యాఖ్యానిస్తే పువ్వు నలిపి వాసన చూచినట్లగునని మానితి.

## అలంకారములు

అలంకారశాస్త్రమునందు తర్కశాస్త్రము ప్రవేశించిన దాదిగా అవచ్ఛేదకావచ్ఛిన్నములతో అలంకార సర్వస్వమే అడుగంటినదని చెప్పెడు పెద్దలు కూడ లేకపోలేదు.

వాచం కవీనా మువలాలయన్త్యాం
భుంక్తే రసజ్ఞో యువతిం యువేవ।
తామేవ భుంక్తే నను తార్కికోఽపి
ప్రాణాన్ హరన్ భూత ఇవ ప్రవిష్టః॥

(శివలీలావర్ణము 1—69)

అనిన నీలకంఠునిభావమే పై నామాటకు కారణము. పెద్ద సహృదయుడు, మహాకవి అయిన ఈతదెందుకో తర్కశాస్త్రమును ప్రత్యక్షముగ పరోక్షముగ పరిహాసముగ పరమార్థముగ ఎత్తిపొడుచుచునే ఉండును. హాలాహలము వెలికి వచ్చినతరువాత దేవతలందరు కొందలపాటుతో జడిసిరి. పరమేశ్వరుడు దానిని మ్రింగెను. అప్పుడు లోకము ప్రశాంతమాయను. ఆస్థితిని వర్ణించుచు

అజని శనైర్విశదం జగదపసర్పతి కాలకూటసంతమసే
తాత్పర్యమివ కవీనాం తార్కికకోలాహలోపరమే॥

(నీలకంఠవిజయ చంపువు 4—30)

అని అభివర్ణించినాడు. ఏ పరిష్కరణమునకైన తర్కశాస్త్రమువంటి గట్టిది మరొక్కటి లేదు. అలంకారములను పరిష్కరించునప్పుడు పండితరాయలకు పట్టుగొమ్మ ఈ శాస్త్రమేకదా। ఇది అప్రస్తుతమైనను ఊరక మతభేదములను తెలుపుటకు ఉదాహరించితినంతే. ధ్వన్యాలోకమునందుకూడ పకడ్బందీగా తర్కశాస్త్రపరిష్కరణము కనపడక పోయినను సాహిత్యరూపముగ తర్కశాస్త్రము ప్రతివాక్యమునందును కన్పట్టుచునేయుండును.

ఈతవిరచనలో రసవదలంకార ప్రేయోఽలంకారములు ప్రధాన స్థానము నలంకరించినను, తక్కిన అలంకారములుకూడ యథావకాశ-

ముగ స్థానము కల్పించుకొన్నవి. అందుచేతనియే "అలంకారాన్తరాణిహి నిరూప్యమాణదుర్ఘటనాన్యపి రససమాహితచేతసః ప్రతిభానవతః కవేః అహంపూర్వికయా పరాపతన్తి" అని ఆనందవర్ధనుడు[1]

అందుకనియే కావ్యప్రకాశకారుడు

"ఉపకుర్వంతి తం సంతం యేఽంగద్వారేణ సంశితాః[1] హారాదివ దలంకారాః తేఽనుప్రాసోపమాదయః" అని ప్రారంభించినాడు ఆయా యలంకారముల స్వరూపస్వభావవైలక్షణ్యములను విద్యానాథుడు సవిమర్శముగ నిరూపించినాడు. ఈతని కవిత్వమునందు ఛేకాను ప్రాస, వృత్త్యనుప్రాస, పునరుక్తవదాభాస, లాటానుప్రాసములు చాల స్వల్పముగ కన్పడుచుండును.

అంత్యానుప్రాసములు పై వానికంటె విరివిగ తోచుచుండును. ఉదాహరణములు.

కేదారగౌళ

తనచేతి దీకను ధర్మము పుణ్యము
చొనిపి యింకాఁ దన్ను నొలనేఁటి దేఁటిదే ॥ పల్లవి ॥

ములువాఁడి కొనగోరి మొనలు వాఁడి
కలయని తనతోడికాఁకలు వేఁడి
అలసితి రెంటివల్లా నప్పుడే నేను
యెలమి వింకాఁ దనతో నేఁటిమాఁటలే ॥ తన ॥

సారపుఁ బయ్యెదలోని చన్నులు గట్టి
సారెకు నాడే సరసములు పెట్టి
ఆరితేరె నింకానందు నందరిలోన
మారుకొని యింకాను మరి యేఁటిపొందులే ॥ తన ॥

1. పుట 224, ధ్వన్యాలోకము 1940 చౌఖంబా ముద్రణాలయము.

నెమ్మి పీడినతురుమునెరులు చిక్కి
కమ్మరఁ గూడినయట్టి కాఁగిలి చొక్కి
నమ్మించి శ్రీవేంకటేశుఁడు నన్నేలెను
సమ్మతిఁ దనకు నాకు సరినేఁటి సిగ్గులు ॥ తన ॥

(ఈ సంపుటము - 125 పాట)

ఇందు మూడు చరణములందును మొదటి రెండేసి ప్రాసములు అంత్యాను ప్రాసకుదాహరణములు.

ఆహిరి

ఇంటికి విచ్చేసితివి యెంతవనికి
అంటిసుదివంటిదాన నందుకోపేనా ॥ పల్లవి ॥

యెంగిలిమోవిదాన యేడలేనిసిగ్గుదాన
పొంగేటిచెమటలతోఁ బొరలేదాన
వంగనిచన్నులదాన వాడికెవలపుదాన
పంగెనకోపముదాన బాఁతియ్యేనా ॥ ఇంటి ॥

సన్నపునడిమిదాన సనపుఁజూపులదాన
వెన్నెలనవ్వులతోడివీరిడిదాన
నువ్వునిచెక్కులదాన నూఁగురులకొప్పుదాన
పిన్నదాన నే నీకుఁ బ్రియమయ్యేనా ॥ ఇంటి ॥

చిగురుఁబాదాలదాన చిమ్ముఁజూపులదాన
వెగటుఁబిఱుఁదుగలవేఁకపుదాన
విగిడి శ్రీవేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
జిగిబిగువులదానఁ జిత్తము వచ్చేనా ॥ ఇంటి ॥

(ఈ సంపుటము - 188 పాట)

ఇందు మూడుచరణములందును రెండు నాలుగు పాదములందు తప్ప మిగత పాదములందంతటా అర్ధర్ధపాదములకు అర్థ భేదములేని యమకము సృష్టింపబడినది.

అహిరి

మోహంపురతిమదము ముద్దుఁజూపులమదము
దేహంపుసొబగెల్లఁ దెలిపె నదమదము ॥ పల్లవి ॥

మించుమల్లెలగిలుకు మెరుఁగుగుబ్బలకులుకు
పంచుఁజూపులచిలుకు పసివాడుఁబలుకు
మించుఁజెమటలతళుకు మనసులోపలియళుకు
అంచుటధరపుబెళుకు అలమేఁటిజళుకు ॥ మోహం ॥

కరమూలములఁ గరఁగు కదలుఁబయ్యెదచెరఁగు
సికలచెలువపుమొరఁగు చెక్కుపై మరఁగు
గరిగరికెతతు లెరుఁగు ఘాతలంటినతెరఁగు
గంమెతో చెలియునికి కప్పురపుటరఁగు ॥ మోహం ॥

కలికితనములపోగు కమ్మఁదావులవేఁగు
వలపుతమకములపరవశము పెనుజాగు
కలకంటిబాగు వేంకటపతికిఁ జెలరేఁగు
చెలియ సమరతుల మించినవింతబాగు. ॥ మోహం ॥

(12 సంపు—302 పాట)

ఈపాటయందు ప్రతిచరణమునందును ప్రతిపాదార్ధమునకును అంత్యానుప్రాస చేయబడుపుగా సాగినది.

### సామంతం

కనుఁగొనవయ్యా కలికిని
కొలువు(కొనుపు?)నఁ జిలుకలకొలికిని ॥ పల్లవి ॥

వదనకమల మటు వంచి
పొదిగొనుచూపులఁ బొంచి
మెదలేటికళలను మించి
అదె నీపయిఁ జెలి యాసలు నించీ ॥ కను ॥

మునుకొని చేతుల మొక్కి
వినువుఁదమకముల విక్కి
తపియనిమాఁటల దక్కి
పనివడి నీపాదము దొక్కి ॥ కను ॥

పలురాగంబులఁ బాడి
వలవంతల వసివాడి
యెలమిని శ్రీవేంకటేశుపై యాడి
అలమేల్మంగ విన్నంకెలఁ గూడీ ॥ కను ॥

(24 సంపు—808 పాట)

పాట అంతటా అన్నిపాదములయందును అంత్యానుప్రాసము సూటిగా హృదయంగమముగా మలచినాడు.

### పళవంజరం

మనసుకు మనసే మరి తారుకాణవచ్చె
చెనకినచెనకులు చేచేత మన్నవి ॥ పల్లవి ॥

వలపులు పరివచ్చె వనిత విన్నమెచ్చె
పొలసి యుండఁగా నాపె పొగడెనయ్యా
కలలు నిక్కములాయ కగుసుగ్మములు రాయ
కొలువులో నాపెవద్దఁ గూచుండవయ్యా ॥ మన ।

నవ్వులు నెఱవి ముంచె ననుపులు లోలో మించె
  మవ్వముతో నిన్ను నాపె మరిగెనయ్యా
  జవ్వనము సరిదూఁగె జగడములెల్ల దాఁగె
  చివ్వన లోనికివి విచ్చేయవయ్యా ॥ మన ॥

చూపులఁ గళలు నిండె సురతము పంటవండె
  వోపిక నిన్నాపె నోరూరించెనయ్యా
  యేపున శ్రీవేంకటేశ యిద్దరుఁ గూడితి రిట్టె
  తీపుల నాపె సురము దించకువయ్యా ॥ మన ॥

(ఈ సంపుటము – 222 పాట)

ఈపాటలో తొలి రెండు చరణములందు, ఒకటవ మూడవ పాదము లందు పాదార్ధములకూ, మూడవ చరణము తొలి పాదమునందు పాదార్ధమునకుమాత్రము అంత్యానుప్రాసము వింపినాడు.

### దేవగాంధారి

ఇంక నెంతగావలె యీవలపూ
  యింకిదు చెక్కుచెమట యిదెకాదా వలపు ॥ పల్లవి ॥

పెదవిపై పీదెపుఁబిసరు
  అదన నిన్నుఁజూచి యసురుసురు
  పదరి పయ్యదకొంగుపై విసరు
  మొదిగించెఁ జెలి పీపై విదెకాదా వలపు ॥ ఇంక ॥

గక్కన మనసులోవికరఁగూ
  మొక్కలపుసిగ్గులతో మొరఁగూ
  మిక్కిలిమరుకళల మెరుఁగూ
  యిక్కువలు చూపెఁ జెలి కదిగాదా వలపూ ॥ ఇంక ॥

ననుపుతో సెలవులవగవూ
పెనఁగేటికాఁగిటివిగువూ
యెనసె శ్రీవేంకటేశ యింతి విన్నునూ
యిసుమడించెఁ దమక మిదిగాదా వలపూ ॥ ఇంక ॥

(ఈ సంపుటము-249 పాట)

ప్రతి చరణమునందును నాల్గవ పాదమును తొలగించి ప్రతి పాద మందును అంత్యాను ప్రాసమును పాటించినాడు.

పాడి

నాతో దాఁచక చెప్పవే నాతిరో నీవు
యీతనువు నోఁకినవాఁ డెంతభాగ్యవంతుడే ॥ పల్లవి ॥

చక్కని వెన్నెలపూట సతి నీనవ్వులతేట
మొక్కలలోని మొలఁగు మోవితెలఁగు
రెక్కతుమ్మిదలవొప్పు నిక్కినసీపెద్దకొప్పు
యిక్కువ పిన్నేలినవాఁ డెంతభాగ్యవంతుఁడే ॥ నాతో ॥

అలచందురువిదీము అలివ నీనెమ్మోము
కలువలమైబాగులు కన్నునోగలు
లలితంకముకులము లక్షణపునీగళము
యిల నీమగఁడై నవాఁ డెంతభాగ్యవంతుఁడే ॥ నాతో ॥

విరతిఁ గొండపొడవు నీచన్నులవడువు
మరువికొలువు నీ మర్మపునిలువు
సిరుఁ గూడె విన్నట శ్రీవేంకటేశుఁడట
యిరవై నీవు గలవాఁ డెంతభాగ్యవంతుఁడే ॥ నాతో ॥

(ఈ సంపుటము-367 పాట)

ఈ పాటలో మూడవ చరణము కడపటి రెండు పాదములూ మొదటి-రెండుచరణములలోని కడపటిపాదములుతప్ప తక్కినచరణము లందంతటా మనోహరమైన అంత్యానుప్రాసము.

రామక్రియ

ఇదె శిరసుమాణిక్య మిచ్చి పంపె నీకు నాకె
అద నెఱిఁగి తెచ్చితి నవధరించవయ్యా ॥పల్లవి॥

రామ నినుఁబాసి నీరామ నేఁ జూడఁగ నా-
రామమున నినుఁబాడె రామరామ యనుచు
ఆమెలుఁత సీతయని యప్పుడు నేఁ దెలిసి
నీముద్రవుంగరము నే నిచ్చితిని ॥ఇదె॥

కమలాప్తకులుఁడ నీకమలాక్షి నీపాద-
కమలములు దలపోసి కమలారి దూరె
నెమకి యీలేమ నే నీదేవి యని తెలిసి
అమరంగ నీసేమ మటు విన్నవించితి ॥ఇదె॥

దశరథాత్మజ నీవు దశశిరునిఁ జంపి యా-
దశమున్న చెలిఁగావు దశదిశలుఁ బొగడ
రసికుఁడ శ్రీవేంకటరఘువీరుఁడ నీవు
శశిముఖిఁ జేకొంటివి చక్కనాయఁ బనులు ॥ఇదె॥

(26 సంపుటము-229 పాట)

ఈ పాటయందు మాత్రము ఛేకానుప్రాస, వృత్త్యనుప్రాసములు రెండును జంటగ నడచినవి. పనిబూని ఈ పనిగూడ నాకు చేత వచ్చునని చూపుటకు చేసిన రచనగా ఇది తోచుచున్నది.

ఈపై చూపిన శబ్దాలంకారముల వంటివి ఈ రచనలో పెక్కు గలవు. అర్థవిశేషము ఏ కొన్ని స్థలములలోనో ఉండును. కాని తక్కిన స్థలములయందంతటా శబ్దమాధుర్యమునకే అగ్రస్థానము.

అర్థాలంకారములు:

నాదరామక్రియ

ఎటువంటివిలాసిని యెంతజాణ యీచెలువ
తటుకన నీకు దక్కె దైవారఁ జూడవయ్యా ॥

మగువ మాటాడితేను మాణికాలు చింకుకొనీ
పగడాలు పెదవులఁ బచ్చిదేరీని
మగిడి చూచితేను మంచినీలా లుప్పతిలీ
తగు నీకు నీపెదిక్కు తప్పక చూడవయ్యా ॥ ఎటు ॥

పదఁతిజవ్వనమునఁ బచ్చలు గమ్ముకొనీని
నడచితే వైడూర్యాలు వెదలీ గోళ్ల
తొడిఁబడ నవ్వితేను తొరిగీని వజ్రాలు
వాడికమైనది యీపెవొరవు చూడవయ్యా ॥ ఎటు ॥

కొమ్మ ప్రియాలతేనెలఁ గురిసీఁ బుష్యరాగాలు
తుమ్మరించీఁ జెనకుల గోమేధికాలు
ముమ్మరపుఁజెమటల ముత్తెపుసరాలు నిండీ
నెమ్మది శ్రీవేంకటేశ నీదేవిఁ జూడవయ్యా ॥ ఎటు ॥

(ఈ సంపుటము—30 పాట)

ఈపాటలో అంతటా రూపకాలంకారము, అధ్యవసాయ ప్రధానమైన- అతిశయోక్తి పెనగొని నవరత్నములను చింపి అలంకారసంసృష్టిని రంగరించినాడు.

మాళవి గౌళ

ఎటువలెఁ బొగడినా విన్నిటికిఁ దగినది
ఘటియించె మేలు మేలు కంటిమి యీపేడుక ॥ పల్లవి ॥

చెలిచన్నులబలిమి సింగారానకుఁ గలిమి
అలరుఁగన్నులచూపు అసందాపు
విలువుఁజక్కఁదనము నెమ్మదాఁచినధనము
కులుకుఁగుత్తికసొంపు కోపములగుంపు ॥ ఎటు ॥

కాంతవెట్టినకొప్పు గండుఁదుమ్మిదలకప్పు
చెంత నెన్నడిమికీలు సింగముఁబోలు
యెంతే పిఱుఁదుతీరు ఇంచువిలుతునితేరు
వింత చిరునవ్వులాగు వెన్నెలపోగు ॥ ఎటు ॥

లేమపాదములనోగ లేఁతచిగురులో చేఁగ
భూమిలో మించె యీయమ్మ పుత్తడిబొమ్మ
ఆముక శ్రీవేంకటేశ అలమేల్మంగపతివి
ప్రేమ నేలితివి పొందు బెరసినవిందు ॥ ఎటు ॥

(ఈ సంపుటము—89 పుట)

ఈపాటలో శబ్దాలంకారముతోపాటు రూపక హేత్వలంకారములు రెండును కలిసి, వాచ్యముగనే ప్రేయోఽలంకారమునకు కారణములై అలంకారసంకరముగ భాసించుచున్నవి.

సాంబోధి

ఏమమ్మ యశోద మీయింటికి నేము వచ్చితే
గాముపంటబిడ్డ వచ్చి కలుపడఁ జేసితే ॥ పల్లవి ॥

వాలుగారి సెలవులఁ బక్కనఁ జెక్కుమీఁటితే
వేలువెట్టితే లోకాలు వెలివిరిసి
వీలి నేము పుగ్గువెట్ట పెంతుము మీవాఁడు
బాలుఁడా దయ్యముగాక పట్టవమ్మా ॥ ఏమ ॥

నెమ్మిఁ దొడమీఁద నుండి నిలువు నూరు వండీవి
పమ్మి నాల్గుమోములపాపఁడు లోన నున్నాఁడు
నెమ్మది బాలు వోయఁగ నేవెరతు మీవాఁడు
ఇమ్మల వీఁడు మానిశా యెవ్వఁడోకాక ॥ ఏమ ॥

పక్కన నీరార్చితిఁ బయ్యదలో నిదుకొంటి
మక్కువ నాకే తాను మగఁడై నాఁడు
చిక్కనపను లింకేమీఁ జెప్పఁగనేవెరతును
యెక్కువ శ్రీవేంకటేశుఁ డితఁడేపోయమ్మా ॥ ఏమ ॥

(25 సంపు – 481 పాట)

ఈ పాటలో శ్రీకృష్ణునిపై గొల్లెతలు సందలుమోపుట వర్ణింపబడినను, కవికి కృష్ణునిపైగల వాత్సల్యము, అద్భుతరసప్రధానమై, ప్రేయో-లంకారమునకు దారి చూపినది.

శ్రీరాగం

కంటిమిదివో నేము కన్నులపండుగగాను
జంటలఁగొలువై నీవు చనవియ్యఁగాను ॥ పల్లవి ॥

హేమంతకాలము నేఁడు యిటు నీతిరుమేన
అముకొవి జనియించినట్లుండెను
భూమిఁగలకప్పురము పొదిసేసి పిలువెల్లా
నేమముతో నిందరును నీకుఁజాతఁగాను ॥ కంటి ॥

వానకాలము నీలవర్ణముతోఁ దిరుమేన
సోనమై కురిసినట్లు చూపట్టెను
సేనగాదట్టుపుణుఁగు చిత్తడిగా సర్వాంగాల
పూని యిందరును నీకుఁ బూయఁగాను ॥ కంటి ॥

వసంతకాలము తానె వచ్చి నీతిరుమేన
యెసగినట్టు శ్రీవేంకటేశ తోఁచెను
వెస నలమేల్మంగతో వింతసొమ్ము నీవురాన
పొసగించందరు విన్నందరు బొగడఁగాను ॥ కంటి ॥

(ఈ సంపుటము – 142 పాట)

ఈపాటలో స్వామి కవిమనసున ఎన్ని ఊహాలు రేకెత్తించినాడో ఉత్ప్రేక్షాలంకారము బాగుగా నిరూపించినది. ఇందు ఋతు వర్ణనము కూడ మిళితమై అప్రస్తుతప్రశంసకు దాఁటిసి ఉత్ప్రేక్షా-ప్రస్తుతప్రశంసలసంకరముగ ఈ పాట తీరినది.

శుద్ధ రామక్రియ

ఇన్నిరాసులయునికి యింతి చెలువపురాశి
కన్నె నీరాశికూటమి గలిగినరాశి ॥ పల్లవి ॥

కలికి బొమవింట్లుగలకాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికివి మీనరాశి
కులుకుకుచకుంభములకొమ్మకును కుంభరాశి
చెలఁగుహరిమధ్యకును సింహరాశి ॥ ఇన్ని ॥

చిన్నిమకరాంకపుఁబయ్యెదచేడెకు మకరరాశి
కన్నెపాయపుసతికి కన్నెరాశి
వన్నెమై పైఁడితులఁదూఁగువనితకుఁ దులారాశి
తిన్నవివాఁడిగోళ్ళసతికి వృశ్చికరాశి ॥ ఇన్ని ॥

ఆముకొననొరపుల మెరయునతివకు వృషభరాశి
గామిడిగుట్టుమాఁటలసతి కర్కాటకరాశి
కోమలపుచిగురుమోవికోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతిఁ గలపె ప్రియమిథునరాశి ॥ ఇన్ని ॥

(12 సంపుటము – 143 పాట)

ఈతనికి జ్యోతిశ్శాస్త్ర పరిచయము కలదనీ ఈ రాశి కూట ములపాట తెలుపుచున్నది. ఇందు రూపకాలంకారము మిగతా అన్ని అలంకారములను వెనుకకు నెట్టి నిట్టబొడుచుకొని చూచుచున్నది.

ఈపై అలంకారములను ప్రతిపదార్థసమన్వయముతో చూపుట-యన్న పీఠిక బరువెక్కునన్న భావముతో తొలగించితిని.

ఈ శబ్దాలంకారములన్నియు పరంపరగ వేంకటేశ్వరునికి, నాయికయగుఅన్నమయ్యకునడుమ సంభోగవిప్రలంభశృంగార-ములను యథావిధిగ పోషించుచు రసవత్ప్రయోగాలంకారములకు దారితీసినవనుట నిర్వివాదము.

తాళ్ల పాకకవుల సంగీతసాహిత్యములను వెలుగులోనికి తెచ్చి సహృదయులకు అందివ్వవలెనను సత్సంకల్పము, దానికి సొమ్మెంత యైనను ఖర్చుపెట్టుటకు వెనుకాడనిదీక్ష కలిగి, ఉత్సాహమురూపొంది నట్లు అగపడుచున్న కార్యనిర్వహణాధికారులు శ్రీ P. V. R. K. ప్రసాద్, I. A. S., గారికి నా కృతజ్ఞతాభివాదములు. మెలకువగ పని సత్వరముగ జరిపించు స్వభావముగల తి. తి దే. ప్రెస్ మేనేజరు శ్రీ M. విజయకుమార రెడ్డి గారికిని, వారికన్నివిధముల అండగ నుండి మా పనిని ప్రోత్సహించుచు ముందుకు నడిపించుస్వభావము గల పౌరసంబంధశాఖాధికారి (P. R. O.) శ్రీ R. సూర్యనారా యణమూర్తి, M.A., గారికిని, ప్రతిపదమునంతను వానీడవలె సాయ పడుచున్న 'సప్తగిరి' సంపాదకులు శ్రీ K. సుబ్బారావు గారికిని నా ధన్యవాదములు. నాకీపరిష్కరణ కార్యమునందు సహాయ కుడుగ ఒకటిన్నరసంవత్సరకాలముగ అన్నివిధముల తలలో నాలుక వలె పనిచేయుచున్న శ్రద్ధావిధేయతలు భూషణముగాగల చిరంజీవి J. బాలసుబ్రహ్మణ్యాం, M.A., కును, అచ్చుపని వీలైనంత నిర్దుష్టముగ కొనసాగించునేర్పరులగుఅచ్చుకూర్పరులకును నా మంగళా శాసన

ములు. నాబుద్ధి బలమునకు తగినంతగా జరిగిన ఈపరిష్కరణము-నందు గుణదోషములను గమనించినపెద్దలు దోషములను తెలిపినచో పైపై పరిష్కరణ దు తెలుసుకొను గలిగి ఉండగలమని మనవి.

వేదాంతాఖ్యస్య యద్వాణీ అన్నమాచార్యస్య యా తథా।
యత్నాత్తాదుజ్జ్వలా చక్రే తం వందే కృష్ణదేశికమ్॥

విధేయుడు,
గౌరిపెద్ది రామసుబ్బశర్మ,
స్పెషల్ ఆఫీసరు,
తాళ్లపాక వాఙ్మయ పరిష్కరణశాఖ,
అన్నమాచార్య ప్రాజెక్టు.
తి. తి. దేవస్థానములు.

తిరుపతి,
1-12-80.



శ్రీరస్తు

శ్రీ తాళ్లపాక

# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు

## 29 వ సంపుటము.

స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౬ అగు నేఁటి క్రోధిసంవత్సరమందు, తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన-పదారుయేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను. అదిమొదలుగాను శాలివాహన శకవరుషంబులు ౧౪౨౪ అగునేఁటి దుందుభిసంవత్సరఫాల్గుణ బహుళ ౧౨ నిరువాసకు[1] తిరువేంగళనాథునిమీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపముచేసిన శృంగారసంకీర్తనలు.

రేకు 1301 సౌరాష్ట్రం

సిరులు వేసుక గద్దె నీమూఁ జూచేముగాక
కొలువు సేయవచ్చునా కడలవారికిని ॥ పల్లవి ॥

వలెసిని యింపిడీ వాడక నీవు చూపఁగా
వలవనవచ్చునా వాడవారికి
చలపట్టి యొప్పటివి సలిగెలు నెరపఁగా
పొలసులాడవచ్చునా పొరుగువారికిని ॥ సిరు ॥

---

1. ఈశబ్దము 'నిరోధ' 'నిరుద్ధ' శబ్దములకు వ్యావహారికరూపముగా గానవచ్చుచున్నది. అర్థగింపు, అవధి అని యర్థము. అనాఁడు కడపటిదివసమని తాత్పర్యము. కీ॥ శే॥ ప్రభాకరశాస్త్రిగారూహించిన "సరియగు" అనునర్థము తాత్పర్యార్థము గావచ్చును. 'అవధి' అనునర్థములో "ఈ నిరుద్ధమునకుఁ గుశలంబు మాకు" అను తరిగొండ వెంగమాంబగారిప్రయోగము దీనికి సహాయపడుచున్నది. సాహిత్య అకాడమివారి విష్ణుపారిజాతము 55 పుట. నేఁ డీప్రయోగ మివ్వగా శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణ-శర్మగారు. "నిరుత్తం" అను అరవపదముకూడ 'నిలువు' అనునర్థములో దీనికి సహాయపడునని.

చిఱుతనవ్వులును చిందేటికొప్పుపువ్వులును
కెఱలి నేఁ డెందు దొరకించుకొంటివే
కఱతలమాటలును కన్నులలో తేటలును
గుఱుతు లిన్నేసి యెందుఁ గూడపెట్టుకొంటివే ॥సతి॥

కావరపుఁగెలపులు కమ్మకొన్నవలపులు
యీవేళ నీవెట్టు గడియించుకొంటివే
శ్రీవేంకటేశుఁడట చేరి నిన్నుఁ గూడెనట
వేవేలు నీచేఁత లెంత వెలయించుకొంటివే ॥సతి॥ 4

కుంతలవరాళి

ఆసుద్దులే [1]చెప్పుకొనే మది [2]నీవేలడిగేవు
దోస మానవెట్టకుము తోయరాదు మాకును ॥పల్లవి॥

వోరగండ్లనుఁ జూచి వొయ్యనే [3]నీవాకెను
చేరి వాఁడికొనగోరఁ జిమ్మవా [4]నీవు
సారెకునుఁ దమిరేఁగ సన్నలుసేసుకొంటా
పేరుకొని నీయింటికిఁ బిలువవా నీవు ॥ఆసు॥

తనువుఁదనువు సోఁక దండ నాకెఁ బెట్టుకొని
ననుపుసేసుక కొంత నవ్వవా నీవు
నిను నాపె జంకించఁగా నిమ్మపంట వేసుకొంటా
పెనఁగుచు వలపులు పెంచవా నీవు ॥ఆసు॥

పచ్చిచేర నీవాపెను బలిమిఁ గాఁగిటఁ బట్టి
కొచ్చికొచ్చి మోవి చవిగొనవా నీవు
యిచ్చట శ్రీవేంకటేశ యేలితివి నన్నుఁ నేఁడు
తచ్చి యాకెఁ దెరలోన దాఁచవా నీవు ॥ఆసు॥ 5

1. చెప్పుకొనేము + అది 2. నీవు + ఏల - అడిగేవు. 3. 4 ప్రాసయతి.

ముఖారి

చెప్పవే యాకె కీమాట చెలియా
యెప్పుడూను నాబలిమి యెఱఁగదా తాను ॥ పల్లవి ॥

పంతమాడుకొంటేనేమి పదఁతి తనవిభుని
వంతులకు వలపించవలెఁగాక
యెంతగర్వము చూపినానేమి సగివారిలోన
రంతుతోడ నేఁడు మెరయవలెఁగాక ॥ చెప్ప ॥

యీడువెట్టుకొంటేనేమి ఇల్లాలై యాతనికి
వాదలోఁ బొగడించుకోవలెఁగాక
వేడుకకు బిరుదులు వెసఁ బెట్టుకొంటేనేమి
తోడనే వాసుల తులఁదూఁగవలెఁకా(గాఁ?)క ॥ చెప్ప ॥

యేతులు చూపితేనేమి ఇట్టె శ్రీవేంకటేశుచే
వాతప్పక బాసగొనవలెఁగాక
యీతఁడే నన్నేలె తానూ నేమిసేసినా నేమి
రేతిరిఁ బగలూఁ దమిరేఁచవలెఁగాక ॥ చెప్ప ॥ 3

సామంతం

సతి విన్నింతచేసినజాణనిఁ జెప్పేదిగాక
కతకారి వైతివి కడఁజిన్నదానవు ॥ పల్లవి ॥

చెలులమఱఁగులును చిత్తములో కరఁగులు
తెలిపిగ్గులును యేడఁ దెచ్చుకొంటివే
మలగుపై వోరగులు మరి నివ్వెరగులును
కలికి నీవెటువలెఁ గలిగించుకొంటివే ॥ సతి ॥

చిఱుతనవ్వులును చిందేటికొప్పుపువ్వులును
కెఱలి నేఁ డెందు దొరకించుకొంటివే
కఱతలమాటలును కన్నులలో తేటలును
గుఱుతు లిన్నేసి యెందుఁ గూడపెట్టుకొంటివే ॥ సతి ॥

కావరపుఁగెలపులు కమ్మకొన్నవలపులు
యీవేళ నీవెట్టు గడియించుకొంటివే
శ్రీవేంకటేశుఁడట చేరి నిన్నుఁ గూడెనట
వేవేలు నీచేఁత లెంత వెలయించుకొంటివే ॥ సతి ॥ 4

కుంతలవరాళి

ఆసుద్దులే [1]చెప్పుకొనే మది [2]నీవేలడిగేవు
దోస మానవెట్టకుము తోయరాదు మాకును ॥ పల్లవి ॥

వోరగండ్లనుఁ జూచి వొయ్యనే [3]నీవాకెను
చేరి వాఁడికొనగోరఁ జిమ్మవా [4]నీవు
సారెకుసుఁ దమిరేఁగ సన్నలుసేసుకొంటా
పేరుకొని నీయింటికిఁ బిలువవా నీవు ॥ ఆసు ॥

తనువుఁదనువు సోఁక దండ నాకెఁ బెట్టుకొని
ననుపుసేసుక కొంత నవ్వవా నీవు
నిను నాపె జంకించఁగా నిమ్మపంట వేసుకొంటా
పెనఁగుచు వలపులు పెంచవా నీవు ॥ ఆసు ॥

పచ్చిచేర నీవాపెను బలిమిఁ గాఁగిటఁ బట్టి
కొచ్చికొచ్చి మోవి చవిగొనవా నీవు
యిచ్చట శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
తచ్చి యాకెఁ దెరలోన దాఁచవా నీవు ॥ ఆసు ॥ 5

1. చెప్పుకొనేము + అది 2. నీవు + ఏల - అడిగేవు. 3. 4 [illegible]

దేసాళం

బంగారువంటిమేనెల్లాఁ బచ్చిసేసుకొంటివి
సింగారా లద్దములోనఁ జేరి చూచుకోవయ్యా ॥పల్లవి॥

అగ్గలమై సతిసొమ్ము లవె నీభుజాల నొత్తె
బిగ్గెఁ గాఁగిలించుకొని పెనఁగితివో
వొగ్గి వట్టుగట్టుక వున్నది నెలవిఁ దమ్మ
యెగ్గులేక విడెమునే సింతికిఁ బెట్టితివి ॥బంగా॥

మించి నీచేతులఁ గడుమెఱుఁ[1]గై జిడ్డంటె నదె
పొంచి జవ్వా దాపెమేనఁ బూసితివో
నించి లత్తుకరేకలు నీనొసల నంటినవి
వంచనతో నాపెకు వలచి మొక్కితివో ॥బంగా॥

కప్పి నీచెక్కులవెంటఁ గారీఁ బెఁ(బెం?)జెమటలు
చెప్పరానిచేఁత లట్టె సేసుకొంటివో
యిప్పుడు శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
చొప్పులు నావల్ల గడించుక మెఱసితివో ॥బంగా॥ 6

రేకు 1302 ఆహిరినాట

సొరిది నీపంతాలెల్లాఁ జూచేరా నేము
సిరులనీకోరికలు చెల్లించేరా నేము ॥పల్లవి॥

అంతేసి నాకేమి చెప్పే వందుకేమి కానీరా
వింతలు నీసేఁతలెల్లా వింటిరా నేము
యెంతకెంత నీతోను యిప్పటనుండీనేల
చెంత నీచిత్తమురాను సేసేరా నేము ॥సొరి॥

---

క్రీగీతలుగలది చిలుముతినినందున అస్పష్టము. 1. ఇందలి ఐత్వము కావలదు.

నన్నేమి వెక్కు నొక్కేవు నవ్వువచ్చీ నాయలేరా
కన్నులారా నీచేతలు కంటిరా నేము
సన్నలా చాయలా నిన్ను సాదించఁగ మరియేల
మిన్నక కూచుండ నిన్నే మెప్పించేరా నేము ॥సారి॥

సారెఁ గాఁగిలించేవు చలములు దీరెలేరా
చేరి నీపొందులఁ దవిలితిరా నేము
యీరీతి శ్రీవేంకటేశ యింకఁ గాదనఁగనేల
కూరిమితో నిన్ను వేఁడుకొనేరా నేము ॥సారి॥ 7

కాంబోది

ఏల యింతసేసేవు యింటికి రావే
వేళవచ్చె నీకనైన విడెమందుకోవే ॥పల్లవి॥

వగరుఁజెదవులపై పులివచ్చినీమాఁటలు
చిగిరించి వలపులు చిమ్మిరేఁచీనే
తెగ విండాఁజాఁచినతీగెసోగలచూపులు
తగిలి మర్మములంటి తమి పుట్టించీనే ॥ఏల॥

కలకలమనియేటికప్పురపునీనవ్వులు
తలఁపులో గుబ్బితిలి దైవారించీనే
పొలపు మిగిలినట్టిబొమ్మలనీజంకెనలు
తలకొంచి యాసాసలఁ దగిలించీనే ॥ఏల॥

చక్కఁదనములనీవరసపువిలాసాలు
వెక్కసపువేడుకలఁ జొక్కించీనే
ఇక్కడనె శ్రీవేంకటేశుఁడనైననాకు
దక్కితివి నీచేఁతలు తడఁబడించీనే ॥ఏల॥ 8

భైరవి

ఇట్టె నాకు సిబ్బితయ్యీ నేమీ వనఁజాలను
దిట్ట వాతనితలఁపుఁ దెలియవే చెలియా ॥ పల్లవి ॥

తప్పకచూచితేఁ బతి దంట ఇది యనునో
కప్పుర మడిగితేను గబ్బి యనునో
అప్పటిఁ గానుకిచ్చితే నాసపడీ ననునో
చెప్పవే బుద్ధి నే నేమిసేతునే వోచెలియా ॥ ఇట్టె ॥

నెలవుల నవ్వితేను చిత్తిణి ఇదెనునో[1]
సొలసి పాదాలొత్తితే జూటరెనునో[2]
వెలయఁగ మొక్కితేను వేసాలది యనునో
నెలకొన్న వెరవులు నేరుపవే చెలియా ॥ ఇట్టె ॥

పచ్చిగా నేఁ జెనకితే పంతగత్తె యనునో
రచ్చలో నేఁ గొసరితే రాఁగయనునో
ఇచ్చట శ్రీవేంకటేశుఁ డింతలో నన్నేలినాఁడు
మచ్చిక నాతని నాలో మరుపవే చెలియా ॥ ఇట్టె ॥ 9

శ్రీరాగం

ఏమిసేతుఁ జెప్పవే యేది నా కుపాయము
ఆముకొన్న నావలపు లాఁపరాదే చెలియా ॥ పల్లవి ॥

కళరేఁగ వానిమేను కలువల వేతునా
కలయుమనుచు మొక్కి కాఁగిలింతునా
మొలకచన్నుల నొత్తి మొనగోరు దాఁకింతునా
పిలిచి పోకుండా నాసవెట్టుదునా చెలియా ॥ ఏమి ॥

---

1. ఇది + అనునో. 2. జూటరి + అనునో.

యీకడి మోమౌదాఁకా నెనగి సొలతునా
కైకొని పాదాలొత్తి కరఁగింతునా
జోకతో మోవితేనెలు సోఁకించి చొక్కింతునా
కోకకొంగుపట్టి వేఁడుకొందునా చెలియా ॥ఏమి॥

సురతపువిందుచెప్పి చూపులు నాఁటించునా
సరుగ నిచ్చకముల జట్టిగొందునా
ఇరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
సిరుల నేఁ బొగడి మెచ్చింతునా చెలియా ॥ఏమి॥ 10

పాడి

ఈపాటిది వలె నీకు నిన్నియునుఁ జెల్లఁబెట్టు
దాఁపురము గల్గె నీకు తానెవ్వరోయి ॥పల్లవి॥

పొంకముగాఁ దిట్టి పొగఁడితి; నీమాటలు
వంకలొత్తి పూనుకవచ్చి నీకు
లంకెలై యడ్డాలు దూరి లావుగా నిన్నాడుకొంటే
కొంకక యెందు గడించుకొం(కొను?)టివోయి యీకెను ॥ఈపా॥

బాసలు సేయఁగవచ్చి పలుమారు నీకుఁ గాను
వాసితోఁ బొగడీ నిన్ను వద్దివారితో
సేసినచేఁతలకుఁ జెప్పేఁ గతకారణాలు
సేసుక యెన్నాళ్లాయఁ జెప్పవోయి యీకెను ॥ఈపా॥

తప్పులుదీరుచవచ్చి తక్కటిసేసినదకలు
తప్పక సాకిరిచెప్పేఁ దగుదువంటా
ఇప్పుడిట్టె శ్రీవేంకటేశ నన్ను నేలితివి
అప్పనము దాఁచుకొంటి వవునోయి యీకెను ॥ఈపా॥ 11

గౌళ

మేలు మేలు యివేఁ గొన్ని మించె బూమిపైఁ గొత్తలు
సోలినున్నమిమ్మిద్దరిఁ జూచి వేడుకయ్యీని ॥ పల్లవి ॥

చెలరేఁగిచెలరేఁగి చెప్పీ నాపె సుద్దులు
పొలసిపొలసి కడుఁబొందు నేసీని
తలఁచుకతలఁచుక తగ నూడిగాలు నేసీ
యెలమి నీపెపొందు లిను మడించఁబోలు ॥ మేలు ॥

తగిలితగిలి నీపైఁ దమకము నించీని
మొగమెత్తి మొగమెత్తి మోము చూచీని
నగినగి సారెసారె నాఁటించీఁ జన్నులు
మగువవలపు లిను మడిగాఁబోలును ॥ మేలు ॥

పెనఁగిపెనఁగి నిన్నుఁ బ్రేమఁ గాఁగిలించీని
తనిసితనిసి నిన్నుఁ దగ మెచ్చీని
యెనసితివి శ్రీవేంకటేశ నన్ను నింతలోనె
నని చిద్దరివలపూ యిను మడిగాఁబోలు ॥ మేలు ॥ 12

రేకు 1303 పళవంజరం

మేలుసుద్ది చెప్పితేను మెచ్చవద్దా ఇఁకనైనా
కాలుదొక్కుదువు పాన్పుకడకు రావయ్యా ॥ పల్లవి ॥

వెలఁది యొకతె నిన్ను వెదకీ నేమిటికో
నొలవక నీమొగము చూపవయ్యా
పిలిచీ నప్పటనుండి పెదపెదయెలుఁగుల
పలుకవయ్యా యేల పరాకు నీకు ॥ మేలు ॥

వాడి నేమోపెట్టుకొనివుండి నిన్నే తలఁచీని
అది గాపెఁ దెలుసుకోవయ్యా నీవు
నడివీది నిలుచుండి నన్ను నీకడకు నంపె
విడిది నీపొరుగే యీవింతలేల నీకు ॥ మేలు ॥

చేవమీర నేకతము చెప్పేనంటా నున్నది
నావంటిదే తానూ నేమి చెప్పేవయ్యా
శ్రీవేంకటేశ నన్నుఁ జేరి యిట్టె కూడితివి
సేవించే నాపెనే నేను చెప్పనేల నీకూ ॥ మేలు ॥ 13

సింధురామక్రియ

వద్దనేవా రెవ్వరు వలపు నీకుఁ గలితే
పెద్దరికముతోడనే పెండ్లాడరాదా ॥ పల్లవి ॥

సారెకు నాతనితోను సరసము లేమాడేవు
కోరికైతేఁ గాఁగిలించుకొనరాదా
తేరకొన మోముచూచి తిమిరి యాఁకారనేల
సారపుటాతనిమోము చవిగొనరాదా ॥ వద్ద ॥

పొసఁగ నితనికెంత పొంచిపొంచి లాచేవు
కొసరు గలితే వద్దఁ గూచుండరాదా
ముసిముసినవ్వులతో మొక్కులు మొక్కఁగనేల
విసవిస నాతనిచే విడెమందుకోరాదా ॥ వద్ద ॥

వొల్లనే యంటిముట్టి వూడిగా లేమిసేసేవు
చెల్లుబడైతేఁ జేఁతలు సేయరాదా
యిల్లిదె శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
వెల్లవిరి నీవాతని వేఁడుకొనరాదా ॥ వద్ద ॥ 14

లలిత

నేనే వుపచారా లేవి చెప్పవయ్యా
  వేసాలేల నేనేవు వేఁడుకొనే నిన్నును ॥ పల్లవి ॥

వింతవింతమాటలే వేగినంతా నాడితిరి
  బంతి విడెములు నేసి పరగితిరి
  కొంతదడ వూరకే గుట్టుతోడ నుంటిరి
  యెంతేసిబడలితివో యెఱఁగము నేము ॥ నేనే ॥

నడుమనడుమ మీరు నవ్వుకొంటా నుంటిరి
  బడినే నుతిగూడుక పాడుకొంటిరి
  నిడివిగాఁ బంతాలతో నెత్తమాడుతా నుంటిరి
  అడరి నీవోర్పు దెలియను మాకు నిపుడు ॥ నేనే ॥

వొప్పుగ నుయ్యాలమీఁద నూఁగుకొంటా నుంటిరి
  కప్పుకొంటివి రెంటెము గళబెళను
  యిప్పుడు శ్రీవేంకటేశ యేలితివి నన్ను నీవ
  దప్పిగొనవుగదా నీతలఁ పదిగేను ॥ నేనే ॥ 15

సామంతం

ఎంత బయలీఁదించేవే యీదసి నీవు
  ఇంత నేరకుండితేను యిల్లాల వవుదువా ॥ పల్లవి ॥

చూపులనే సొలసేవు చుట్టమువలె నాపతి
  రాఁపునేసి నీయింటికి రమ్మంటాను
  పూఁపచన్నుల నొత్తేవు బొమ్మల జంకించుకొంటా
  యేపున ముద్దుటుంగర మిమ్మనియంటాను ॥ ఎంత ॥

కోరి కొంగువట్టేవు కూరిమితో నప్పటిని
ఆరగించ విందుకు రమ్మనియంటాను
గోరనే చెక్కునొక్కేవు గుట్టుతోడ వేడుకొంటా
సారమైననీమోవి చవిచూపుమంటాను ॥ ఎంత ॥

వుద్దండాన బెనగేవు వొడబడికగా జెప్పి
వొద్దికై నీవొత్తున గూచుండుమంటాను
కొద్దిమీర నన్ను నేలుకొనె శ్రీవేంకటేశుడు
సుద్దు లేమిచెప్పేవే చొక్కజేసుకొంటాను ॥ ఎంత ॥ 16

నట్టనారాయణి

చెలియా మఱవకువే చెప్పితి బుద్ధి
తొలుతే గాలిగలట్టే తూరుపెత్తుమందురు ॥ పల్లవి ॥

బత్తితో నీరమణుడు పానుపుపై నున్నవాడు
చిత్తమురా విన్నపాలు సేసుకొనవే
హత్తినీతో సమేళమై యిప్పు డున్నవాడు
గుత్తపుగుబ్బల నొత్తి కొసరగగదవే ॥ చెలి ॥

నవిచి నీమోము చూచి నవ్వుతానే వున్నవాడు
చెనకి యేపనులైనా జేయించుకోవే
కనుగొని నీమీదివే కన్నులై తా నున్నవాడు
పెనగి తమ్ముల మిట్టె పెట్టించుకోగదవే ॥ చెలి ॥

మరిగి నీతోడుతనే మాటలాడుతా నున్నాడు
యొరవు లేకుండా వరమిప్పించుకోవే
ఇరవై విన్నేలి చనవిచ్చి నీకు తా నున్నాడు
సరుగ శ్రీవేంకటేశు సారె మెప్పించగదే ॥ చెలి ॥ 17

ధన్నాసి

అందుకేమే నాసంతోస మదియేకాదా
కందువల నన్ను నిట్టె కరుణించుమనవే ॥ పల్లవి ॥

ఇంతవడి నన్నె చూచె యేమినోము నోచితినో
వింతలేల మాయింటికి విచ్చేయనీవే
యెంతేసి వేడుకొనీనే యెదురాడేనా నేను
అంతేపో వోయమ్మ అడుగఁగవలెనా ॥ అందు ॥

వేడుకైతేఁ జాలుఁగాక విచారమేల నాచేత
వూడిగము సేయించుకవుండుమనవే
పీడె మందుకోనీవే వేరేల తనవారమే
చూడవో చేసుకొంటేను చుట్టరికముగాదా ॥ అందు ॥

అడియాల మంపెఁ దాను అంత నేను బాఁతియైతే
యెడమాట లిఁకనేల యేలుమనవే
బడినే శ్రీవేంకటపతి దానె వచ్చి కూడె
కడమ లేదే మన్నించె కమ్మటి మెచ్చీని ॥ అందు ॥ 18

రేకు 1304 బౌళి

ఇతఁడే నావాఁడై తే నెవ్వరికీ లోఁగనేల
కతగా యీవుపాయము గంటినే వోచెలియా ॥ పల్లవి ॥

చిలుకలు వలుకనీ చేరి కోవిల గూయనీ
చెలువుఁ డాడినమాట చెప్పఁగదవే
కలువలు మెరయనీ కమలాలు చెలఁగనీ
తలఁపు దెలిసితివా తగిలి నీవతని ॥ ఇతఁ ॥

చందురుఁడు గాసీవే చల్లగా లేతేరనీవే
యిందుకు వచ్చెనా తాను యెఱిఁగించవే
ఇందిందిరాలు రేఁగనీ యిగిరించనీ తీగెలు
కందువ నాపై బత్తిగదా విభునికి ॥ఇతఁ॥

కప్పుర మగ్గువగానీ గందవొ డెక్కుడుగానీ
వొప్పుగఁ బానుపుపై నాతఁ డున్నాఁడచే
కప్పి వసంతకాలము గానీ మరుఁ డెసగనీ
యిప్పుడు వచ్చి శ్రీవేంకటేశుఁడేలె నన్నును ॥ఇతఁ॥ 19

### ముఖారి

నన్ను నింత సేసినాఁడు నాయకుఁడు వలపించి
అన్నిటా మన్నించె నింకా నాఁపరాదు మనసు ॥పల్లవి॥

విందమువో తనమాట వేడుక నేమిచెప్పినో
పెందలకాడే దూతికఁ బిలిపి తేవే
పందెమువేసె నాతోను పఁటఁదెచ్చే నంటాను
అందాఁకాఁ జివి రేఁగీ ఆఁపరాదు మనసు ॥నన్ను॥

చూతమువో తనమోము సొమ్ము లేమిదెచ్చినో
దూతిక యిక్కడికే తోడుకరావే
యేతులు నెరపె నాతో నిట్టె పొందులు సేసేనంటా
ఆతనిఁజూచినదాఁకా నాఁపరాదు మనసు ॥నన్ను॥

ఇత్తమువో తనకు మెచ్చి యిట్టె యాతనిఁ జూపితే
బిత్తరపుదూతిని రప్పించవే ఇందు
ఇత్తల శ్రీవేంకటేశు నెనయించెఁ దా నింతలో
హత్తి కూడె నిదెఁ దింకా నాఁపరాదు మనసు ॥నన్ను॥ 20

పాడి

కన్నె గడుసవరాలు కామిని నీకు మేలుది
ఇన్ని సేవలునుఁ జేసె నిఁక జాగులేఁటికి ॥ పల్లవి ॥

కొమరెగుబ్బ లదరఁ గొలిచివచ్చీఁ జెలి
చెమటలు గారఁగాను సిగ్గులోడను
అమరఁ బల్లకిమీఁద నాపెఁ బెట్టుకొనరాదా
రమణి యలయికలు రచ్చపేయనేఁటికి ॥ కన్నె ॥

సరిబిరుదువేకాన బిరబిర నచ్చీని
పరువులు పెట్టుకొంటా బడివాయక
ఇగవుగ గుఱ్ఱముపై నిద్దరూ నెక్కకోరాదా
తరుణి సింపరలో సింపలు సేయనేఁటికి ॥ కన్నె ॥

కడుబుసకొట్టుకొంటాఁ గ్రైదండ నీకిచ్చుకొంటా
యెదయక నేఁడయెక్కె నుండదాఁకా నీతో
తొడపై నిడుకోరాదా తోడనె శ్రీవేంకటేశ
పడఁతిఁ గూడితి వింకఁ బచ్చిసేయనేఁటికి ॥ కన్నె ॥ 21

కాంబోది

వేసత్తైతే నీయిండ్లకు విచ్చేయవయ్యా
యీవల నేమియడిగేవు యివిగో మాసుద్దులు ॥ పల్లవి ॥

మోవరాపమోవులు మునుకొన్న వలపులు
పూవకపూచేపూవులు పూఁపసవ్వులు
చేవలోని పేఁగలు చెప్పరానివంటసులు
యీవల నేమడిగేవు ఇవిగో మాసుద్దులు ॥ వేసు ॥

పట్టరానిపదనులు పంతపుమావానులు
చెట్టులపై చిగురులు చిమ్ముఁజూపులు
వుట్టులపై తేనెలు వుడివోనిమామాటలు
యిట్టె యేమడిగేవు ఇదిగో మాసుద్దులు ॥ వేదు ॥

వెన్నెలలోపులఁగాలు వెక్కసపుమాపిగ్గులు
కిన్నెరమీఁటులు గిలిగింతరతులు
ఇన్నిటా శ్రీవేంకటేశ యేలితివి మమ్ముఁ దొల్లె
యెన్నివి యడిగేవయ్యా ఇదిగో మాసుద్దులు ॥ వేదు ॥ 22

ముఖారి

ఇంతులట మగఁడట యేల నవ్వేరు
వింతలుగ నీవెంత వేసాలు నేసేవే ॥ పల్లవి ॥

సలిగెగలుగువారు జంకింతురు రమణుని
వలచినవారు రవ్వలు సేతురు
బలిమిగలుగువారు పైపైఁ బెనఁగుదురు
విలుచుండి చూచిచూచి నీవేల దూరేవే ॥ ఇంతు ॥

మనసెనసినవారు మందెమేళాలు సేతురు
నమ్మైనవారు చెనకవత్తురు
తనియనివారు సంతతముఁ గొసరుదురు
వనితరో నీవేల వాసులరేఁచేవే ॥ ఇంతు ॥

మేనవారయినవారు మించి యేమైనాఁ జేతురు
పూని మరిగినవారు పొందుగుదురు
యీనెపాన శ్రీవేంకటేశుఁ దిట్టి నన్నుఁ గూడె
నానఁబెట్టుకొని నీవు నవ్వు లేమి నవ్వేవే ॥ ఇంతు ॥ 23

ఆహిరినాట

ఏమే నమ్మికింగదే యింకా నేల దాంచేవు
చేముంచితివేమో నాకుఁ జెప్పవే యాకతలు ॥ పల్లవి ॥

కళలు మోమునఁ దేరీఁ గారీఁ బెఁ(బెం?)జెమటలు
చెలి నిన్నాతఁ డేమైనాఁ జెనకెనటె
పిలువ నిన్నంపితేను పెనఁగులాడితివేమో
సెలవి నేమినవ్వేవు చెప్పవే యాకతలు ॥ ఏమే ॥

నాతి నీకొప్పుదె జారె నలఁగెఁ గట్టినచీర
ఆతఁ డేమైనా నిన్ను నంటెనటవె
రాతిరెల్లా నాడనుండి రచ్చలు సేసితివేమో
చేతిసన్నేమి చూపేవు చెప్పవే యాకతలు ॥ ఏమే ॥

మోవిపైఁ గెంపులు నిండె ముడిచిన కొప్పు(కొంగు?)జారె
శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ జెందెనటవే
నీవెంటనే వచ్చి తాను నేఁడు నన్నూ నేలెఁ బతి
సేవ లేమిసేసేవు చెప్పవే యాకతలు ॥ ఏమే ॥ 24

రేకు 1305 ఆహిరి

చిత్తాన నెగ్గుపట్టకు చేతులెత్తి మొక్కే మిదె
కొత్తకొత్తవయసులకోమలులము ॥ పల్లవి ॥

కెలఁకుము సొలఁకుము కేరడము లాడుదుము
వలపులు చల్లుదుము వనితలము
పిలుతుము పేరుకొని ప్రియములు చెప్పుదుము
సళుపుఁజూపులఁ జూచి సరసమాడుదుము ॥ చిత్తా ॥

పిపయాలు సేతుము వేడుకతో నవ్వుచము
చనవున మెరతుము జవరండ్లము
పెనఁగుదుము పైకొని పెక్కుచేఁతలు సేతుము
మనసులు గరఁగించి మరిగింతుము ॥ చిత్తా ॥

యెప్పుడైనాఁ గూడుదుము యెంగిలిమోపి సేతుము
చెప్పుకొందుము నీపొందు చెలులము
ఇప్పుడే శ్రీవేంకటేశ యేలితి విన్నిటా మమ్ము
కుప్పలుగాఁ జొక్కించి గురుతులు వింతుము ॥ చిత్తా ॥ 25

గౌళ

నేరుపే విధానము నెలఁతలకు
తారుకాణ నామాట తలఁచుకోవే ॥ పల్లవి ॥

వినయములే నేసి వేడుక పుట్టించితే
మనసు గరఁగు విట్టె మగవానికి
యెనయఁ గొలువుసేసి ఇచ్చక మే నెరపితే
సనుపులు సమకూరు నాయకునికి ॥ నేరు ॥

చెప్పినట్టెల్లాఁ జేపి చేరి పాయకుండితేను
కప్పుకొనుఁ దమకము కాంతునికి
వొప్పుగా మాటలాడి వొరిమతో మెలఁగితే
చిప్పిలఁ గళలు రేఁగు చెలువునికి ॥ నేరు ॥

చతురత నవ్వు నవ్వి సరసము లాడితేను
రతులఁ గొంకులు పుట్టు రమణునికి
సతమై శ్రీవేంకటేశు సతివైతి విట్లైతే
యితవులొ నవ్వియును యితనికిని ॥ నేరు ॥ 26

సాళంగం

ఎటువంటివా [illegible] వరికివి
ఇటువంటి [illegible] కోవయ్యా ॥ పల్లవి ॥

పట్టెడేసిగుబ్బలు [illegible] మొక్కితివనె
నెట్టన బంగారువంటినీపాదాలకు
మట్టున నీతోడుత మాటలాడి రమ్మనె
యిట్టె మారుత్తరము [illegible] చెప్పవయ్యా ॥ ఎటు ॥

చేరెడేసికన్నులచెలి [illegible] నె
చేరి నీపరిణామపు [illegible]
వేరుసేయ కిట్టె నీ [illegible] చి రమ్మనె
నేడుపు మాపెతోడు [illegible] నేనేమందునయ్యా ॥ ఎటు ॥

కాగెడేసిపిఱు [illegible] చితివనె
వీగక నీవు [illegible] వేడుకలను
కాగిటిలో నిన్నూ దన్నూ గలపుదువు రమ్మనె
యేగివచ్చి శ్రీవేం [illegible] నాడితివయ్యా ॥ ఎటు ॥

అహిరి

వలపుతేవిజోలి వట్టి [illegible]
యెలయించె నన్ను దాను యే [illegible] సేయుమనీనే ॥ పల్లవి ॥

మంతనములే యాడితి మాపునాకా దనతోను
వింతగా జోకటాలాడి వేగించితి
చెంతనే పొద్దులువుచ్చి చెలరేగి నవ్వితి-
చింతనేసె నన్ను దానె యేమిసేయుమనీనే ॥ వల ॥

సారెసారె రచ్చలోన సరసములాడితి
కోరి కొలువులు సేసి గుబ్బతిలితి
తేరకొనఁ జూచిచూచి తేలితిఁ దనమాయల
యీరీతిఁ దా నింతసేసె నేమిసేయుమనీనే ॥వల॥

ఆసాసలఁ గొంతవడి యట్టె పాదాలొత్తితి
రాసినసిగ్గులలోన రాఁ పెతిని
సేసవెట్టి నన్నుఁ గూడె శ్రీవేంకటేశ్వరుఁడు
యీసులే కింతసేసెఁ దా నేమిసేయుమనీనే ॥వల॥ 28

మధ్యమావతి

కంటిమి వింటిమి నీకతలెల్లాను
దంటవై పొగడించుకోఁ దగుదువే నీవు ॥పల్లవి॥

కన్నులారిచేవు యెంతకలికితనమో నీది
నన్నలు నేసే వదేమిజాణతనమో
చన్నులతో గునిసేవు సాము లెంతనేరుతువో
యిన్నిటా నీమురిపెము లేమి చెప్పేదే ॥కంటి॥

యేకతములాదేవు యేమేమెఱుఁగుదువో
కైకొన విదేటివాసికత్తెవో నీవు
దాఁకొని నవ్వేవు దొరతనమెట్టిదో యిది
యీకడ నీపెద్దరిక మేమి చెప్పేదే ॥కంటి॥

కాలుదొక్కఁబూనే వెంతకతకారితనమో
వోలవేయఁజొచ్చే వెంతవొయ్యారివో
యేలె నన్ను శ్రీవేంకటేశుఁడు నీవు లాచేవు
యీలీల నీపగటులు యేమిచెప్పేదే ॥కంటి॥ 29

నాదరామక్రియ

ఎటువంటివిలాసిని యెంతజాణ యీచెలువ
తటుకన నీకు దక్కె దైవారఁ జూడవయ్యా ॥పల్లవి॥

మగువ మాటాడితేను మాణికాలు నిండుకొనీ
పగడాలు పెదవులఁ బచ్చిదేరీని
మగిడిచూచితేను మంచినీలా లుప్పతిలీ
తగు నీకు నీపెదిక్కు తప్పకచూడవయ్యా ॥ఎటు॥

పడఁతి జవ్వనమునఁ బచ్చలు గన్ముకొనీని
నడచితే వైడూర్యాలు వెడలీ గోళ్ల
తొడిఁబడ నవ్వితేను తొరిగీని వజ్రాలు
వాడికమైనది యీపెవొరపు చూడవయ్యా ॥ఎటు॥

కొమ్మ ప్రియాలతేనెలఁ గురిసీఁ బుష్యరాగాలు
కుమ్మరించీఁ జెనకుల గోమేధికాలు
ముమ్మరపుఁజెమటల ముత్తెపుసరాలు నిండీ
నెమ్మది శ్రీవేంకటేశ నీదేవిఁ జూడవయ్యా ॥ఎటు॥30

రేకు 1306 సామంతం

ఎంతవేడుకో నీకు నిటువంటిచేఁతలు
మంతుకెక్క నేనూ నీమతి గరఁగించేను ॥పల్లవి॥

చల్లరితనాన నీపైఁ జూపులు చిమ్ముకొంటా
బిల్లఁగోట్లాడీ నీప్రియురాలు
కొల్లలుగఁ గొనగోళ్లఁ గుంకుమచెమట [illegible]
చలీ వసంతము నీపై జవరాలు ॥[illegible]॥



నాదరామక్రియ

అంగడినేల వేసేవు అప్పటి వలపులు
యింగిత మెఱిఁగి యిట్టె యేలుకొనరాదా ॥ పల్లవి ॥

మంచిమాఁట లాడితేనే మనసుఁ గరఁగుదుము
కంచముపొత్తిచ్చితే కాఁతాళించము
మంచమెక్కవిచ్చితేనే మచ్చికలు సేతుము
యించుకంత చనవిచ్చి యేలుకొనరాదా ॥ అంగ ॥

చెక్కునొక్కినందుకే సేవలెల్లాఁ జేతుము
చక్కఁగాఁ జూచితేనే సమ్మతింతుము
గక్కనఁ గొంగువట్టితే కందువకు లోనౌదుము
యిక్కువతో మన్నించి యేలుకొనరాదా ॥ అంగ ॥

చనుఁగవ లంటితేనే సరుసఁ గాఁగిలింతుము
వొనరఁగ నవ్వితేనే వోరుతుము
ఘనుఁడ శ్రీవేంకటేశ కలసితి వింతలోనే
యెనసి యిట్టె లాలించి యేలుకొనరాదా ॥ అంగ ॥ 126

రేకు 1322 ఆహిరి

ఇందులోనే వున్నవివె యింతితమకములెల్ల
గొందినే కోరికలెల్లా [1]కొమ్మ లే కిగిర్చెను ॥ పల్లవి ॥

చెలి నీకడకు రాఁగా చెమటలఁ దొప్పఁదోఁగె
వలపులు వానలేవివరదాయ
యెలమి నీరాకల కెదురులుచూడఁగాను
వెలయఁగ దివ్వెలేకే వెలుఁగవిపించెను ॥ ఇందు ॥

---

1. 'కొమ్మ' కు రూపాంతరమా?

వెదకుతానే నిన్ను వెలఁది కాఁకలఁ బొందె
యెదుటఁ బొద్దువోదవ కెండగానెను
యిదె నీపైయాసల నిట్టె మేను పులకించె
వెదవెట్టక ససులు వేవేలు మొలచెను ॥ ఇందు ॥

నీరతికిఁ జేయిచాఁచె నిట్టూర్పుల నిండెఁ జెలి
కోరి యాస గాలిలేక తూరుపెత్తెను
సారె శ్రీవేంకటేశుఁడ చన్నుల నిన్నొత్తి
తోరునఁ దా జాలిలేక బొమ్మరాలు వేసెను ॥ ఇందు ॥ 127

రామక్రియ

నీవేడుకే చూచేవు నెలఁతలా గెంచవు
సోవలకన్నుల నాపె సొలయఁగాను ॥ పల్లవి ॥

యెందాఁకా మాటలాడేవు యెంతలేదు నీనవ్వు
అందపుటాసలఁ జెలి అలయఁగాను
యిందునందూ సోలుతా నెమ్మె లేమిచూపేవు
గొంది నుండి యాపె నిన్నుఁ గొసరఁగాను ॥ నీవే ॥

యేమి వరసమాడేవు యేదిగొద్ది నీపగటు
కామిని కాఁకలచేతఁ గమగందగా
సాములు నేయుచును చలమేల సాదించేవు
వేమరు నాపె నిన్ను వేఁడుకొనఁగాను ॥ నీవే ॥

యెట్టు వేసాలు నేసేవు ఇన్నియు నేర్తువు నీవు
అట్టె ఇంతి నిన్నుఁగూడి అలయఁగాను
రట్టుగ శ్రీవేంకటేశ ముట్టి యేల తెలసేవు
వెట్టదీర నాపె నిన్ను వినతించఁగాను ॥ నీవే ॥ 128

## పాడి

దేవుఁడవు నీవూ దేవుల నేను
వావులు గూడఁగాను వడి సేసవెట్టితి ॥ పల్లవి ॥

వలపులు నే నెఱఁగ వాసు లెఱఁగను; నీవు
కలకల నవ్వితేనే కరఁగితివి
పలుకులు నే నేర భావించఁగ నే నేర
పిలిచి విడెమిచ్చితే ప్రియమందితివి ॥ దేవుఁ ॥

మనసు సాదించనోప మర్మము లడుగనోప
చెనకి గోర నూఁదితే చేకొంటివి
పెనఁగఁజాలను నేను బిగియఁగఁజాలను
కనువిచ్చి చూచితేనే కావిమ్మంటివి ॥ దేవుఁ ॥

పచ్చిచేఁతలు రచించఁ బలుమారు సిగ్గువడ
మచ్చికఁ గాఁగిలించితే మరిగితివి
యిచ్చట శ్రీవేంకటేశ యేలుకొంటి విటు నన్ను
మెచ్చి కాఁగిలించితేను మేకొని మొక్కితివి ॥ దేవుఁ ॥ 129

## సామంతం

అన్నిటికి నేరుతువు అవునయ్యా
కన్నదే కంది గురుమ కంటిమయ్యా ॥ పల్లవి ॥

పిలిచె విందాఁకాను పెద్దయెలుఁగున వింతి
పొలసి నీ వెక్కడికిఁ బోతివయ్యా
మొలచినట్లు వచ్చి ముసుఁగుతో పానుపుపై
తల గానరా దాఁగేవు తగువయ్యా ॥ అన్ని ॥

వెదకె విందాఁకాను వీదులవీదుల నాకె
వుదుటున నెవ్వరింట నుంటివయ్యా
తుద పిందె దిగినట్టు దోమతెరమరఁగున
విదురవోతా బొంకేవు నేరుపరివయ్యా ॥ అన్ని ॥

కొనరె విందాఁకాను కొమ్మ నీకాఁగిటఁ గూడి
వెస నేమని చెవుల వింటివయ్యా
రసిక శ్రీవేంకటేశ రమణిఁ గూడితి విట్టె
కనుగాయమో విచ్చేవు ఘనుఁడవయ్యా ॥ అన్ని ॥ 130

దేసాళం

కొమ్మలు పదారువేలగోవిందరాజ
విమ్మపంట వేతురా నీ వాఁటదానివి ॥ పల్లవి

చేరి కొంగువట్టెనంటాఁ జెలులతోఁ జెప్పిచెప్పి
ఆరీతి నవ్వేదురా ఆఁటదానివి
కోరి చెమటదీసితే కొనగోరు దాఁకెనంటా
నేరము లెన్నుదురా నీ వాఁటదానివి ॥ కొమ్మ ॥

వన్నెలఁ జిక్కించెనంటా సాకిరులు వెట్టిపెట్టి
అన్నిటా దూరుదురా ఆఁటదానివి
చన్నులునొఁతఁగ నీపరుపఁ గూచుండెనంటా
విన్నటికి నేఁ డందురా నీ వాఁటదానివి ॥ కొమ్మ ॥

జట్టిగొని కూడెనంటా సమూకాన మెచ్చిమెచ్చి
అట్టె పొగడుదురా ఆఁటదానివి
వొట్టుక శ్రీవేంకటేశ వురమెక్కించుకొంటివి
నెట్టన వింతసేతురా నీ వాఁటదానివి ॥ కొమ్మ ॥ 131

సాళంగనాట

కొలువు సేయించుకొనేగోవిందరాజా
అలరి వోదుచుకొంటే నందమయ్యా ॥పల్లవి॥

చిగురుమోవులవారు చేరి నీతో మాటాడితే
వొగరువేయకుండునా వొకకొంతైనా
వెగటువ వివి నీవు వెంగెములుసేసుకొనేవు
నగవుసేసుకొనేదే నయమయ్యా ॥కొలు॥

కలువకన్నులవారు కప్పి నిన్నుఁ జూచితేను
చలువ గాకుండునా జవ్వనానకు
అలి సీవందుకును చలములు రేఁచుకొనేవు
పులకించి మెచ్చేదే బుద్ధియౌనయ్యా ॥కొలు॥

జక్కవచన్నులవారు సరిఁ గాగిలించుకొంటే
మిక్కిలి సోఁకకుండునా మించి పురము
యిక్కువ శ్రీవేంకటేశ యిందుకుఁగాఁ నలసేవు
చొక్కుచు సంతసించేదే జోకౌనయ్యా ॥కొలు॥ 132

రేకు 1323

శ్రీరాగం

అటువంటివాఁడు గాఁడు అతఁడు నీకుఁ దప్పఁడు
కిటుకులెల్లా మాని కేలెత్తి మొక్కవే ॥పల్లవి॥

దప్పిదేరేమోవితోడ తమకాన నున్నాఁడు
కప్పురవిడెమియ్యఁగదవే కలికి
ఇప్పుడు వచ్చితి వాతఁ డిందాఁకాఁ దానొంటి నుండె
చిప్పిలఁజెమట లార్చి సేదదేర్చవే ॥అటు॥

అసురుసురనుకొంటా ఆపలతో మన్నాఁడు
కొసరి విడెమియ్యవే కోమలీ
ముసుఁగు దీసితి విట్టె మోము గాన కాతఁ డుండె
వెస నీమోవి యిచ్చి వేడుకసేయవే ॥ అటు ॥

చిగురుఁదలపోఁతతో శ్రీవేంకటేశుఁ డున్నాఁడు
తగురతిఁ గూడవే తరుణీ
వొగి నేసవెట్టితివి వొలిపి వి న్నాతఁ దేలె
పొగడి కాఁగిటిలోనే పొసఁగివుండవే ॥ అటు ॥ 133

## సాళంగం

కొండవంటిదొరవు కోరి చెయివట్టఁగాను
తండించి యాడవచ్చునా కావీవయ్యా ॥ పల్లవి ॥

వలపు చవిచూపితే వద్దనఁగవచ్చునా
చెలఁగి మాయింటికి విచ్చేయవయ్యా
వొలిపి విడెమియ్యఁగా వొల్లననవచ్చునా
తిలకించి పుచ్చుకొనేఁ దేవయ్యా ॥ కొండ ॥

పిగ్గులు చేతికిచ్చితే చేత దొబ్బవచ్చునా
వెగ్గళించ వీఁకఁ దెరవేయవయ్యా
వొగ్గి పవ్వలు వవ్వఁగా నోపననవచ్చునా
విగ్గుల సమ్మతించితి విచిత్తమయ్యా ॥ కొండ ॥

జవ్వనము పైఁబూసితే జంకించవచ్చునా
చివ్వనఁ గాఁగిట వించి(చే?) చేదాఁకవయ్యా
యివ్వల శ్రీవేంకటేశ యేలితివి నన్ను విట్టె
వివ్వటిల్ల మన్నించి(చే?) విందుకుండవయ్యా ॥ కొండ ॥ 134

రామక్రియ

అంటుకొంటి వీఁకనో ఆయఁగా రట్టు
కంటగించ కంతలోనె కాఁగిలించుకొంటివి ॥ పల్లవి ॥

వెఱఁగుమాపినసుద్ది చెలితో నేఁ జెప్పఁగాను
యెఱుకలుసేసుకొనే వేఁటికి నీకు
చిఱుతనవ్వులు నవ్వి సిగ్గువడి నే నుండితే
వొఱపుతోడను వచ్చివొద్దఁ గూచుండితివి ॥ అంటు ॥

నాలునాళ్లు సేసేనవి నాతులఁ బిలిచితేను
యీలీల నదేమనేవు యేఁటికి నీకు
మైలవాసి నేనిటు మఱఁగున నుండఁగాను
పోలిమి నెంగిలిచోటు పొలసి తొక్కితివి ॥ అంటు ॥

పాయపుమదముతోడఁ బడఁతులఁ జూచితేను
యీయెడ నేకతమాడే వేఁటికి నీకు
చాయల శ్రీవేంకటేశ జంట నను గూడితివి
పాయ నీచేయి దాఁకెఁ బట్టినకాళాఁచి ॥ అంటు ॥ 135

ఆహిరి

అందువంకనైనాఁ గొంత ఆతుమ దనుసును
పొందులన్నియును దలపోసుకొనవయ్యా ॥ పల్లవి ॥

పెక్కుసతులమీఁదను ప్రియముగలవాఁడవు
వొక్కతె నీరతులకు నోపుదునా
గక్కన నీమనసు కరఁగేయట్టుగాను
తక్కక మరిఁగొందరిఁ దలఁచుకోవయ్యా ॥ అందు ॥

నానావిధాలవారితో నవిచివకాఁడవు
నేనొక్కతె నవియెల్లా నేరుతునా
సోనగా మై చెమరించి చొక్కేయట్టుగాను
తానకపుకతలెల్లాఁ దలఁచుకోవయ్యా ॥ అందు ॥

చెంచులా గొల్లెతలా మెచ్చినయట్టివాఁడవు
మించి నేనొక్కతెనే మెప్పించేనా
కొంచక శ్రీవేంకటేశ కూడితి వై నట్టుగాను
దంచక నావంటి దేది తలఁచుకోవయ్యా ॥ అందు ॥ 136

కాంబోది

చెప్పినట్టు సేయవయ్య చెలియచిత్తమురాను
దప్పిదేర బుజ్జగించి తనివందవయ్యా ॥ పల్లవి ॥

చిగురుఁబోణి నిన్ను [1] శ(సె?)లవుల నవ్వీని
జిగి నీవెక్కడ నేమిసేసితివయ్యా
తగిలి నీనిలువెల్లాఁ దప్పకచూచీ నిదె
యెగసక్కెపుమచ్చము లేమున్నవయ్యా ॥ చెప్పి ॥

కచ్చుపెట్టి నీకు వట్టె కస్తూరి పూసీని
పచ్చిగా నెవ్వతెకావి పట్టెనయ్యా
దిచ్చరినీమోవి గలతేనెతీపు చాలదని
వెచ్చ మేతఁ బెట్టి కొంత తెచ్చితివయ్యా ॥ చెప్పి ॥

శ్రీవేంకటేశ నిన్నుఁ జేరి కాఁగిలించి కూడె
కావించి నీనిజ మెట్టు కనెనయ్యా
వోవరిగాఁ దనకు నీవురము నెలవుచేసె
భావమెఱిఁగి రతెట్టు పనిగొనెనయ్యా ॥ చెప్పి ॥ 137

1. యతిభంగము

మాళవిగౌళ

[1]ఎఱుఁగుదు మిన్నియును ఇంతేసేల
వలవాలా నింకా వింతవారమా నేము ॥ పల్లవి ॥

మాటలనే చొక్కితిమి మంతనాలు మెచ్చితిమి
కాఁటలఁదూఁటలచేతఁ దనిసితిమి
యేఁటికి మమ్ముఁ జెనకీ విన్నిటాఁ జుట్టాలము
వాఁటముగ నీఁక వింతవారమా నేము ॥ ఎఱుఁ ॥

నగవుల నలసితిమి నయముల నమ్మితిమి
తగవులు నెరపఁగాఁ దనిసితిమి
మొగము లేమిచూచీవి మోహించినవారము
వగలేల యింకా వింతవారమా నేము ॥ ఎఱుఁ ॥

మోవితేనె లానితిమి ముచ్చటలఁ గూడితిమి
కావుల సరసములఁ దనిసితిమి
యేవల్లా శ్రీవేంకటేశు కిచ్చకపుసతులము
వావిగూడె నింకా వింతవారమా నేము ॥ ఎఱుఁ ॥ 138

రేకు 1324 వరాళి

అవునయ్య మంచివాఁడ వన్నిటా నీవు
యివల విన్నేమందు నెంతకాఁతరీఁడవు ॥ పల్లవి ॥

చెప్పుదునా ఆపెతోడ చెంది నీనేసినచేఁత
యిప్పు డిట్టె వింటేను యేమను నిన్ను
చెప్పరావివిశ్వాసిచెలికత్తెలము నేము
కొప్పువట్టి మాపయ్యదకొం గంటఁదగునా ॥ అవు ॥

1. ఈపాటలో 1, 2 చరణములలో 'జెనకీ' 'చూచీవి' క్రియలు మధ్యమపురుషములైతే అన్వయము బాగుండునేమో? లేక చెలితో చెప్పినమాటలా?

చూపుదునా ఆపెకు సొమ్ములు నీవిచ్చినవి
ఆపనుల కేమని ఆడునో విన్న
వోపికతో వితవరిపూడిగపువారము
చేపట్టి మాచెక్కులమ జీరఁదియ్యఁదగునా ॥ అవు ॥

సాకిరి దెలుపుదునా సరి నీనవ్వినవవ్వు
[1]తూకొనెలమేల్మం గెంతదూరునో విన్న
యీకడ శ్రీవేంకటేశ ఇద్దరి నమ్మినవార-
మేకొలఁది[2]ఁ(దిః)గాఁగిలించి యింత మెచ్చఁదగునా॥అవు॥139

## దేసాళం

నీలో మెలఁగినదాన నేఁడు మాటఁ గొత్తలా
నీలాగులన్నియును నే మెఱఁగమా ॥ పల్లవి ॥

కట్టినది చంద్రగావి, కాయము తట్టుపుణుఁగు
యెట్టెవ్వతెఁ గూడినా నిన్నెఱఁగవచ్చు
పెట్టకు మంతేసియాన బిరుదుబంటవు నీవు
నెట్టుకొన్ననీనిజము నే మెఱఁగమా ॥ నీలో ॥

పొడికప్రము చెక్కుల, పూవులదండలు మేన
కడ నెవ్వతెఁ బొందినాఁ గానఁగవచ్చు
పొదఁబరచకు మంత పొదయఁడ వందరికి
విడుపునీగుణాలు నే మెఱఁగమా ॥ నీలో ॥

వోవరి శ్రీవేంకటాద్రి, వురాన నలమేల్మంగ
చేవ నెవ్వతెఁ గూడినాఁ జెప్పఁగవచ్చు
కావించకు బాస నాకు శ్రీవేంకటేశ నన్నేలి
నీవోఁజ లెప్పుడును నే మెఱఁగమా ॥ నీలో ॥ 140

---

1. తూకొని+అలమేల్మంగ 2. 'ఏకొంది' అని ప్రశ్నార్థకము. 'కొలఁదిఁ' లో 'ది' తరువాతి అరసున్న విచార్యము.

బౌళి

కాఁగిలించవయ్యా కామిని నీవు
మాఁగినమోవితోడ మధురమైవున్నది ॥పల్లవి॥

మెలయింపుఁజూపులను ఇంతిఁ జూచితే నాపెకు
చెలపచెమటనీరు చిమ్మిరేఁగెను
వెలయ నీవందుకుఁగా విసరితివి సురటి
పులక మొగ్గలమేనఁ బొదిగొనివున్నది ॥కాఁగి॥

మనసిచ్చి సతితోను మాటలు నీవాడితేను
చనుఁగవ బిగువెక్కి జారెఁ బయ్యద
అనువుగాఁ బెట్టఁబోతే నందుపై నీగోరు సోకి
మనసెల్లాఁ గరఁగి నీమంచముపై నున్నది ॥కాఁగి॥

దొమ్మి నలమేల్మంగతోడ నీవు నవ్వితేను
కుమ్మరింపుసిగ్గుతోడ కొప్పు వీడెను
నెమ్మది శ్రీవేంకటేశ నీ వింతలోఁ గూడితేను
సమ్మతించి మెచ్చిమెచ్చి సారె నీకు మొక్కెను ॥కాఁగి॥141

శ్రీరాగం

[1]కంటి మిదివో నేము కన్నులపండుగగాను
జంటలఁ గొలువై నీవు చనవియ్యఁగాను ॥పల్లవి॥

హేమంతకాలము నేఁడు యిటు నీతిరుమేన
ఆముకొని జవియించినట్లుందెను
ఘామిఁగలకప్పురము పొడినేసి విలువెల్లా
నేమముతో విందరును నీకుఁ జాతఁగాను ॥కంటి॥

1. ఇది అధ్యాత్మకీర్తనలలో నుండదగినది. "ఒకవరి కొకవరి కొయ్యారమై" అను కీర్తనవంటిది.

వానకాలము నీలవర్ణముతోఁ దిరుమేన
సోవయై కురిసినట్టు చూపట్టెను
సేనగాదట్టుపుణుఁగు చిత్తడిగా సర్వాంగాల
పూని యిందరును నీకుఁ బూయఁగాను ॥ కంటి ॥

వసతకాలంము తానె వచ్చి నీ తిరుమేన
యెసగినట్టు శ్రీవేంకటేశ తోఁచెను
వెన నలమేల్మంగతో వింతసొమ్ము నీవురాన
పొసగిం[1] చందరు విన్నందరు [2]బొగడఁగాను ॥ కంటి ॥ 142

ఆహిరి

ఎదురాడఁజాలదు యేమిసేసినా నీకు
వదలుఁదురుమువట్టి వంచకువయ్యా ॥ పల్లవి ॥

చెక్కునఁ జేయివెట్టుక చింతించేచెలియకు
పుక్కిటితమ్ముల మిడి పొదిగేవు
వెక్కసపువిరహాన వేగించె నిందాఁకా
పిక్కటిల్లుఁజన్నులు పిసుకకువయ్యా ॥ ఎదు ॥

వుమ్మగిలుఁజెమటచే నోలలాడేమగువను
కమ్మక యిప్పుడు వచ్చి కాయమంటేవు
నెమ్మవపుఁదమకాన నెరి వలనె నిందాఁకా
బిమ్మటిగాఁ జేయివట్టి పెనఁగకువయ్యా ॥ ఎదు ॥

వునరసురసుకొంటానుందేయలమేలుమంగను
పొసగించి కూడి యిట్టె భోగించితివి
యొసఁగ శ్రీవేంకటేశ యొసనె విన్నిందాఁకా
వెస మోవి గంటిగావించకువయ్యా ॥ ఎదు ॥ 143

1, 2, పునరుక్తులు. ఇట్టివక్కడక్కడ గలవు.

భైరవి

[1] చెలులాల యేమనిచెప్పెనో తాను
యెలమితో వివరించి యాతని నడుగరే ॥ పల్లవి ॥

చెక్కులవెంటఁ గారీఁ జెమటలూ
వెక్కసపుఁగొప్పువెంట విరులు రాలీ
చెక్కుకొంటాఁ దనదట్టిచెఱఁగు జీరాడఁగా
యెక్కడనుండి వచ్చీని యాతని నడుగరే ॥ చెలు ॥

అంగమునఁ దొట్టుపడీ నలపులూ
వుంగిటిగొనీ ముక్కున నుసురులు
సింగారపువింతలెల్లా చెలఁగఁగా
యెంగిలై యెందుండి వచ్చీ నీతని నడుగరే ॥ చెలు ॥

గిఱికొనీ మోవిమీఁద కెంపులూ
మెఱసీ నురాన వలమేలుమంగా
తఱి శ్రీవేంకటేశుఁడు తానె మమ్మేల్లా నేలె
యెఱఁగ మెందుండి వచ్చీ నీతని నడుగరే ॥ చెలు ॥ 144

రేకు 1325 దేవగాంధారి

ఎన్నినోములు నోఁచెనో యీరమణి
చన్నుల జవ్వనపుసంపదతోడా ॥ పల్లవి ॥

వలపుగద్దె యెక్కె వనితా
చెలపచెమటఅభిషేకముతోడ
కొలువు వేయించుకొనీఁ జెలులచేతా
బలిమి విట్టచూపులవఁ(పం?)జులతోడా ॥ ఎన్ని ॥

---

1. ఈపాటలో తరువాతిరెండుపాటలలో కొన్నిపాదాలకు దీర్ఘాలు సంగీతమునకు చెందినవి కావచ్చు.

కోరికలరాజ్యమేలీఁ గోమలి
  నూరువేలుపులకకానుకలతోడ
చేరి శైత్యోపచారాలు సేయించుకొని
  సారెఁ గొప్పునల్లజల్లిచామరాలతోడా ॥ ఎన్ని ॥

మరుపట్టమలమేలుమంగ గట్టె
  పురమున శ్రీవేంకటోత్తముతోడా
గరిమెఁ గప్పముగొనెఁ గళలెల్లాను
  సురతపుకొనగోరిసొమ్ములతోడా ॥ ఎన్ని ॥ 145

శంకరాభరణం

ఏలుకొన్నఫలమూ యింటి కిట్టె రావయ్యా
  మేలుగలఫలమూ మెచ్చఁగదవయ్యా ॥ పల్లవి ॥

చెప్పినట్టువింటేనే సేసినంతఫలమూ
  వొప్పుగొవి నామాఁటకు నూఁకొనవయ్యా
యిప్పుడియ్యకొంటేనే యిచ్చినంతఫలమూ
  చప్పఁగాదు నాపొందు సమ్మతించవయ్యా ॥ ఏలు ॥

నాపూడిగము చేకొంటే నగినంతఫలమూ
  భావించి నీపాదము నాపైఁ జాఁచవయ్యా
వావి నాతోఁ జెప్పితేనే మోవియిచ్చినఫలము
  యీవల నేఁ జేసేబత్తి కిటు లోనుగావయ్యా ॥ ఏలు ॥

కప్పుర మందుకొంటేనే కాఁగిలించినఫలము
  దప్పిదేరీ రతికేళిఁ దనుపవయ్యా
అప్పఁడ శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
  యిప్పుడు గూడినఫల మీదేరించవయ్యా ॥ ఏలు ॥ 146

లలిత

కడుఁజుట్టమవు నీవు కా నంటినా
    యెడయక నన్ను నిట్టె యేలుమంటిఁగాక ॥పల్లవి॥

చెక్కునొక్కి నీవు నాచేయివీ[illegible]
    తక్కక నవ్వు నవ్వఁగాఁ దగదంటినా
    వొక్కతెపైఁబెట్టి మాట వొక్కొక్కటె తడవఁగా
    వక్కణించ నంతేసి వద్దంటిఁగాక ॥కడుఁ॥

యేపున నావద్దనుండి ఇంత కలసిమెలసి
    కాఁపురము సేయఁగాను కాదంటినా
    చూపి మోపి యాడోవారిసొమ్ములు మేనఁబెట్టుక
    రాఁపులు సేయఁగా నందు కోపనంటిఁగాక ॥కడుఁ॥

చన్ను లురమున రాయ సారెఁ గాఁగిలించుకొని
    యెన్నిచేఁతలు సేసినా నేఁటికంటినా
    అన్నిటా శ్రీవేంకటేశ అలమేల్మంగనే నేను
    మన్నించి కూడితి విది మాననంటిఁగాక ॥కడుఁ॥ 147

మాళవిగౌళ

[1]చెప్పరాదు యీతనిసింగారాలు
    ముప్పిరిగొని సిరులు ముంచెనోకాని ॥పల్లవి॥

అందనే కప్పురకాఁపు లదివో దేవునికి
    మెండుకొని అమరెను మేననెల్లాను
    పుండరీకాక్షుఁడుగాన పొదలి తెల్లనికాంతి
    విందుకొని విలువెల్లా నెరపెనోకాని ॥చెప్ప॥

1. చూ. పాట 142. భావసామ్యము గలది

తట్టుపుణుఁగుకాఁపు దైవాలరాయనికి
దట్టమై యమరె విదె తనువెల్లాను
చుట్టు నెమలిపెంచముచుంగులనల్లవికాంతి
అట్టె అంగములనెల్లా నలమెనోకావి ॥ చెప్ప ॥

అలమేలుమంగ పురమందు శ్రీవేంకటేశున-
కెలమి నమరె యిదె యీతనమువున
మొల పీతాంబరమున మొలచినపైఁడికాంతి
అలరి మెడను సొమ్ములాయనోకావి ॥ చెప్ప ॥ 148

సామంతం

గడుసవుగదె నీవు కలికీ । వోరి
అడరి మరునిమహి మటువంటిదౌరా ॥ పల్లవి ॥

తప్పకచూచేవేమే తరుణీ । వోరి
కుప్పించీ నీమీఁదను చకోరాలురా
చిప్పిల నామేనెల్లాఁ జెమరించెనే । వోరి
యెప్పుడూ వాఁటిగుణాలు ఇటువంటివౌరా ॥ గడు ॥

వొఱపులే పీచన్ను లువిదా । వోరి
మెఱసీ జక్కవలు నీమీఁదనుండిరా
మఱి కరఁగేఁగదవే మగువా । వోరి
యెఱఁగవా వాఁటివోజ లిటువంటివౌరా ॥ గడు ॥

మించి పురమెక్కె వలమేలుమంగా । వోరి
యెంచలు నీయందు వోలాడఁజొచ్చెరా
యెంచఁగల శ్రీవేంకటేశుఁడఁగదే । వోరి
వంచనతోఁ గూడితివి వావిజాడలౌరా ॥ గడు ॥ 149

పాడి

ఏమి దక్కువాయ నీకు నిందువంకను
కామినినేసేబత్తిఁ గైకొనరాదా ॥ పల్లవి ॥

కన్నులనే కొసరుచు కాఁకలు నీపైఁ జల్లీ
అన్నిటా నదేమని యడుగరాదా
చిన్ననాఁడే బాస యిచ్చి నేసలు వెట్టితివట
మన్నించి యట్లానే మనుపరాదా ॥ ఏమి ॥

పలుకుచు సతి నీపచ్చడముకొంగంటీ
విలిచి మారుమాఁట నీవాడరాదా
అలరుఁజవికెలోన ఆసలఁబెట్టితివట
తలపోఁత లీడేర్చి దయఁజూడరాదా ॥ ఏమి ॥

నవ్వుతా నలమేలుమంగ నంటున నీవురమెక్కె
నివ్వటిల్ల నీమచ్చిక నెరపరాదా
రవ్వగా శ్రీవేంకటేశ రతుల మెచ్చితివట
జవ్వనికి నన్నిటాను చనవియ్యరాదా ॥ ఏమి ॥ 150

రేకు 1326 శంకరాభరణం

నీనేరములకు నేనా గురి
నానఁబెట్టి కత నడపఁగరాదా ॥ పల్లవి ॥

మఱఁగుల మొఱఁగుల మాఁటలాడితే
మఱి కరఁగెను నీమన సిపుడు
యెఱఁగను నే నందుకేమి సేతురా
నెఱపునీబిగువు నిలుపఁగరాదా ॥ నీనే ॥

సేయరానివని చేసి చెనకితే
కాయపుఁజెమటలు కడు వడిసె
రాయడించరా రతివేళ వెనక
తీయక ధైర్యము తెచ్చుకోరాదా ॥ నీనే ॥

అలమేల్మంగ నే నటు విన్నఁ గూడిన
పులకించె మొగము కళ రేఁగి
చెలివి నవ్వరాదా శ్రీవేంకటేశ్వర
బలిమిఁ బరాకువఁ బైకొవరాదా ॥ఏనే॥ 151

హిందోళవసంతం

మేలు మేలయ్యా నిన్ను మెచ్చితిమి నీ వింతివి
లాలింతురుగాక యీలాగు సేతురా ॥పల్లవి॥

శిరసువంచుకుండితే సిగ్గుదేర్చవలెఁగాక
కరకరిఁబెట్టి యింత కాఁగిలింతురా
విరసాన నలిగితే వేఁడుకొనవలెఁగాక
పెరిగేకుచము లిట్టె పిసుకుదురా ॥మేలు॥

దవ్వులనే నిలుచుంటే దగ్గరిరావలెఁగాక
పవ్వళించి గబ్బి విమ్మపంట సేతురా
అవ్వలిమోమైతేను ఆదరించవలెఁగాక
తువ్వవడ కుచ్చెలకొంగువట్టి తీతురా ॥మేలు॥

మోనాన నుండితే మోవితేనె చవిగొంటగాక
కామకగా వందుమీఁద గంటిసేతురా
బొనవి శ్రీవేంకటేశ అలమేల్మంగఁ గూడితి-
వానుక వుందువుగాక ఆఱిది సేతురా ॥మేలు॥ 152

కాంబోది

ఎంత గిబిగిబిసేసే వింతివి నీవు
మంతనానఁ జేయరాదా మఱి చేఁతలెల్లను ॥పల్లవి॥

విప్పుచు నెలవులను విన్నపాలు సేయఁగాను
చిప్పిల మోవి యెంగిలిసేసేవు
రెప్పలెత్తి కన్నులను రేసువడి చూడఁగాను
కొప్పువట్టి జారఁదీసి కొనరేవు ॥ ఎంత ॥

పాదములు నీకొత్తఁగాఁ బడఁతి చన్నుమొనలు
[1]దాదాత(య?) బొట్టనవేళ్లఁ దాఁకించేవు
కాదనక నీకు నూడిగములెల్లాఁ జేయఁగాను
సేదదేరఁ బిరుదుపైఁ జేయిచాఁచేవు ॥ ఎంత ॥

గందము నీకుఁ బూయఁగా కమ్మి యలమేల్మంగను
కందువ శ్రీవేంకటేశ కాఁగిలించేవు
సందడింపురతులను చవులెల్లాఁ జూపఁగాను
మందలించి కూడి సదమదము సేసేవు ॥ ఎంత ॥ 153

## మాళవిగౌళ

[2]భావించి చూడరే పడఁతులాల
చేవదేరి మహిమలు చెలఁగినట్టుండెను ॥ పల్లవి ॥

పరమపురుషునికి పచ్చకప్పురముకాఁపు
తిరుమేన నమరెను తెల్లవికాంతి
ధరలోఁ బాలజలధి తచ్చేటివేళను
మరిపెమై తుంపురులు ముంచినయట్టుండెను ॥ భావిం ॥

---

1. దాయన్ + దాన్ దా = దాయయన్ : అని వ్యత్యస్తించియుండునా ? ఇదియూ ప్రకరణమునుబట్టియే. 'దాదాత' అని ఒకప్రయోగ మీవాఙ్మయమున అక్కడక్కడ కలదు. అర్థము తోచుటలేదు. 2. చూ. పాట 142. భావసామ్యము. దీని మొదటిపాదము "క్షీరసాగరతరంగశీకరాసార" అను కులశేఖరాళ్వార్ పద్యమును బోలియున్నది. ఈ పాటలే 'ఒకపరికొకపరికొయ్యారమై' అను పెదతిరుమలాచార్యులపాటకు మూలము కావోలు.

తవిలి యీదేవునికి తట్టుపుణుఁగుకాఁపు
నవమై మేన నమరె నల్లనికాంతి
తివిరి గోవర్ధనమెత్తిననాఁడు విఁడుకొని
ధ్రువమై మేఘకాంతులు తొలఁకినట్టుండెను ॥ భావిం ॥

శ్రీవేంకటేశునికి సింగారించిన సొమ్ములు
భావించ మేన నమరె బంగారుకాంతి
తావుగా నలమేల్మంగ తనవుర మెక్కఁగాను
వేవేలుసంపదలెల్లా వెలసినట్టుండెను ॥ భావిం ॥ 154

రామక్రియ

చిత్తగించవయ్యా చెలియ విలాసాలు
బత్తినేసీ నేఁడు నీపాదా లొత్తఁగాను ॥ పల్లవి ॥

చిగురుమోవిమీఁదఁ జిప్పిలీఁ దేనెలు కడు
మగువ నీతో నట్టె మాటాడఁగాను
నగెడినెలవులను నారుకొనీఁ గప్పురము
మొగము చూచి నీకు మొక్కఁగాను ॥ చిత్త ॥

నెరసి గుబ్బలమీఁద నిండీఁ బులక లివె
తరుణి పయ్యెద నిన్నుఁ దాఁకఁగాను
పురిగొని కొప్పులోనిపువ్వులు రాలీ నివె
బెరసి నీకాఁగిటఁ బెనఁగఁగాను ॥ చిత్త ॥

కలికి మొగములోనఁ గళలు రేఁగీ నవె
అలమేలుమంగ నిన్ను నలమఁగాను
అలరి శ్రీవేంకటేశ అంగములు పొంగీ నవె
అలసినరతిలో నీవాదరించఁగాను ॥ చిత్త ॥ 155

ముఖారి

ఎఱిఁగించీ విరుమేలా విదివో నీమనసు
గుఱి గాడిపారీవి గోవిందరాజా ॥పల్లవి॥

కొలువులోపలనున్నకొమ్మలపాటలు వింటా
అలరి నీవు పరాకై వుండఁగా
కులికి పాదములొత్తేకొమ్మలు కొనగోళ్ల
యెలమిఁ దమమోహము లెచ్చరించేరు ॥ఎఱిఁ॥

యెదుట నాట్యములాడేఇంతులనుఁ జూచుకొంటా
గుదిగొని యట్టె చొక్కుచునుండఁగా
ఇదివో ఆకుమడిచిఇచ్చేసతులు చేతుల-
నదిమి తమమీఁదట ఆసలుచూపేవు ॥ఎఱిఁ॥

సారె విన్ను పింగారించేసతులచన్నులు చూచి
చేరి శ్రీవేంకటేశుఁడ చేఇచాఁచఁగా
శ్రీరమణి భూరమణిఁ[1] జెంది నీ కాఁగిటిలోన
పేరడిరతుల విన్నుఁ బెచ్చురేఁచేరు ॥ఎఱిఁ॥ 156

రేకు 1327 సామంతం

చూడరమ్మ చెలులాల సుదతిభాగ్యాలు నేఁడు
వేడుకలెల్లా వెల్లివిరిసినట్లుండె ॥పల్లవి॥

కోమలికొప్పుననుండి కురిసేటివిరులకు
వాములై తుమ్మెదలు వాలఁగాను
కాముఁడు గురులేయఁగా కడనుండి వల్లఁబజ[2]
దోమటి నెఱకరాను తొడఁగినట్లుండె ॥చూడ॥

1. ఈ అరమున్న సముచ్చయమునకు. 2. వల్లవ్రజ = కిరాతసంఘము లేక జాతి విశేషము. "కొమ్మల్లమోయ వల్లవ్రజ" శుక-1-224. 'వల్లఁబజ' అన్నమయ్య ప్రయోగము.

మెఱిత మాటాడఁగాను మించె చిగురుమోవివి
తొలఁగక కోవిలలు తొడుకఁగాను
వలరాజు వఱకిన వాఁడినెత్తురుపట్టెలు
చెలఁగి బంట్లు చికిలిసేసినట్లుండె ॥ చూడ ॥

కొమ్మ శ్రీవేంకటేశ్వరుఁ గూడినచెమటవాన-
కుమ్మదిఁ [1] జకోరాలు వొడియఁగాను
దిమ్మరేఁగి మరుఁడు ముత్తేల వసంతమాడఁగా
యిమ్ముల వర్షులు వచ్చి యెదిరినట్టుండె ॥ చూడ ॥ 157

వరాళి

వింతవారమా నేము విచారించుకొనవయ(య్యః)
బంతి మన్నారు సతులు పాయనినీకృపను ॥ పల్లవి ॥

యెంతలేదు నీనవ్వు యెవ్విలేవు నీమాటలు
అంతటాను తనిసిరి యాఁడువారెల్లా
చింతదీర నీకు నేము సేవసేసేవారము
దొంతి నున్నది వలపు తొల్లె నీకృపను ॥ వింత ॥

యేమిసేసేవు నీయాన లెఱఁగమా మీబాసలు
దోమటిగాఁ దొడికిరి తొయ్యలులెల్లా
వోముచు నే మెప్పుడును వూడిగపువారము
వాములాయఁ దమకము వంచిననీకృపను ॥ వింత ॥

యెక్కడా నీసుద్దులే యెవ్వరైనాఁ బొగడేరు
వొక్కటై కూడిరి విన్ను వువిదలెల్లా
చిక్కి నమ్ము నేలితివి శ్రీవేంకటేశ్వర
పెక్కువమాయ భోగము పెలనె నీకృపను ॥ వింత ॥ 158

1. చాతకాలు కావచ్చు.

దేసాళం

వెలఁది వింత టే నీవు వేఁడుకోవయ్యా
యెలయింపుఁజేఁతలు నేఁ డివి యేలయ్యా ॥పల్లవి॥

మొగమోటమునఁ జెలి మొదలికోపము మాని
మగఁడవంటా నీతో మాటాడెఁగాని
అగడుసేసేనంటే అందు నెంతైనాఁ గద్దు
యెగసక్కె లింకాను నీవేలాడేవయ్యా ॥వెలఁ॥

ప్రియవాదిగన నీతోఁ బెనఁగి మారాడక
నయమిచ్చి జలజాక్షి నవ్వెఁగాని
వియతి సాదించేనంటే నేరుపెంతైనాఁ గలదు
జయమాయ వీఁకనేల చల మింకానయ్యా ॥వెలఁ॥

యిచ్చకురాలై నిన్ను యెనసి శ్రీవేంకటేశ
మచ్చికసేసి యిఁ(యిం?)తి మరిగెఁగాని
పచ్చిసేసేనంటేను పగటెంతైనాఁ గద్దు
యిచ్చినచనవు లిట్టె యీడేరించవయ్యా ॥వెలఁ॥ 159

మాళవిగౌళ

ఇప్పుడే విన్నవించితి నెఱుఁగుకొందువుగాని
తప్పితే నలులమోఁత తమికిఁ(కిం?)చీఁజూమ్మీ ॥పల్లవి॥

బలిమి వింతి నీవు పాసివుండేవుగనక
తలఁపఁ గప్రపువేఁడిఁ దాఁకీఁజూమ్మీ
నలువంక వెలవులనవ్వుల నీవుండితేను
కలువపూవుటమ్ములాలి వారీఁజూమ్మీ ॥ఇప్ప॥

చేరి చెనకఁగ నీవు సిగ్గువడేవుగనక
సారెకు వెన్నెల వడచల్లీఁ జుమ్మీ
గారవించి యాపె యిట్టె కాఁగిలింపకుండితేను
నారుకొని చిగురు మొనలుచూపీఁ జుమ్మీ ॥ఇప్పు॥

మొక్కలాన నీ వవ్వలిమోమయ్యేవుగనక
విక్కు కోయిలలరొద నిండీఁ జుమ్మీ
గక్కున శ్రీవేంకటేశ కలసితి నీకె యిట్టె
కక్కసించితే మదనకళలందీఁ జుమ్మీ ॥ఇప్పు॥ 160

హిందోళవసంతం

నీ వుండే దొక్కయంగము నే నుండే దొక్కయంగము
కై వశమైతివి యింకఁ గతలెల్లాఁ జెల్లును ॥పల్లవి॥

సిగ్గువిడిచేయాఁటది చేతులఁ బట్టఁగరాదు
యెగ్గులేదు మగవాని కెట్టుండినాను
వొగ్గి నేను మేరతోనే వున్నచో నుండానను
బగ్గన నీకంతటాను పారాడఁజెల్లును ॥నీవుం॥

పొంచి యణఁకువలేనిపొలఁతి దేఁటిగుణము
వంచనలేకున్నా మగవాని కమరు
మంచముపై నిట్టె నెమ్మది నే నుండానను
యెంచఁగ రచ్చలుసేయ నిటు నీకుఁ జెల్లును ॥నీవుం॥

గుట్టుతో నుండకుంటేను కోమలి కేఁటివారపు
వట్టిరట్టు మగవానివద్దనే కద్దు
ఇట్టె శ్రీవేంకటేశ ఇటు నిన్ను నేఁ గూడితి
మొట్టి యెంతైనా నీవు మోహించఁజెల్లును ॥నీవుం॥ 161

కాంబోది

ఎఱఁగనివాఁడవా యేమయ్యా నీవు
మఱవవచ్చునా మేలు మన్నింతురుగాక ॥పల్లవి॥

సరసములాడితేను సాకిరివెట్టుదురా
వొరసివొరసి నవ్వుదురుగాక
శిరసువట్టితేనే చేతుల విగింతురా
కరఁగినమనసుతో కైకొందురుగాక ॥ఎఱఁ॥

తచ్చితచ్చి చూచితేను తలవంచుకొందురా
ఇచ్చగించి గక్కనఁ జేయిత్తురుగాక
పచ్చిమాటలాడితేను పరాకుసేయుదురా
అచ్చమైనచనుఁగొంద లంటుదురుగాక ॥ఎఱఁ॥

అట్టె కాఁగిలించుకొంటె ఆయాలు ముట్టుదురా
నెట్టుకొని యిట్టె కరుణింతురుగాక
గుట్టున శ్రీవేంకటేశ కూడివింతి జంకింతురా
చుట్టరికములెల్లాను చూపుదురుగాక ॥ఎఱఁ॥ 162

రేకు 1328 శంకరాభరణం

ఔదువయ్యా జాణఁడవు అన్నిటాను
పాదవని పొగడితే-జడిసేవయ్యా ॥పల్లవి॥

నీచిత్తము రావలసి నేఁ జేసితి నూడిగాలు
యేచి యందుకు నవ్వే వదేమయ్యా
చేచేత నే విన్నపాలు చెవిలోనఁ జేసితేను
లాచి నన్నుఁ దిట్టితివి లాగొనయ్యా ॥ఔదు॥

సంగతి నాకుమదిచి చవిదెలిపిచ్చితేను
ఘెంగిలంటాఁ గాకుసేసేవేమయ్యా
ముంగిట నే నీశిరసుముడిచేసంటా వంటితే
వంగి నాకొప్పు నంటేవు వాసికాఁడవయ్యా ॥ ఔదు ॥

గాఁటముగా రతికేలిఁ గాఁగిలించుకొంటేను
నాఁటెఁ జన్నులంటా గోర గీఁటేవయ్యా
నీఁటుల శ్రీవేంకటేశ విన్ను నేనే మెచ్చితేను
యీటులేవిచవవెల్లా విచ్చితివయ్యా ॥ ఔదు ॥ 163

శుద్ధవసంతం

ఇందుకే నేఁ జింతించే నెటువలె నున్నాఁడవో
సందడిపెండ్లిండ్లాయ సరువ నీబతుకు ॥ పల్లవి ॥

చెంతలనాకె నీపైఁ జేయివాఁచఁగాను
వంతుకుఁ జేయిదాఁచితి నవ్వల నే నుండి
యింతుల మిద్దరమును ఇరువంకలా నుండఁగా
నంతకూటమాయ విదె చక్కనినీమేను ॥ ఇందు ॥

ఆకడ నాకె నీకు నాకుమడిచియ్యఁగాను
యీకడ నేనూ నీకు విచ్చితి విట్టె
కైకొని యిద్దరు నూడిగము నీకుఁ జేయఁగాను
కాకువడి కలగూరగంపాయ నీవోరు ॥ ఇందు ॥

గక్కన నాపె విన్నుఁ గాఁగిటఁ గూడఁగాను
వొక్కపై నేమూ నట్టే వొావరఁగాను
యిక్కువ శ్రీవేంకటేశ యెనసి యిద్దరివల్లా
అక్కర మరిపేకళ్లమాయను నీపురము ॥ ఇందు ॥ 164

ఆహిరి

ఇద్దరిభావములను యేమని విన్నవించేము
అద్దుకొన్నప్రియములు అయములు సోఁకెను ॥పల్లవి॥

చెక్కుచేతితోడనే చెలి నిన్నుఁ జూతఁగాను
చిక్కనిచెమటలెల్లా చేర నిండెను
నెక్కొని యంతవట్టును నీమీఁద నేఁ జల్లితేను
వెక్కసమై పులకలు వెదకు మొలచెను ॥ఇద్ద॥

వయ్యాదమునుఁగుతోడ వడఁతి నీతో నవ్వితే
వొయ్యనే కొప్పువిరులు వోడి నిండెను
నెయ్యపువేడుకతోడ నీమీఁద నవి చల్లితే
మయ్యరానికళలెల్లా మోమున వెలసెను ॥ఇద్ద॥

చన్ను లురమున మోవ సతి నిన్నుఁ గూడితేను
వున్నతి మోవిఁ దేనె లుబ్బి నిండెను
యెన్నఁగ శ్రీవేంకటేశ యివి నీమోవిఁ జల్లితే
తిన్ననియానందము దేహాన నిలిచెను ॥ఇద్ద॥ 165

సాళంగం

ఎఱఁగనివారు గల రెఱుఁగువారు గలరు
యెఱుకతోనే నీవు ఇంత గేలిసేతురా ॥పల్లవి॥

మన్నింతువంటా నీతో మనవి విన్నవించితే
పన్నుల నవ్వేవు నీవు పారెసారెకు
తిన్నఁగాఁ దప్పుగలితే దిద్దవలెఁగాక నీవు
యెన్నఁగ వింతులలోన వింత గేలిసేతురా ॥ఎఱఁ॥

వోరుత(తు?)వంటా విన్ను వొడివట్టి కొసరితే
సారెసారె నవ్వేవు జారుఁగొంగుతో
నేరమి గలిగితేను నేరుపఁగవలెఁగాక
యీరీతి విందరిలో నింత గేలిసేతురా ॥ ఎఱు ॥

చెందితివంటా విన్నుఁ జెలఁగి మెచ్చితేను
సందడి నవ్వు నవ్వేవు సారెసారెకు
విందుల శ్రీవేంకటగోవిందుఁడ నన్నేలితివి
యిందరిలో నారతుల వింత గేలిసేతురా ॥ ఎఱు ॥ 166

సాళంగటనాట

బతికితి వన్నిటాను పడఁతివల్లను నీవు
రతికిఁ బిలువవయ్యా రవ్వగాఁ జేసీని ॥ పల్లవి ॥

సుద్దులు నీతోఁ జెప్పి చొక్కించి అందరుఁ జూడ
బుద్దులు నీకు నేరిపీఁ బొలఁతి
వొద్దమంది నవ్వుతాను వొడివట్టి తీసితీసి
పెద్దరికములు వేసి ప్రియముచెప్పీని ॥ బతి ॥

చెక్కులు నీకు నొక్కి సేవలు గొంత సేసి
ఇక్కువలెల్లా వంటీ నింతి
అక్కరతో వీడెమిచ్చి ఆకుమడిచొపఁగుతా
వెక్కసపుటిచ్చకము వేమారుఁ జేసీని ॥ బతి ॥

నెమ్మదిఁ గాఁగిట వించి నీకు మోవి చవిచూపి
సమ్మతించఁజేసి కూడె సకియ
మమ్ముఁ [1]గూడితివి నేఁడు మక్కువ శ్రీవేంకటేశ
చిమ్ముచుఁ గమ్మటిఁ దాను సేసలువెట్టీని ॥ బతి ॥ 167

1. 'జూతివి' రేకు.

శ్రీరాగం

వెనకటినేరములు వేయైనాఁ దడవను
మనసొక్కటిగా బుద్ధిమంతుఁడైతేఁ జాలును ॥ పల్లవి ॥

యేఁటికింకా మాటలు యేమని దూరేము నేము
గాఁటపుఁదనకరుణ కలంతే చాలు
కూటమికి రమ్మనవే గుట్టుతోనే వుండేను
మాఁటులేవితాను బుద్ధిమంతుఁడైతేఁ జాలును ॥ వెన ॥

కాఁతరించఁబనిలేదు గద్దించ నోపను
చేతికిలోనై మన్నించివదే చాలు
తే తెమ్మనవే విడెము తిరమైతి నన్నిటాను
మాతలఁపువలె బుద్ధిమంతుఁడైతేఁ జాలును ॥ వెన ॥

చెక్కు లెంతవడి నొక్కె సిగ్గు లెందాఁకా నెరపె
ఇక్కువంటి ననుఁగూడె విడె చాలు
దక్కె శ్రీవేంకటేశుఁడు తానే నాకిన్నిటాను
మక్కువ వింతట బుద్ధిమంతుఁడైతేఁ జాలును ॥ వెన ॥ 168

రేకు 1329 రామక్రియ

కలసితి మిందరము కాఁగిటిపొత్తు
చెలఁగి నీనేమములు చెప్పనేఁటి కిఁకను ॥ పల్లవి ॥

కాంతలందరితోడాను కలయఁగ వచ్చేవు
సంతవావులాయఁగా నీసరసములు
యింతలో నందరిమోవులెంగిలి నేకములాయ
చెంతల నీనేమములు చెప్పనేఁటి కిఁకను ॥ కల ॥

చల్లఁగా నందరితో జాజములు నీ వాదేవు
గొల్లదోమటాయఁగా నీకోరికలు
కల్లగాదు రతివేళ కాఁగిళ్లల్లా నొక్కటాయ
చిల్లర నీవేమములు చెప్పనేఁటి కింకను ॥ కల ॥

వాడిక నందరి కొక్కవరుపిచ్చి కూడితివి
యీడఁ గలగూరగంపై యెనసెఁ బొందు
తోడనే శ్రీవేంకటేశ [1] దొమ్మేయ మరుతంత్రము
జీడిగా నీవేమములు చెప్పనేఁటి కింకను ॥ కల ॥ 169

శుద్ధవసంతం

ఎదిరి వి న్నెంచుకోవు యేమీ నీవు
కదిసివుండినవారిఁ గైకొనవచ్చేవు ॥పల్లవి॥

తలగరివానివలె తచ్చితచ్చి మాఁటాదేవు
యెఱఁగవా నాగుణ మింతకతొల్లి
మెఱనేనతులరతి మిక్కిలి బేరములాడి
కొఱతలేనివారిఁ గొసరవచ్చేవు ॥ ఎది ॥

తగవరివలెనే తతిగాని యడిగేవు
పగటు దెలియవా నాభావపు(ము?) నీవు
అగపడినయింతుల అలుకలు దిద్దిదిద్ది
వొగరులేనివారి నొరయవచ్చేవు ॥ ఎది ॥

చుట్టపువానివలె చూచి కాఁగిలించేవు
దిట్టతన మెఱఁగవా దేవుల నేను
యిట్టె శ్రీవేంకటేశ యిటు ని(న?)న్నుఁ గూడికూడి
మట్టులేనివారిని మరపవచ్చేవు ॥ ఎది ॥ 170

1. దొమ్మి+అయ.

సామవరాళి

గుట్టున నుండుటే మేలు కొసరఁగఁ బనిలేదు
బట్టబయ లీఁదఁగాను పనికివచ్చీనా ॥ పల్లవి ॥

వలపీనొల్లనిసతివద్ద నెంతనిలుచున్నా
తలఁపులో నీకిట్టె దయవుట్టీనా
సొలసిసొలసి యెంత సోబానఁ బాడినాను
పిలువనిపేరటము ప్రియమయ్యీనా ॥ గుట్టు ॥

చనవులేనియింతి సరస మెంతాడినాను
పెనగొని నీకిఁకఁ బ్రేమవుట్టీనా
మనవితో విచ్చకము మాపుదాఁకాఁ జేసినాను
వానరవినేత్రములు వొద్దికయ్యీనా ॥ గుట్టు ॥

ననుపుగానిచెలి నవ్వు లెన్ని నవ్వినాను
తనిసి వుందువుగాక తమకించేవా
ఘనుఁడ శ్రీవేంకటేశ కాఁగిట నన్నేలితివి
వెనకటివారిపొందు వేడుకయ్యీనా ॥ గుట్టు ॥ 171

మధ్యమావతి

కానీలే అందుకేమి కామిని దానె వచ్చి
మైనమువలెఁ జేయక పునమాట వినునా ॥ పల్లవి ॥

చలపాదివానితోడ జాణతనాలాడితేను
మలసి తనగుణము మానీనా
మొలచన్ను మొవలమోసుల[1] నూఁది మనను
చెలఁగించివేఁగాక చెప్పినట్టు సేసునా ॥ కానీ ॥

1. మొవలు — మొదలు వేం॰

గట్టువాయవానితోడ కతలెన్ని చెప్పినాను
అట్టే వుండుఁగాక చాయకు వచ్చీనా
మట్టుమీరఁ గొనగోర మర్మములెల్లా నంటి
వొట్టి కరఁగించక వొడఁబడనేర్చునా ॥ కానీ ॥

శ్రీవేంకటేశ్వరునిఁ జెక్కు లెంతనొక్కినాను
చేవలుమీరుఁగాక సిగ్గువడీనా
యీవేళనే యింతిఁ గూడి ఇచ్చలాడి వురముపై
తావుకొన నిటుగాక తనవోజ మానునా ॥ కానీ ॥ 172

బౌళి

చెనకేవు వూరకైనాఁ జెరఁగువట్టి తీసేవు
మనసిచ్చి మమ్మెందులో మన్నించేవయ్యా ॥ పల్లవి ॥

చనవుగలవారికి సారె మందెమేళము
నసుపుగలవారికి నవ్వులువచ్చు
యెనసినవారికి ఇయ్యకోలై వుండు
అవిశము మమ్మెందులో నాదరించేవయ్యా ॥ చెన ॥

మేనవారైనవారికి మించు నట్టె వుద్దండము
నావినయింటివారికి నమ్మిక గల్గు
పూని కొలువువారికి పొద్దులు దవిసివుండు
కానీలే మమ్మెందులోఁ గైకొనేవయ్యా ॥ చెన ॥

వొట్టి పెండ్లాడినవారి కొతమనసై వుండు
నెట్టుకొన్నవారికి నెలపై వుండు
గుట్టున శ్రీవేంకటేశ కూడితివి నన్ను నేఁడు
యిట్టె మమ్మెవ్వరిలోన నేలేవయ్యా ॥ చెన ॥ 173

శంకరాభరణం

నీవల్ల నింతేసి నివ్వెరగందితి
చేవల్లకు రావే చెప్పేను నేను ॥పల్లవి॥

కొప్పు దువ్వఁగాను గోరుదాఁకెఁ జెక్కు-
యెప్ప[illegible]
చిప్పిలఁగా నీవు జీరదీసితివో
చెప్పఁగదే భ్రమసితి నేను ॥నీవ॥

పలుకఁగాను నాపల్లు దాఁకె మోవి
యెలయించి నవ్వనేమిటికి
నిలిచి యీచేఁత నీవు సేసితివో
తలఁపించవే కొత్తలైతి నేను ॥నీవ॥

సరసమాడఁగాను సందిసొమ్ము లొత్తె
యిరవయితి నవ్వనేమిటికి
సరి శ్రీవేంకటేశ్వరుఁడను నా-
వుర మెక్కితివి వొప్పితి నేను ॥నీవ॥ 174

రేకు 1330 ముఖారి

చెవులార వివరే చెలులాల మీకుఁ జెప్పే
వివరించి యీతగవు విచ్చిచెప్పరాదే ॥పల్లవి॥

యెఱుఁగుదులేవే తన కిచ్చలాడితే నేను
మఱపులేవియట్టిమంచిదానను
నెఱియ నెరుసువెట్టి నేరములెంచితేను
నెఱతనములతోడివిష్టూరి నేను ॥చెవు॥

తెలుసులేవే తన్ను దేవరంటాఁ బొగడితే
పలుమారు నాపై నే బత్తివేసీవి
అలిగి తవమర్మము లట్టె యెత్తి తిట్టితేను
చలపాదితనములజగరాఁగ నేమ ॥ చెప్పు ॥

కంటిలేవే యిట్టె తన్ను కాఁగిలించి కూడితేను
జంటతో తనపాలికి జాణవైతివి
యింటిలో శ్రీవేంకటేశుఁ డితవి నే సోదించి
దంటతనపునేఁతలతరుణి నేమ ॥ చెప్పు ॥ 175

నాదరామక్రియ

ఇంక నెంతగాఁ గద్దో యింతి నీజవ్వనము
వుంతువై వొక్కటొక్కటి కొనగూడె వలపు ॥ పల్లవి ॥

చిక్కఁగా నీవు నవ్వితే చిత్తదిచెమట గారె
చెక్కునఁ జేయిపెట్టితే సిగ్గులు మూఁగె
నెక్కొన మాటాడితేను నిట్టూరుపులు రేఁగె
వొక్కటొక్కటే దొంతరై వొనగూడె వలపు ॥ ఇంక ॥

తప్పకచూచితేనే తతిగొనెఁ బులకలు
చిప్పిలఁ జెనకితేనే చింత రేఁగెను
వొప్పి సరసమాడితే వోడికట్టు వదలెను
వుప్పరాలై వొక్కటొక్క టొనగూడె వలపు ॥ ఇంక ॥

తనువులు మోచితేనే తతిగొనెఁ దమకము
పెనఁగితేఁ బ్రియములు పిక్కటిల్లెను
యెనసె శ్రీవేంకటేశుఁ డింతలో విన్నన్నితాను
వునికై వొకటొకటే వొనగూడె వలపు ॥ ఇంక ॥ 176

### రీతిగౌళ

చెలియను నే నన్నుఁ జెప్పవంపేను
అలయక నీవే యన్ని నానతియ్యవయ్యా ॥పల్లవి॥

మంతనాన నాపెచేత మాటలెల్లా నాడించే
చెంతల నీమేనెల్లాఁ జెమరింపించే
దొంతినున్నవలపులు దోమటిదొడికింపించె
వింతలేమి సేయవలె వేగ నానతీవయ్యా ॥చెలి॥

సేవసేసి నిన్ను నిట్టే సిగ్గులెల్లాఁ బరపించే
పూవులనే వేసి నిన్నుఁ బొదఁగింపించే
లావులఁ బెనఁగి నీమై లచ్చనలు నిండింపించే
కావలసినపని గక్కన నానతీవయ్యా ॥చెలి॥

సమరతులను నీజవ్వనము పండింపించే
తమితో మోములకళలు దాకొనిపించే
నెమకి శ్రీవేంకటేశ నేఁడు నన్ను నేలితివి
సముకాన నీయాసలు సారె నానతీవయ్యా ॥చెలి॥ 177

### మాళవి

ఇంతటివాఁడవు నీకు యేము రెవ్వ రున్నారు
చెంత నీవు సేసినవే చేఁతలుగావా ॥పల్లవి॥

కొమ్మలమనసులోనికోపములు మానిపేవి
పమ్మి నీవుసేసేటిదానలేకావా
తమ్మి మొకములనిండా కళ లట్టే రేఁచేవి
చిమ్ముల నీకొనగోరి చెనకులేకావా ॥ఇంత॥

కదుసంధానము సేసి కపటాలు పాపేవి
అదియాలమైననీయాసలే కావా
బదిబదిఁ బాయకుండా బాఁతిపడఁజేసేవి
విడువక నీవు నేసేవినయాలే కావా ॥ఇంత॥

జమళిసిగ్గు దీరిచి చవులు వుట్టించేవి
సుముకమయిననీచూపులే కావా
తమితో శ్రీవేకంటేశ తగ నన్ను నేలితివి
నెమకేవి నీరతులనేరుపులే కావా ॥ఇంత॥ 178

హిందోళవసంతం

నీకే మేలుగదవే నీపతిసరసములు
దాకొని విలువుననే తమి నూరువంచీని ॥పల్లవి॥

కోపగించుకొనకువే కోరి యాతఁ డేమనినా
తీపులమాటలవెంటఁ దేనె గారీని
యేపున వేసరకువే యిట్టె చెనకితేను
రాపుల గోరికొననే రాలీని వలపు ॥నీకే॥

సిగ్గులువడకువే చెంత నాతఁ డుండితేను
వెగ్గళపువినయాన వెన్న వుట్టీని
బగ్గనఁ దిట్టకువే పయ్యదకొం గంటితేను
యొగ్గి వుంగరపువేళ్ల నొరవు మించీని ॥నీకే॥

కొసరకువే నిన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడు
సుసరపురతులను సుంకు మోపీని
అసురుసురవకువే అన్నిటాఁ బెనఁగితేను
వెసఁ గమచూపుల వెన్నెలగాసీని ॥నీకే॥ 179

తెలుఁగుఁగాంబోది

[1] మొకదాకిరివి నీపై మోహమే చల్లుఁగాని
వెకలితనాన నిన్ను వేసరించదు ॥ పల్లవి ॥

యేఁ(యెం?)తైనాఁ జెలి నీతో యెదురు మాఁటాడదు
వంత గలిగితేఁ దలవంచుఁగాని
వింతవై తిరిగినాను వెగ్గళించదు నిన్ను
అంతలోనే వునురసురముఁగాని ॥ మొక ॥

యెరవుగ మఱచి(చై?)నా యెంచదు నేరాలు నిన్ను
వారిమెతో మోనాన నుండుఁగాని
విరహతాపము గల్లా విసుగదు నీమీఁద
సిరులచెక్కుటచేత చింతించుఁగాని ॥ మొక ॥

నవ్వులకయినా నీతో నాలివెంగే లాడదు
యివ్వలిమోమై విడె మిచ్చుఁగాని
రవ్వగా శ్రీవేంకటేశ రమణిఁ గూడితి విట్టే
వువ్విళ్లూరఁ గాఁగిట నొనరుఁగాని ॥ మొక ॥ 180

రేకు 1331 ఆహిరినాట

నీయంతా నెఱఁగవు నేము చెప్పినా వినవు
పాయముగలయందుకు ఫలమా ఇది ॥ పల్లవి ॥

పట్టినదే చలమా పదఁతి నీ వాతనితో
చుట్టరికము సేసితే సూడునట్టేవా
బిట్టునయ లేఁదించేవు పలుకుల సారెసారె
గుట్టులోడినతులకు గుణమా ఇది ॥ నీయం ॥

1. మొకదాకిరివి=ముఖదాక్షిణ్యముతో అని భావార్థము.

చెనకితే నెలవా చెమరించే వంతలోనె
పెనఁగఁగానే అలపి విగిచేవు
తనిపేవు నవ్వులనే తను విది మీఁదమీఁద
చనవుగలయందుకు చందమా ఇది ॥నీయం॥

సేసినదే చేఁతా శ్రీవేంకటేశుకాఁగిట
నేసవెట్టఁగానే గోరఁ జెక్కునొక్కేవు
రాసిసేసేవు వలపు రతులలో నెల్లా నీవు
పోసరపువేడుకకు భోగమా యిది ॥నీయం॥ 181

మాళవిగౌళ

బలిమి యెంతసేసినాఁ బనికిరాదు
అలరఁగ నిచ్చకము లాడవలెఁగాని ॥పల్లవి॥

అటమటములవాని నొఁగాదనఁగరాదు
నటలాడేవాని సాదించరాదు
విటతనములవాని వేమారుఁ గొసరరాదు
చిటుకురంటే సేవసేయవలెఁగాని ॥బలి॥

తూఁటరివిద్యలవాని దూరితేఁ బనికిరాదు
జూటుఁదనములవాని సొలయరాదు
మాటకుమాటాడేవాని మారుకొనఁగరాదు
మూఁటకట్టువినయాన మొక్కవలెఁగాని ॥బలి॥

[1]వంతగారివానివి వచ్చిగా నాడఁగరాదు
అంతరంగమైనవాని వణఁచరాదా
ఇంతలో శ్రీవేంకటేశ యేలితివి నన్ను మెచ్చి
వింతసేయరాదు నిన్ను వేఁడుకోవలెఁగాని ॥బలి॥ 182

1. 'వంతగాఁడు' శబ్దముతో 'వంతగార' వాని రూపనిష్పత్తికము 'వంతగారి వాఁడు' అని.

దేవగాంధారి

కొలఁదులుమీరినగోవిందా
వలుదెఱుగుల మతి పరగీఁజుమ్మీ ॥ పల్లవి ॥

యేలితి వప్పుడే యిల్లాండ్లఁగా
గోలతనముగలగొల్లెతల
ఆలఁ గాచితివి అఁటోతువలెనే
పాలించ మనసు పారీఁజుమ్మీ ॥ కొల ॥

పెట్టితి వేసలు పెండ్లికూఁతులఁగా
వొట్టి యచ్చరల కొకమాటే
చుట్టితి పెంచమునోగ నెమలివలె
పెట్టనెమళ్ళను బెరిసేవుసుమ్మీ ॥ కొల ॥

కలసితివి శ్రీవేంకటేశ మమ్మిటు
లలిఁ బట్టపుసతుల మనుచును
యెలమి యమునలో నీఁదులాడితివి
పొలసి యీఁదుమీఁలఁ బొందేవుసుమ్మీ ॥ కొల ॥ 183

మాళవిశ్రీ

ఎందాఁకా మనసు చూచే వింతివి నీవు
పొందులనే కావరాదా భోగములు ॥ పల్లవి ॥

మొగము దప్పకచూచి మోహము నీతోఁ జెప్పి
వగినందే కావరాదా నాతియాసలు
చిగురుమోవి ఇచ్చి చేతులుదాఁచీ నీకు
తగులఁగా గానరాదా తమకములు ॥ ఎందాఁ ॥

విలువుఁగొలువు సేసి నేరుపులు వచరించి
పిలువఁగఁ గానరాదా ప్రేమములు
మొలకచన్నులు చూపి ముద్దులమాట లాడీ
తలఁచితేఁ గానరాదా విలుకడలు ॥ ఎందాఁ ॥

కదిసి కూచుండి యట్టె కాఁగిటను బిగియించీ
వుదుట్లఁ గానరాదా వొడఁబాటు
అదన శ్రీవేంకటేశ అంగన నేలితి విట్టె
యెదుటనే కానరాదా ఇచ్చకములు ॥ ఎందాఁ ॥ 184

సౌరాష్ట్రం

బదుకవయ్యా ఇంత వగిడికాఁడవై తివి
పదరి వొకరొకరు పైకొనఁగాను ॥ పల్లవి ॥

మనసొక్కటాయనా మాట నీకుఁ జెల్లెనా
చెవకి యాకెపై నీకె చేఇచాఁచఁగా
కమవట్టెనా నీకు కడునవ్వు వచ్చెనా
వెనుకొవి ఆకె నీకె వెసఁ దిట్టఁగాను ॥ బదు ॥

చలము నీకుఁ జెల్లెనా సమ్మతి నీకాయనా
బలిమి నాకె నీకె పరచఁగాను
తలఁపు లీడేరెనా తగవు గెలిచెనా
పలిగెతో నాకె నీకె జంకించఁగాను ॥ బదు ॥

పంతాలు సమకూడెనా పనులు నీకు దక్కెనా
ఇంతలో నాకె నీకె వి న్నెనయఁగాను
సంతోసమాయనా చక్కవి శ్రీవేంకటేశ
పొంత వి న్నాకె నీకెఁ బొగడఁగాను ॥ బదు ॥ 185

వరాళి

ఏల వంకలు దిద్దేరే యీతవిలా గొఱగరు
యేలాటము లాడేవి యెఱఁగరాదా ॥పల్లవి॥

నగుతానే రమణుఁడు నాలినే పొద్దు గడపీ
యెగసక్కెములు సేసే దెఱఁగరాదా
మొగము చూడఁగానే మొనగోర నూఁదీ యాన-
లిగిరించఁజేసేది యెఱఁగరాదా ॥ఏల॥

సుదతుల పీడువెట్టి సూడుఁబాడుఁ బట్టించిన
యెదలోవిమర్మము లెఱఁగరాదా
అదనులు చెప్పించి అట్టె తనరాకకు
యెదురులుదూపించే దెఱఁగరాదా ॥ఏల॥

చొక్కుచుఁ గాఁగిట నించి సురతము చవిచూపీ
యెక్కువల కెలయించే దెఱఁగరాదా
చక్కని శ్రీవేంకటేశ్వరుఁ డిదె నము నేలె
యిక్కడనే వుండినది యెఱఁగరాదా ॥ఏల॥ 186

రేకు 1332 దేసాళం

ఇంత చాలదా విష్టార మింకా వేరే వలెనా
మంతన మిదే చాలదా మర్మములు రేఁచను ॥పల్లవి॥

నవ్వితేనే చాలదా నాతులమనసులలో
అవ్వలఁ బంచబాణములై నాఁటును
దవ్వుల మాఁటలాడితే తగ వదే చాలదా
పువ్వులతేనియలై తీపులు రేఁచును ॥ఇంత॥

చూచితేనే చాలదా సుదతులమేము
కాచినట్టే పులకలగని చూపుమట్లు
చేచేత నీ వంటితేనే నేవలుగాఁ జాలదా
కాచినట్టె వలపులతమి రేఁచును ॥ఇంత॥

నన్ను యిదె చాలదా చక్కని శ్రీవేంకటేశ
యిన్నిటా నిన్ను నన్ను నెనయించెను
మన్నించి నీవు నన్ను మరుఁగుచే చాలదా
విన్నకన్నజాడలను వేడుకలు రేఁచును ॥ఇంత॥ 187

కన్నడగౌళ

తలఁచినపనులెల్లా తానే అయ్యీఁగాని
చలములు మాని మోవి చవిచూపరాదా ॥పల్లవి॥

వెంగలియలుకలేల విరహతాపము లేల
అంగనతో మంచిమాఁట లాడరాదా
ఇంగితమెఱిఁగి యాకె యెదురుగా వచ్చీని
ముంగిటికి విచ్చేసి మోము చూపరాదా ॥తల॥

అనుమానవనేల అరడిఁబడఁగనేల
ఇనుమంత పంతము నియ్యరాదా
మనవాన నీతో నాకె పొలయుచు వచ్చీని
పెన నీవే ముందుగాను విడెమియ్యరాదా ॥తల॥

శిరసు వంచుకోనేల చెలుల నవ్వఁగనేల
పరువఁగూచుండి చేయి చాఁచరాదా
గరిమ శ్రీవేంకటేశ కలసితి నాకె మెచ్చి
సరుగఁ జెక్కు లంటుచు సరసమాడరాదా ॥తల॥ 188

రామక్రియ

నీకు నీవే గడించుకొనేవు గాక యేమైనా
దాకొని నిన్నుందరిలో తగదంటినా ॥పల్లవి॥

అవల వేరే మరి అనవెట్టవలెనా
నీవాదేమాటలు నిజమేకావా
వేవేలుగా నిందు వెంగెమేమైనా వున్నఁ
నావద్ద నీవుండఁగాను నమ్మనంటినా ॥నీకు॥

చెలులచే యింకా బుద్ది చెప్పించవలెనా
వెలయ నీవాడినవే వేదాలుగావా
వెలుపలి సుద్దులెల్లా వెలఁచుకొంటాయిది-
పిలిచి మరేమైనా బేరుకొంటినా ॥నీకు॥

చూడుమని నీమేను సోదవియ్యవలెనా
వాడతో నీసేఁతలు సత్యాలుగావా
వేడుకఁ గూడితివి శ్రీవేంకటేశ నన్ను నిట్టె
యీడ నేర్పితివి రతు లివి యంటినా ॥నీకు॥ 189

పళవంజరం

వేరేపొందు వలెనా వింతవారితో
అరితేరితే మనసు అలవాటువడును ॥పల్లవి॥

మక్కళించి మక్కళించి మాటలాట్టె ఆడితేను
చిక్కి నీవలపులకు చేపలెక్కును
యెక్కడెక్కడనైనాను యెదురుకట్లమంటే
జవ్వన మువ్విళ్ళై యులవాడును ॥వేరే॥

తగిలితగిలి మోహము తప్పకచూచితేను
అగపడ్డరతులకు ఆస పుట్టును
వగివగి పలుమాఱు వనములు సేసితేను
ఱగి మర్మాలు గరఁగి చిమ్మిరేఁగును ॥ వేరే ॥

చెలరేఁగిచెలరేఁగి చెనకదొరకొంటేను
ములువాఁడికొనగోళ్లముద్ర లంటును
యెలమి శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
పలుకుఁబంతము లిఁకఁ బచ్చిదేరును ॥ వేరే ॥ 190

మంగళకౌసిక

అంగన నాపతితోడ నంటివా నీవు
అంగడికెక్కె వలపు లంటివా నీవు ॥ పల్లవి ॥

చేతుల మొక్కితినని సిగ్గుతో నుందాననని
ఆతనితో నీమాఁట అంటివా నీవు
నాతలఁపెఱుఁగుమని నమ్మితి నన్నిటానని
ఆతుమలో నిలువఁగ నంటివా నీవు ॥ అంగ ॥

నావితిఁ డెమటవని నవ్వులకు లోనవని
ఆవల మరవనని అంటివా నీవు
నీమఱ నాలించుమని విన్నపము లివేయని
వినదయ్యీఁ దానే గతి యంటివా నీవు ॥ అంగ ॥

కప్పురపుఁబడియ నీకాఁగిలి నాసొమ్మని
అప్పణ నాకిమ్మని అంటివా నీవు
యిప్పుడే శ్రీవేంకటేశ యేలితివి నన్నునని
అప్పుడే మెచ్చితినని యంటివా నీవు ॥ అంగ ॥ 191

శుద్ధవసంతం

ఆడుకొనే వెంతకైనా అందరితోను
వేడుక నీవు విచ్చనవిడి నుండవయ్యా ॥పల్లవి॥

మంతనాన నీవు నాతో మాటలాడవా యిప్పుడు
అంతలోనే లేదనేవు ఆకెఁ జూచి
వంతులేక నీవొకరివాఁడవా యేమైనాను
ఇంతటిమగవాఁడవు యేల నీకు వెరపు ॥ఆడు॥

అండమండి నాచే విడె మందుకొనవా నీవు
అందుకాచే వప్పటివి ఆకెఁ జూచి
బెండుపడి నీ వొకరిపెట్టుఁజెట్టవా యేమైనా
నిండుదొర వప్పటివి నీకేల వెఱపు ॥ఆడు॥

కలసి మెలసి నన్ను కాఁగిలించవా నీవు
అలికే వింతటిలోనే యాకెఁ జూచి
చెలఁగి శ్రీవేంకటేశ అలమేల్మంగపతివి
నెలకొంటి వింతటాను నీకేల వెఱపు ॥ఆడు॥ 192

రేకు 1333 హిజ్జిజి

[1]చెలిచెలువ మేమనిచెప్పేమయ్యా
అలమేలుమంగ నీకె యమరు నన్నిటాను ॥పల్లవి॥

కొమ్మమోముఁదమ్మిమీఁదికుంతలపుఁదుమ్మిదలు
నమ్మతిఁ జంద్రాస్యనేత్రచకోరములు
నెమ్మి నధరపుఁదేనె విందునవ్వువెన్నెలలు
వుమ్మడి నుండఁగ నంటనోడి భ్రమసెను ॥చెలి॥

1. ఈపాటలో సమాసపద్ధతి, శబ్దమీకరణమూ సరిగా లేవు.

మెఱతవారిపరపిమీఁదిచనుజక్కవలు
మలసి కుహరనాభి మధ్యసింహము
అలరు వళితరంగాలు అందపుటారనుపాము
చెలఁగివుండఁగాఁ బ్రవేశించక భ్రమసెను ॥చెలి॥

తరుణిఘనకటిపులినతలపు గతిహంసలు
కరిశిరోనితంబోరుకాండకరులు
వరుసఁ జెమటేరు యౌవనవనము నుండఁగా
గురు శ్రీవేంకటేశుఁడు కూడఁగా భ్రమసెను ॥చెలి॥ 193

బౌళి

ఏమినేరుపులు చూపే వెందాఁకాను
[1]కామించి నీపట్టు కతిక్రదవలేఁగాక ॥పల్లవి॥

ఆకెతో మాటాడఁగా నేమందునోయంటా నీవు
వాకున మాటాడేవు వంతుకు నాతో
పైకొని నాపై నంతబత్తి గద్దా నీకేమైనా
నీకు మోహించినదాన నేఁ బాయలేఁగాక ॥ఏమి॥

నెట్టన నాపెతో నవ్వి నేఁ గోపగించేనంటా
నట్టనడుమ నూరకే నవ్వేవు నాతో
బట్టబయలు నే నీకు బాఁతే ఇందరిలోనా
అట్టిట్టని నీతోను అలుగలేఁగాక ॥ఏమి॥

అలమేలుమంగఁ గూడి అట్టె నన్ను బుజ్జగించఁ
గలసితి విటు భూకాంత నేనంటా
యెలమి శ్రీవేంకటేశ ఇంతకరుణా నాపై
మలసి యెంతైనా నిన్ను మరవలేఁ గాక ॥ఏమి॥ 194

---

1. నీపట్టుకు+అతిక్రదవలేనుగాక=నీభావమునకు మించి దాటిపోలేను అనియా?

సామంతం

ఎఱఁగము నీచిత్త మిఁక నెట్లున్నదో
మఱియు నీయానతికి మారుకొనమయ్యా ॥పల్లవి॥

చలములు సారెకు సాదించువారికి
మలసి యేమనినా సమ్మతి గాదు
వలపులు పైపై వడిసేటివారికి
పిలిచినఁ గొండంతప్రియము గలుగును ॥ఎఱఁ॥

పంతములే కడుఁబచరించేవారికి
శాంత మించుకయు సమకొనదు
సంతపుఁబొందులు జరపెడివారికి
వింతగాఁ జూచినా వేడుక గలుగు ॥ఎఱఁ॥

ధరలో యొగ్గులుతప్పులవారికి
సరసపుఁజెనకులు చవిగావు
యిరవుగ శ్రీవేంకటేశ కూడితివి
అరయ మనల కింకా ఆసలే కలుగు ॥ఎఱఁ॥ 195

శంకరాభరణం

మదనుబండారము మగువమేను
పొదిగొన్నవలపులఁ బొసఁగెఁగాన ॥పల్లవి॥

మరునియాయుధశాల మగువకొప్పు
తొరలించి విరులెల్లాఁ దురిమెఁగాన
యిరవై కిరవు(ము?)లాయ మీపెగళము
సరసపుమాఁటలెల్లా జరపెఁగాన ॥మద॥

కాముని సాముగరిడి కాంతపురము
ఆమని చనుసంగడా లమరెఁగాన
ప్రేమపుఁగేళాకూళి గంభీరనాభి
తేమచెమటలచేత దిగుపారెఁగాన ॥ మద ॥

కాంతుని వేఁటవొలము కన్నెపిఱుఁదు
బంతి మొలనూళ్ల వోఁగు వారెఁగాన
అంతటివానితల్లి యీయలమేల్మంగ
యింతలో శ్రీవేంకటేశు నెనసెఁగాన ॥ మద ॥ 196

తెలుఁగుఁగాంబోది

వట్టియలుకల నీకు వచ్చినదేమి
యిట్టె చెలిని మన్నించి యింటికి రావయ్యా ॥ పల్లవి ॥

ఆపెతో మాఁటాడితేను ఆయములెల్లాఁ గరఁగు
చేపట్టి పెనఁగితేను చెమరించును
వోపి నవ్వు నవ్వితేను వొడలెల్లాఁ బులకించు
తీపులుండఁగాఁ జేఁదు తిననేఁటికయ్యా ॥ వట్టి ॥

సరసఁ గూచుండితేను సంతోసములు మించు
ఇరవై చూచితే కోర్కు లీడేరును
తిరమై గురులు వించితే కొంకుగొనరు మాను
వెరవుతో నీదలివె యెందలేలయ్యా ॥ వట్టి ॥

మోవితేనె లానితేను మోహములు చెలరేఁగు
భావించి నేసవెట్టితే ఫలము గద్దు
శ్రీవేంకటేశ కూడితి వీవేళ నలమేల్మంగ
యీవల నీకె వుండఁగా నితరమేలయ్యా ॥ వట్టి ॥ 197

ఆహిరి

ఇంటికి విచ్చేసితివి [1]యెంతవవికి
[2]అంటిసుదివంటిదాన నందుకోపేన ॥ పల్లవి ॥

యెంగిలిమోవిదాన యేడలేవిసిగ్గుదాన
పొంగేటి చెమటలతోఁ బొరలేదాన
వంగనిచన్నులదాన వాడికెవలపుదాన
పంగెనకోపముదాన బాఁతెయ్యేనా ॥ ఇంటి ॥

సన్నపునడిమిదాన సళుపుఁజూపులదాన
వెన్నెలనవ్వులతోడివీరిడిదాన
నున్నని చెక్కులదాన [3]నూఁగురులకొప్పుదాన
పిన్నదాన నే నీకుఁ బ్రియమయ్యేనా ॥ ఇంటి ॥

చిగురుఁబాదాలదాన చిమ్ముఁజూపులదాన
వెగటుఁబిఱుఁదుగలవేఁకపుదాన
నిగిడి శ్రీవేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
జిగిబిగువులదానఁ జిత్తమువచ్చేనా ॥ ఇంటి ॥ 198

రేకు 1334 దేశి

ఎంత కాతరీఁ డితఁ డేమిసేతునే
పంతముతోడ నాకు పైకొవఁగవచ్చునా ॥ పల్లవి ॥

సిగ్గులు మూఁటగట్టి చెక్కుచేయి తీసిపెట్టి
యెగ్గులేక నవ్వుమనీ నేమిసేతునే
వొగ్గి తా నేమిసేసినా నూరకే యమరుఁగాక
తగ్గుమొగ్గులేవినాకు తమకించవచ్చునా ॥ ఎంత ॥

1. ఎంత+వవికి. 2. అరఁటికి అంటి అని వ్యావహారికము. 3. నూఁగు+కురులు

గుట్టు ఱాయిటను వేసి కోరికలు మొగవోసి
ఇట్టె పాదా లొత్తుమనీ నేమిసేతునే
కట్టుగాఁ దా నెట్టుండినా నెట్టన నమరుఁగాక
చుట్టమనయిననాకు జోలిఁబెట్టవచ్చునా ॥ ఎంత ॥

కొంతుగొవరెల్లా మాని కుచము లెదురువూవి
ఇంకాఁ గాఁగిలించుమనీ నేమివేతునే
అంతె శ్రీవేంకటేశుఁ డవి దన కమరుఁగాక
వంకలేవిదాన నాకు సటలాడవచ్చునా ॥ ఎంత ॥ 199

పాడి

ఎట్టిజాణలో మీరు ఇటువలె నుండవద్దా
చుట్టపువరుస మిమ్ముఁజూచి నేరవలెను ॥ పల్లవి ॥

మక్కువగలవీవైతే మాటలాడి తనియవు
దక్కి యాపైతే నూఁకొని తనియదు
ఇక్కడ నందరుఁ జూచే రెగ్గుసిగ్గు లెఱుఁగరు
చొక్కపువలపు మిమ్ముఁజూచి నేరవలెను ॥ ఎట్టి ॥

ఆసల నీ వాపెచన్ను లంటియంటి యలయవు
వేసి యాపె వూడిగేలచే నలయదు
కాసువలెఁ బెనఁగుచు తలమొల యెఱుఁగరు
మాసకపుఁబెండ్లి మిమ్ముఁజూచి నేరవలెను ॥ ఎట్టి ॥

గక్కన శ్రీవేంకటేశ కాఁగిలించి పాయవు
మొక్కవ వాపె నీవురమెక్కి పాయదు
పక్కన నానారతుల వగలరే యెఱుఁగరు
చొక్కటియాసలు మిమ్ముఁ జూచి నేరవలెను ॥ ఎట్టి ॥ 200

బౌళి

మన్నించవయ్యా యీమగువ నిట్టె
విన్నపము విని నీవే విడెమియ్యవయ్యా ॥ పల్లవి ॥

మచ్చికసేసి యాపె మాట నీతో నాడఁగాను
యెచ్చోటు చూచేవు పరాకేఁటయ్యా
పచ్చిచెమటలతోడ పాదాలు నీకు గుద్దఁగ
వచ్చునా నాకు విద్దుర వట్టేసట తేలయ్యా ॥ మన్నిం ॥

సంటుసేసి యప్పటిని నవ్వులెల్ల నవ్వఁగాను
గొంటవై వున్నాఁడవు యీగుణమేలయ్యా
చంటిమొన సోఁకఁగ వేఁ(విం?)జామర నీకు వేయఁగ
వొంటి నీసిగ్గు దగునా వొగి మాయలేలయ్యా ॥ మన్నిం ॥

కందువకుఁ దీసి యాపె కాఁగిటికి రమ్మనఁగ
యెందరితో సన్నసేసే వెమ్మెలకయ్యా
చెంది శ్రీవేంకటేశుఁడ సేస లాపె చల్లఁగాను
మందలించి మారుకుమారు చల్లే వౌనయ్యా ॥ మన్నిం ॥ 201

కాంబోది

ఆఁటదానిబలిమి నీయంతకంటె నెక్కుడా
మేఁటివి నీయెమ్మెలెల్లా మెరసెఁగా ఇపుడు ॥ పల్లవి ॥

పయ్యదకొం గంటఁగాను పడఁతి దప్పించుకొంటే
అయ్యెడనే పంతాలెల్ల నాడేవు
వుయ్యాలమంచ మెక్కితే వొద్దఁ బందుండితి విట్టె
చెయ్యారా నీపంతములు చెల్లెఁగా ఇపుడు ॥ ఆఁట ॥

కొప్పువట్టి తియ్యఁగాను కొమ్మ నీచేఁత వట్టుకొంటే
  రెప్పలెత్తి జంకించి రేసులాడేవు
అప్పుడే సిగ్గువడితే నాయము లంటితి విట్టె
  చిప్పిల నీకోరికలు సిద్ధించెఁగా ఇపుడు ॥ అఁట ॥

రతికేలిఁ గూడఁగాను రామమేను చొక్కితేను
  ఇతవుగా కొనగోర నెచ్చరించేవు
సతమై శ్రీవేంకటేశ జట్టిగొంటే మెచ్చే విట్టె
  తతి మీఇద్దరిమేళ్లు దక్కెఁగా ఇపుడు ॥ అఁట ॥ 202

మేఁచబౌళి

సరసుఁడ విన్నిటాను జాణవు నీవు
  వొరసె నిందాఁకా సతి వోరుచుకోవయ్యా ॥ పల్లవి ॥

మనసొక్కటైనదాఁకా మాటలు సూటిఁబడవు
  యెనయకుండితే నవ్వీ యెరవెరవే
వినుఁబాసి విరహాన నెలఁత యెంత దూరెనో
  వొనరితి విఁక నవి వోరుచుకోవయ్యా ॥ సర ॥

సిగ్గులుదేరినదాఁకా చేఁతలు సమ్మతి గావు
  దగ్గరఁ గూచున్నదాఁకా తనివిలేదు
తగ్గి నీవు రా నట్టె కాతరాన నెట్టుండెనో
  వొగ్గి మన్నించితి విఁక నోరుచుకోవయ్యా ॥ సర ॥

కలసికూడినదాఁకా కడమలు దీరవు
  చలములు మానితేనే చవిపుట్టును
తెలిమి శ్రీవేంకటేశ యిప్పు దీ కెంత మెచ్చెనో
  వొలసి యేలితి విఁక నోరుచుకోవయ్యా ॥ సర ॥ 203

శంకరాభరణం

కొప్పు వంగ నీ వెంతైనా గోవిందరాజా । పైఁడి-
కుప్పేకతారము వట్టి గోవిందరాజా ॥ పల్లవి ॥

నిద్దిరించేనంటాను నెలఁతలచేఁ బాదాలు
గుద్దించుకొనే విప్పుడు గోవిందరాజా
సుద్దులు చెప్పేనంటా చొక్కించితివి మేనులు
గొద్దిమీరె వలపులు గోవిందరాజా ॥ కొప్పు ॥

అలసితినంటాను ఆఁడువారిచే నేప్రొద్దు
కొలిపించుకొనే విట్టె గోవిందరాజా
వలచితినంటాను వారితోడిమంతనాలు
కొలఁదిమీరె నెప్పుడు గోవిందరాజా ॥ కొప్పు ॥

పచ్చడము గప్పేనంటా పడఁతులతొడలపై
కాచ్చేవు నీమునివేళ్ల గోవిందరాజా
విచ్చ నాలుగుచేతులు నిండుఁగాఁగిట నిద్దరి
గుచ్చేవు శ్రీవేంకటాద్రి గోవిందరాజా ॥ కొప్పు ॥ 204

రేకు 1335 పాడి

ఏలా ఇంకాఁ గొసరను ఇన్నిటా తా జాణఁడౌను
మేలుమేలు ఇన్నిటాను మెచ్చితి నేనవరే ॥ పల్లవి ॥

కానుక నే నంపితేను కమ్మటి మారుకుమారు
తానూఁ గప్పురమంపెఁ దగవేకదే
వీనులు చల్లఁగా వింటి వీడుకువీడాయను
మోనమున నప్పటివి మొక్కితి నేనవరే ॥ ఏలా ॥

పూవుల నే వేసితేను పూఁచి తా మూరుకుమూరు
తావిజవ్వాదివి వేసెఁ దగవేకదే
పావిరేక వలపులు పరికిపరాయను
బోవులుగా తను నేఁ బొగడితినవరే ॥ ఏలా ॥

అదరి నేఁ బిలిచితే నంతలో మారుకుమారు
తదయక వూఁకొనెఁ దగవే కదే
యెదయక శ్రీవేంకటేశుఁ డేలెఁ బొందాయను
నడుమ నమరతికి నవ్వితి నేననరే ॥ ఏలా ॥ 205

శ్రీరాగం

ఏమిసేయుమనేవయ్యా యింకా నన్ను
కామించి నీమన్ననలు గైకొంటి నేను ॥ పల్లవి ॥

వొద్ద నేఁ గూచుండనా వూఁకొననా నీమాటలు
కద్దు నిజమేయనా కావిమ్మనవా
గుద్దిరము మానసంటా కొనరేవు కమ్మటివి
ముద్దుముద్దువలె నీముంగిట నుందానను ॥ ఏమి ॥

పాదాలు పిసుకనా బత్తిసేయనా నీకు
పాదువలె నుండనా పమ్మటిందనా
బోదించక మానవంటా సొలసేవు కమ్మటివి
పాదించి నీసేవకు మంచముపై నుందానను ॥ ఏమి ॥

చక్కన విడెమియ్యనా కాఁగిలించి కూడనా
మిక్కిలి నీకు లోఁగానా మెచ్చు మెచ్చనా
యెక్కువ శ్రీవేంకటేశ యేలితివి నన్ను; నాకు
దక్కితివి కమ్మటివి తగిలివుందానను ॥ ఏమి ॥ 206

## సాదరామక్రియ

మొక్కఁ జేకొను మోహపుపీనతి
చెక్కుదియ్య దియ్య(దియ్యఁదియ్య) చెదరదు వలపు ॥పల్లవి॥

చనవు పేరుకొని సతి నిన్నుఁ గొసరెను
మనమునఁబెట్టకు మాఁట లిఁక
ననుపు గలుగఁగా [illegible] న్వేను
నిను నీపట్టకు వెంగము గాదు ॥మొక్కఁ॥

చుట్టరికంబున సుదతి చెనకె నిను
పట్టకు యెగ్గులు పలుమారు
జట్టిగొనెఁగనక జంకించె నిపుడు
అట్టిట్టనకుము అరగొర లేదు ॥మొక్కఁ॥

దేవులతనమున తెలిస నిన్నొరసె
శ్రీవేంకటేశుఁడ చింతించకు
నావిగలుగఁగా నది నినుఁ గలసెను
భావించ కిచటఁ గపటమే లేదు ॥మొక్కఁ॥ 207

## కేదారగౌళ

దొరవు నీవన్నిటాను తొయ్యలి నేను
కరకరిఁ గక్కసించఁగలమా నేము ॥పల్లవి॥

యేఁటికి నవ్వితివయ్యా యెఱుఁగము నే మూపని
నాఁటకుఁడ నేమ[1]ందుకునైనా వచ్చును
మాఁటగట్టి వలపులమోపు నెత్తికి నెత్తేవు
గాఁటాన వింతేసి కోపఁగలమా నేము ॥దొర॥

1. ఏ మందుకునైనా=దేనికైనా కావచ్చు. 'అందుకు' అను పదము 'దానికి' అనుఅర్థములో వాడఁబడినది.

చేసన్న లేఁటివయ్యా సిగ్గువడితిమి నేము
ఆసోద మెంత నీమనసందు నున్నదో
పూసగుచ్చి తరితీపు పొంచి మెడఁగట్టేవు
గావించి నీతోఁ బెనఁగఁగలమా నేము ॥ దొర ॥

తప్పకచూచేవేమయ్యా దయలోవారము నేము
ఇప్పుడు శ్రీవేంకటేశ యెంతేమన్నాను
వొప్పగించినట్టు నీవాళ్ల నాకాఁగిటి కిచ్చి
కప్పేవు మే లెదురాడఁగలమా నేము ॥ దొర ॥ 208

సామంతం

ఘనుఁడవు చింతకుంటకంభమురాయ । మమ్ముఁ
గనుఁగొని రక్షించు కంభమురాయ ॥ పల్లవి ॥

కంతునిగురుఁడ వోకంభమురాయ । శ్రీ-
కాంతఁ దొడపైనిడినకంభమురాయా
కాంతులు నీమేనెల్లఁ గంభమురాయ । యే-
కాంతమాడే వింతులతోఁ గంభమురాయ ॥ ఘనుఁ ॥

కప్పురపువిడేలకంభమురాయ
కప్పము గొనే వింతటఁ గంభమురాయ
కప్పులుదేరీ నీమోవిఁ గంభమురాయ
కప్పుకొమ్మీ పచ్చడము కంభమురాయ ॥ ఘనుఁ ॥

కమ్మఁ జెమటలు వింటెఁ గంభమురాయ
కమ్మటిఁ గూడితి విట్టె కంభమురాయ
కమ్మకొనెఁ బులకలు కంభమురాయ
కమ్మన(వి?)శ్రీవేంకటాద్రికంభమురాయ ॥ ఘనుఁ ॥ 209

తోండి

ఏల నీకు వెరపూ ఇన్నిటా గెలిచితివి
నాలి మావి నీతో నేను నవ్వుచుండఁగాను ॥ పల్లవి ॥

మంతనాన నీవాపెతో మాటలాడినసుద్దులు
ఇంతయు నాతోఁ జెప్పి రిందరు నేఁడు
యెంతకెంత సేసి నాతో యేలానలువెట్టేవు
రంతునేసి నిన్ను నేను రవ్వపెట్టేనా ॥ ఏల ॥

సిగ్గువడ కిందరునుఁ జేసిననేఁతలెల్ల
నిగ్గుల నోరణగండ్ల నేఁ జూచితి
అగ్గమై సాకిరులేల ఆట్టె నాకుఁ దెలిపేవు
తగ్గించి విన్నిఁక నేను తలవంపించేనా ॥ ఏల ॥

కలసిన మీలోనికాఁపిరాలు విన్నరేయి
కలలోనే కంటి శ్రీవేంకటగిరీశా
చెలఁగి నన్నిట్టె కూడి చెక్కులేల నొక్కేవు
పలుమారు యిఁక నిన్నుఁ బంగించేనా ॥ ఏల ॥ 210

రేకు 1336 సామంతం

నీ వెఱఁగవా వోయి నేనేమిచెప్పే నీకు
వేవేలైనాఁ బొందుసేసి విడువరాదు ॥ పల్లవి ॥

పంతములాడఁగవచ్చు పట్టిపెనఁగఁగవచ్చు
బంతినే సతులఁగూడి పాయఁగరాదు
రంతులుసేయఁగవచ్చు రాజసాన నుండవచ్చు
మెంతైనా వలపులేరు యీఁదఁగరాదు ॥ నీవె ॥

యెమ్మెలు నెరపవచ్చు యేమైనాఁ జేయఁగవచ్చు
దొమ్ముల నానవెట్టితే తోయఁగరాదు
వుమ్మడి మందఁగవచ్చు వొరట్లు చూపవచ్చు
కమ్మి కాఁగిలించుకొంటే కాదనఁగరాదు ॥ ఏవె ॥

నాయము చెప్పఁగవచ్చు నవ్వులు నవ్వఁగవచ్చు
చాయపుమదము చేతఁ బట్టఁగరాదు
యీయెడ శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁ గూడితివి
చాయలు చూపఁగవచ్చు జంట వాయరాదు ॥ ఏవె ॥ 211

బౌళి

పిన్నలు నాచన్నలు పినుకకు పలుమారు
వున్నతిఁ బెరిగితేను వోరిచేఁగాదీ ॥ పల్లవి ॥

నేరుపుగలవారలు నీతో మాటలాడిరి
నేరవిదాన నేను వూరకుందాన
గోరనేల వూఁదేవు కుమ్మెలయ్యీ మేవిట్టె
నేరుపరాదా నీవల్ల నేరిచేఁగాదీ ॥ పిన్న ॥

రట్టడిపతులెల్లాను జట్టులు నేసిరి విన్ను
గుట్టుతోడిదానఁగాన కొసరనోప
పట్టకు కుచ్చెల చేత పానీ పోఁకముడి
గట్టువాయఁ జేయరాదా ఘనమయ్యేఁగాదీ ॥ పిన్న ॥

వెగ్గళించినచుట్టాలు వెట్టిపములు గొవిరి
సిగ్గువడ్డదానఁగాన సేవ నేసితి
విగ్గుల శ్రీవేంకటాద్రినిలయ వన్నేలితివి
తగ్గక మోవియ్యరాదా దప్పిదేరేఁగాదీ ॥ పిన్న ॥ 212

దేసాళం

ఆసోదకుఁడవు నినే(విన్నే?) మనేమయ్యా
అసుద్దు లింకానా అవునయ్యా ॥ పల్లవి ॥

కప్పురము చేతికిచ్చి కలయఁగ విడెమిచ్చి
చెప్పరానిమాటలెల్లాఁ జెప్పిచెప్పి
అప్పసము నీవద్ద నాపె గాచుకుండఁగాను
అప్పటి మమ్మఁ జెనకే వవునయ్యా ॥ ఆసో ॥

గందము నీపైఁ బూసి కమ్మి సురటి విసరి
గొందిఁ బానుపు వరచి గుబ్బల నొత్తి
యెందునుఁ బాయక ఆకె యేఁకారుచుండఁగాను
అంది మాపైఁ జేయిచాఁచే వవునయ్యా ॥ ఆసో ॥

సిగ్గులెల్ల విడిపించి చేరి మోవి గంటిసేసి
వెగ్గళపునవ్వు నవ్వి వేసాలుసేసి
వొగ్గి శ్రీవేంకటేశ్వర వొడిగట్టాపె వుండఁగ
అగ్గమై నన్నుఁ గూడితి వవునయ్యా ॥ ఆసో ॥ 213

దేశాక్షి

ఎంత మానాపతివి నిన్నేమి చెప్పేది
మంతనములాడేవు మందెమునారసింహా[1] ॥ పల్లవి ॥

చేరి విడెమిమ్మంటే సిగ్గులువడేవు నీవు
వోరి నీసతెవ్వతైనా వున్నదా యీడ
గోర నిన్ను గీరఁగాను గొబ్బున వేఁడుకొనేవు
ఆరీతు లెవ్వతైనా నిన్నాడుకొనీనా ॥ ఎంత ॥

1. 'సింహా' అని రేకులో గలదు.

మోముచూచి నవ్వితేను మొక్కుచును లోఁగేవు
నీమగువ లీడ వచ్చి నిన్నుఁ జూచేరా
కామించి మోవికెంపులు కలిగించితే మూసేవు-
చూ: మరల నెవ్వతైనా సొలసి తిట్టెనా ॥ ఎంత ॥

సారెకు మాటలాడితే సన్నలు సేసేవు నీవు
దూరి నీమోహపుచెలి దొమ్మి సేసీనా
యీరీతి శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
కేరడాన నెవ్వతైనా కేలుచాఁచీనా ॥ ఎంత ॥ 214

సాళంగనాట

నవ్వేవారి నెఱఁగవు నాలుగువంకల నిన్ను
జవ్వనమదముననే సాము సేసేవు ॥ పల్లవి ॥

యెంతైనా గద్దు నీయాస యేమి చెప్పే దిందరిలో
కాంతవలపులకు గాదె నీమేను
చెంతల నాకుచములు చేతులనే పట్టుకొని
మంతుకెక్క నాపెతోను మాఁటలాడేవు ॥ నవ్వే ॥

తలఁచరాదు నీరతి తమకివి యిన్నిటాను
జలజాక్షిలెంగిలికంచము నీమోవి
అలరి యధరామృత మందుకొంటా నాపెహొత్తు
కలపి సన్నలు సేసి కాఁకరేఁచేవు ॥ నవ్వే

పట్టరాదు నీవయసు పడఁతులకెల్ల రచ్చ-
కొట్టమాయ నిదివో నీగొప్పపురము
నెట్టన శ్రీవేంకటేశ నీవు నన్నుఁ గూడి యట్టె
కట్టుకొంటి వాపెపదకము నీమెడను ॥ నవ్వే ॥

గుండక్రియ

ఇది యేఁటిదయ్యా యెంతసేసితివి నీవు
చెదరవిదయతో విచ్చేయవయ్య యింటికి ॥పల్లవి॥

చెలులతో యేమని చెప్పించితివి
యెలమి నానవాలు యేమిచ్చితివి
ఉలికి యేమని యాసకొలిపితివి
చెలివి మన్నింతువు విచ్చేయవయ్య యింటికి ॥ఇది॥

చెప్పరావిసన్న లేమి సేసితివి
తప్పకేల కొనగోరఁ దాఁకించితివి
చొప్పుగా నేమని నీమోవి చూపితివి
చిప్పిలఁ గూడుదువు విచ్చేయవయ్య యింటికి ॥ఇది॥

నావద్దనుండాపె నెట్టు నవ్వించితివి
యేవిధానఁ దొల్లేమని యేలుకొంటివి
శ్రీవేంకటేశ మాయింటిఁ జేరి కూడితి
నేవగొందువు మాచే విచ్చేయవయ్య యింటికి ॥ఇది॥ 216

రేకు 1337 పాడి

ఏవంక నేరిచితివో యింతేసి నీవు
దేవులచెరువుయేలేతిరువేంకటేశా ॥పల్లవి॥

సారెసారెకు నెత్తేవు సంగడాలా నాచన్నులు
బోరనఁ బట్టేవు చేయి బొందేకోలా
సారె [1] జారె ననెంటేవు చక్రాలా నాపిఱుఁదులు
నేరుతువోయి సాములు నెలఁతలతోడనె ॥ఏవం॥

---

1. జారెను+అని+అంటేవు.

కామించి పెనఁగే విట్టె కంబమా నాకంబుకంఠము
గోమునఁ గాఁగిలించేవు గోఁతమా మేను
ఆముకొని వొద్దుకొనే వమ్ములా నాచూపులు
సాము నీకుఁ జెల్లినయ్యె సకియలతోడనె ॥ఏవం॥

కమ్మటి బుసకొట్టేవు గరిడా నాజవ్వనము
దొమ్మిఁ బట్టితీసేవు ద్రోణమా జడ
ఇమ్ముల శ్రీవేంకటాద్రి ఏట్టె నన్నుఁ గూడితివి
తమ్మి సామమరెనోయి కాంతలతోడనె ॥ఏవం॥ 217

ఆహిరి

ఇన్నాళ్లవాఁడవె కావా ఇంత వున్నదా నీకు
మన్ననతో నెట్లా మర్మము లంటెనో ॥పల్లవి॥

జలజంఁ జెమరించె సరసుఁడ నీమేను
కలికి యేమని యేకతమాడెనో
కిళలు నీమోమున గక్కున పండె నిట్టె
అలరి మరి యేమని ఆసఇచ్చెనో ॥ఇన్నా॥

ముసిముసినవ్వు రేఁగె మించి నీపెలవులను
కొసరి ప్రియ మెంత నీకుఁ జెప్పెనో
సుసరాన మోమునకు సొంపువచ్చె నింతలోనె
వసమై నీ కెట్లు మోమువంచి మొక్కెనో ॥ఇన్నా॥

పెదపెదఁ బులకలు పెలసె నీ చెక్కులను
అదియాలపుగోర నెట్టదిమెనో
కదఁగి శ్రీవేంకటేశ కాంతఁ గూడి మమ్మేలితి
తదఁబడీ సంతోసము తగ నా కేమనెనో ॥ఇన్నా॥ 218

## శ్రీరాగం

ఇందాఁకా మనమెల్లా నెఱఁగము యీకీలు
ముందు సరసమాడక ముచ్చట వాయదు ॥పల్లవి॥

చిక్కి విరహానమున్న నెలఁతకు పతి వచ్చి
చెక్కులు నొక్కినఁగాని సేద దేరదు
వెక్కసపుఁగాఁకల [1] విసిగినయందుకు
చొక్కపునవ్వునఁగాని సొంపురేఁగదు ॥ఇందాఁ॥

అగడుఁదమకమున నలసినయాపెకు
తగుమోవిచ్చినఁగాని దప్పిదేరదు
చిగురుఁగోరికలచే చిక్కువడినందుకు
మొగము చూపక ప్రియములు వెలవెట్టదు ॥ఇందాఁ॥

రాఁగినజవ్వనికి యీరతి శ్రీవేంకటేశుఁడు
కాఁగిట వించినఁగాని తళదేరదు
పాఁగినచెమటచేత పచ్చియైనయందుకు
చేఁగదేరఁ గొసరక చిత్తము గరఁగదు ॥ఇందాఁ॥ 219

## మాళవి

తగుఁదగునయ్యా మీఇద్దరికి నేఁడు
చిగురువలపులెల్లా సేసలై పిలిచెను ॥పల్లవి॥

కూరిమి విన్నఁ గొసరికొసం తప్పకచూచీ
చేరఁదేసికన్నులచెలియ
మాఱుకుమారు నీవు మరి తప్పకచూచితే
బోరనఁ గలువలతో పూజలై పిలిచెను ॥తగుఁ॥

---

1. చూ. 208 పాటలో పాదదీపిక(Foot Note).

వొట్టుక విమ్మ వొరపి వొరయుచుఁ జెనకీవి
పట్టెఁదేసిగుబ్బలపదఁతి
అట్టడితనాన నీ వాఅడిఁ జేతులు చాఁచితే
పొట్టఁబొరుగునఁ దమ్మిపూజలై విలిచెమ ॥ తగుఁ ॥

ముందుముందె మోవితేనె ముంచిముంచి అందియిచ్చె
అందీ కొణఁదెఁడుమోవిఅతివ
కందువ శ్రీవేంకటేశ కలసి నీవు విచ్చితే
పొందుల సంపెఁగపువ్వపూజలై విలిచెను ॥ తగుఁ ॥ 220

నాగవరాళి

చెక్కిటిచేయి దియ్యదు చింతతోడను
చక్కఁబెట్టుదువు ప(స?)తి సరుగన రావయ్యా ॥ పల్లవి ॥

కొమ్మ నీతో నెఱఁగక కోపగించుకొంటినంటా
వుమ్మడిఁ బొడిఁబడుచు మసురసీవి
యిమ్ములఁ నెంతసేసిన యీపె నీకు మేలుది
సమ్మతించఁ జెప్పుదువు సరుగన రావయ్యా ॥ చెక్కి ॥

మగువ నిన్నపుడు బొమ్మల జంకించితినంటా
చిగురుఁబరితాపానఁ జింతించీవి
తగవులు దప్పినాను తరుణి పాయఁగలేదు
జగడము దీరుతువు సరగన రావయ్యా ॥ చెక్కి ॥

సతి నీపై తమకాన చన్నుల నొత్తితినంటా
మతిలో చిడుముడి పీరతి సేసీవి
యితవై శ్రీవేంకటేశ యేలితివి నీ వెందున్నా
సతమైతి విట్లానే సరగన రావయ్యా ॥ చెక్కి ॥ 221

పళవంజరం

మనసుకు మనసే మరి తారుకాణవచ్చె
వెనకినవెనకులు చేచేత నున్నవి ॥ పల్లవి ॥

వలపులు సరివచ్చె వనిత నిన్ను మెచ్చె
పొలసి యిందాఁకా నాపె పొగడెనయ్యా
కలలు నిక్కములాయ కడుమర్మములు రాయ
కొలువులో నాపెవద్దఁ గూచుండవయ్యా ॥ మన ॥

నవ్వులు నెలవి మించె ననుపులు లోలో మించె
మవ్వముతో నిన్ను నాపె మరిగెనయ్యా
జవ్వనము సరిదూఁగె జగడములెల్ల దాఁగె
చివ్వన లోనికివి విచ్చేయవయ్యా ॥ మన ॥

చూపులఁ గళలు విండె సురతము పంటవండె
వోపిక విన్నాపె నోరూరించెనయ్యా
యేపున శ్రీవేంకటేశ యిద్దరుఁ గూడితి రిట్టె
తీపుల నాపె నురము దించుకువయ్యా ॥ మన ॥ 222

రేకు 1338 భైరవి

అందుకు నిందుకు వింతలాయవయ్యా
అందాలుగాఁ జెప్పుదువు ఆడకు రావయ్యా ॥ పల్లవి ॥

అంగనకుఁ గస్తూరి అంపేనంటి వదేదయ్యా
చెంగట వింతలో మఱచితివా అయ్యా
ముంగిటిచెలులఁ జూచి ముందెఱుఁగవా అయ్యా
యెంగిలాయ పీమోవి యిదేఁటిదయ్యా ॥ అందు ॥

నగమా కందుకొంటి వానగమూఁ బొత్తించెనయ్యా
వగలేమిఁ దలఁచక వచ్చితివయ్యా
బిగివాసి ఇంతలోనే భ్రమసితివా అయ్యా
చిగురువంటి మీమేను చేరలాయనయ్యా ॥ అందు ॥

పాటించిననగినాలు పదికిఎచ్చెనో అయ్యా
గాఁటాన మగిడి ఇంతిఁ గంటివయ్యా
యీటున శ్రీవేంకటేశ ఇద్దరుఁ గూడితిరయ్యా
మీటుఁజెక్కుల చెమట విందుకొనెనయ్యా ॥ అందు ॥ 223

పాడి

మగరూపు నాఁడురూపు మక్కళించి ఇట్టె తన్నుఁ
దగిలినవారికెల్ల తమిరేఁచీ నితఁడు ॥ పల్లవి ॥

సతిపయ్యెదచెఱఁగే చక్కఁగాను గప్పుకొని
కతగా నొక్కపక్కనే కాఁగిలించుక
చతురత చెక్కుఁజెక్కు జంటగా నదుముకొని
అతివలు కొలువుసేయఁగ నున్నాఁ డితఁడు ॥ మగ ॥

పదఁతి ముత్యాలపేరే మెడఁ దాఁ దగిలించుక
అదరి శలవినే మోవందుకొనీని
తొడతొడఁ దగిలించుక తుదలేనియాసలతో
తడిని చెలులతో నెత్తములాడీ నితఁడు ॥ మగ ॥

తరుణి మంచముదోమతెర మాటుసేసుకొని
సరి శ్రీవేంకటేశుఁ డిచ్చలఁ గూడీని
కరములు కరముల కందువఁ బెనచుకొని
దొరతన మింతులయెదుటఁ జూపీ నితఁడు ॥ మగ ॥ 224

దేశి

ఇట్టె తప్పులెంచేనంటే నెంత లేదు
కట్టు గాచుకొని వూడిగము నేనేఁగాక ॥పల్లవి॥

చిగిరించినట్టు నీవు నేసిన నేఁతలకు
యెగసక్కెలాడేనంటే యెంత లేదు
మొగమోడి చేతులెత్తి మొక్కి నీవాడినట్టెల్లా
అగపడి నీకు నే విల్లాల నైతిఁగాక ॥ఇట్టె॥

దిమ్మరివై నీవు గడుఁ దిరిగేతిమ్మటలకు
యెమ్మెలు మెరసేనంటే యెంత లేదు
సమ్మతించి నీ-ట్టుకు పాద నే నీచేతను
తమ్ములమందుక మరఁదల నైతిఁగాక ॥ఇట్టె॥

అవియాలమైననీయంగపుమచ్చాలు చూచి
యెరపి కోపించేనంటే యెంత లేదు
అదరి శ్రీవేంకటేశ అన్నిటా విన్నుఁ గూడి
పుడివోక వురముపై నుండానఁగాక ॥ఇట్టె॥ 225

ముఖారి

గామిడివి నీవు కైలాటాలు వెట్టేనవి
యేమరించఁజూచేవు యిద్దరము నొకటే ॥పల్లవి॥

మంతనాన నే నీతో మాటలాడినవియెల్ల
అంతరంగముగఁ జెప్పె ఆపె నాతోను
మంతుకెక్కినట్టినీమతకాలే వేరుగావి
ఇంతులము తొల్లే నేము యిద్దరము నొకటే ॥గామి॥

గుఱుతుగా నీవు నేనుఁ గూడినకూటములెల్లా
యెఱుకగా నాపె నీ(నాః)తో యెచ్చరించెను
నెఱవుగా నవ్వినటాను నీవే కపటివిగావి
యెఱఁగ మామేలెల్లా విద్దరము నొకచే ॥ గామి ॥

[1] చెప్పరానిమనలోని చేసుకొంటి బాసలెల్లా
చప్పుడించ కాపె నాతో నన్న నేనెను
ముప్పిరి శ్రీవేంకటేశ మోహించితి విద్దరికి
యెప్పుడు నీపాలిటికి విద్దరము నొక్కచే ॥ గామి ॥ 226

ఆహిరి

ఏమి మొగము చూచేవు యెన్నటికి నీదయ
చేముట్టి సరసమాడి సిగ్గుదేర్పరాదా ॥ పల్లవి ॥

చెలి నీవద్ద నుండఁగ చెక్కులెల్లాఁ జెమరించె
వెలయ సురటిఁ గొని విసరరాదా
అలనె నీతో నవ్వి అప్పటి నింతటిలోనే
చలువనీమోవితేనె చవిచూపరాదా ॥ ఏమి ॥

సతి నీతో మాటాడఁగ జల్లునను బులకించె
గతిగూడ పచ్చడము గప్పరాదా
తతి మేను సోఁకఁగాను తమకములెల్ల రేఁగె
కత లెందాఁకాఁ జెప్పేవు కాఁగిలించరాదా ॥ ఏమి ॥

ఆంగన వేసవెట్టఁగ ఆయములెల్లఁ గరఁగె
సంగతిగాఁ గౌఁగిలించి చనవీరాదా
రంగుగ శ్రీవేంకటేశ రతిఁ గూడితి వీకెను
ముంగిటనే మోహించె ముచ్చటాడరాదా ॥ ఏమి ॥ 227

1. 'చెప్పరాని బాసలెల్లా చేసుకొంటిమి మనలో' అనుట మేలు.

బౌళి

మేము విన్నవించరాదు మీలోనిమర్మములు
ఆమనివలపు చల్లి అంగవించరాదా ॥ పల్లవి ॥

చిత్తడిచెమటతోడిసిగ్గులేల పతితోడ
చిత్తములోపలిమాట చెప్పరాదా
వత్తివలె మోవిమీఁది వసివాడులేమిటికి
పొత్తుకు వచ్చి యీతనిఁ బోదిసేయరాదా ॥ మేము ॥

ముంచినపులకలతో ముసిముసి నవ్వులేల
చుంచుల నీవేడుకలు చూపరాదా
అంచెల విట్టూరుపులఅసురుసు రేమిటికి
మంచముపైఁ గూచుండి మరుపఁగరాదా ॥ మేము ॥

విందుమోముకళలతో విట్టచూపు చూడనేల
దండిగాఁ గాఁగిట నించి దైవారరాదా
అండనె శ్రీవేంకటేశుఁ డాతఁడే నిన్ను నలమె
కొండలవంటిచన్నుల(లఁ?) గుచ్చియెత్తరాదా ॥ మేము ॥ 228

రేకు 1339 గౌళ

ఎమ్మెలవాఁడవు నీతో నెదురాడవచ్చునా
సమ్మతించి బొమ్మలనే జంకిచుటగాక ॥ పల్లవి ॥

కోపగించవచ్చునా కొచ్చి నిన్ను సారెసారె
చూపులు నాఁటించి సాదించుటగాక
రాపుసేయవచ్చునా రావనుచు వింతలోనె
తీపులమోవివలువ తీసుటగాక ॥ ఎమ్మె ॥

అలయించవచ్చునా అట్టునిట్టుఁ దీసి నిన్ను
వొలిసి నాచనుగుబ్బల నొత్తుటగాక
బలిమిచూపవచ్చునా పైకొని సరసమాడి
గళలురేఁచి వేడుక కైకొంటగాక ॥ ఎమ్మె ॥

పేసరించవచ్చునా వేగినంతా రతులను
ఆస చూపి నిన్ను మర్మా లంటుటగాక
నేసతో శ్రీవేంకటేశ చెందితి వాఁపవచ్చునా
లాసి నీకరుణెల్లా లాలించుటగాక ॥ ఎమ్మె ॥ 229

## ముఖారి

చెలిమోము చూచిప్పుడు సిగ్గులువడేవు నీవు
తలఁపించనా నేను తక్కించేవుగాక ॥ పల్లవి ॥

మంచి చెలివిరహము మొన్ననే విన్నవించనా
అంచెలతో వొద్దికి రావైతివిగాక
కంచము వొత్తుకొరకే కామక చేతికియ్యనా
యెంచుకోక మఱచితివేమోకాక ॥ చెలి ॥

నెలఁతచిత్తము యింత విన్ననే యెచ్చరించనా
అలముక బుజ్జగించవైతివిగాక
తలయువనుచు నీకు కడుఁ బ్రియముచెప్పనా
నలిరేఁగి కవకవ నవ్వితివిగాక ॥ చెలి ॥

అంగవలపులెల్లా నప్పుడే నీకుఁ జూపనా
అంగవించి పంతమియ్యవైతివిగాక
రంగుగ శ్రీవేంకటేశ రతి నిట్టె కూడితివి
యింగిత మెంచనా మెచ్చే వింతలోనేకాక ॥ చెలి ॥ 230

దేసాళం

ఇరువంకల నీకు నిందరము మన్నారము
తెరమరఁగునవ్వులు తెలుసుకోవయ్యా ॥ పల్లవి ॥

వేడుకతోఁ దోడువచ్చి వెవళతియ్యఁగరాదు
వాదికతోఁ జోటిచ్చి వద్దనరాదు
పాదిచెప్పేనని వచ్చి పక్షపాత మాడరాదు
తాడుపై తపసు నీవే తలఁచుకోవయ్యా ॥ ఇరు ॥

అట్టె తా పూఁటవడి అరవవనఁగరాదు
పట్టి చవిగొంటా రోతపడఁగరాదు
చుట్టరికము నేయుచు సూడువట్టఁగరాదు
[1] చట్టురాతినారిది విచారించుకోవయ్యా ॥ ఇరు ॥

నేసవెట్టి పెఁడ్లాడి సిగ్గులువడఁగరాదు
[2] బాసగెవి(లి?)చివమీఁద బద్దనరాము
యీసుదీర శ్రీవేంకటేశ మమ్ము నేలితివి
వేసినముడియె ఇది విడువకువయ్యా ॥ ఇరు ॥ 231

హిందోళం

ఎంతవడి గుట్టునేసే విక్కడనయ్యా
దొంతరవలపులకు తోవేదయ్యా ॥ పల్లవి ॥

కామినిచూపులు నీపై కలువదండలై నిండె
యేమయ్య వూరకున్నాఁడ వెందాఁకాను
దోపటినవ్వులు కప్రధూళులై నీమేన(ను?) ముంచె
వేమఱుముచ్చటలకు వేళ యెప్పుడయ్యా ॥ ఎంత ॥

1. చట్టు రాతినార + ఇది. 2. 'ఒక కాయో పండో పందెముగా నొడ్డి, అది ఇతరుడు గెల్చిన తర్వాత నీకొక బద్ధ ఇష్టానపడమా? లేక 'వద్దనరాదు' అనియా?

పడఁతిమొక్కులు నీకుఁ బల్లవపుఁబరపాయ
తడవవేమయ్యా యెంతదడవాయను
బడిగొన్నవూరుపులు చల్లవిసురట్లాయ
బడియవిరతి కవసర మెప్పుడయ్యా ॥ ఎంత ॥

ముదితమాటలు నీకు ముత్యాలసేసలాయ
యెదురుకొనవలదా ఇఁకనైనాను
కదిసితి రిద్దరును గక్కన శ్రీవేంకటేశ
చదురులాడుటకును సమయమేదయ్యా ॥ ఎంత ॥ 232

వసంతవరాళి

ఐనపని కిఁకనేల అనుమానము
కానిమ్మని లోనుగాక కట్టుకునేదేమీ ॥ పల్లవి ॥

మొగముచూచినదాన మొక్కవద్దా నీకు నేను
యెగసక్కెమాడఁగాను యేమాయను
నగినదాన నీతో నంటున మెప్పించవద్దా
జగడమడిచి నిన్ను సాదించేదేమి ॥ ఐన ॥

చేరఁగవచ్చినదాన సేవలు సేయఁగవద్దా
యీరసాన జంకించఁగ నేమాయను
పేరఁబిలిచినదాన ప్రియములు చెప్పవద్దా
దూరి నిన్నుఁ దిట్టఁగాను దొరతనమేమి ॥ ఐన ॥

సిగ్గులువడినదాన చెప్పినట్టు సేయవద్దా
యెగ్గులెంచి పెనఁగఁగా నేమాయను
వెగ్గళించి నన్నిదె శ్రీవేంకటేశ కూడితివి
బగ్గన నిన్నుఁగాదనేపను లిఁకనేమి ॥ ఐన ॥ 233

సౌరాష్ట్రం

పిసికితే పసురౌసు ప్రియములెల్లా
పొసఁగినవాటినే పొందవలెఁగాని ॥పల్లవి॥

సలిగెగద్దంటాను సారె నెత్తి కెక్కరాదు
పిలిచేవంటా నీతో బిగియరాదు
కలసేనంటా మేను కదుఁబిప్పి సేయరాదు
వొలిసి మట్టుకుమట్టే వుండవలెఁగాని ॥పిసి॥

యిందు రమ్మనేవంటా యిల్లెల్లాఁ జేకొనరాదు
మందెమేళమాయనంటా మారుకోరాదు
యెందైనా వచ్చేవంటా యిలయెల్లాఁ దిప్పరాదు
అంది సరవి మనసియ్యవలెఁగాని ॥పిసి॥

చెప్పినట్టు నేసేవంటా సేవలు గొనఁగరాదు
వొప్పుగఁ గూడితివంటా వుబ్బఁగరాదు
యిప్పుడే శ్రీవేంకటేశ యేలితివి నన్ను నీవు
మెప్పించి సమరతుల మెచ్చవలెఁగాని ॥పిసి॥234

రేకు 1340 దేశాక్షి

ఏమే యెంతనేరుపరి వి దెఱఁగవా
ప్రేమమతి కరతురా బెరయుటగాక ॥పల్లవి॥

కన్నుల మొక్కనమీఁద కాఁకలు చల్లుదురా
నన్నలనే వలపులు చల్లుటగాక
చన్నులు చేతికిఁ జిక్కె సారె వీఁక లోఁగుదురా
వెన్నెలనవ్వులు నవ్వి వేఁడుకొంటగాక ॥ఏమే॥

పాదాలు దాఁచినమీఁద పంతాలు చెరపుదురా
సేదదేర సేవలు సేయుటగాక
ఆదిగొని కాఁగిలించె నావలు వెట్టుదురా
సాదువలె భోగములు చవిగొంటగాక ॥ఏమే॥

ఆయములంటినమీఁద అరగొరసేతురా
పాయవిసమరతులఁ బైకొంటగాక
యీయెడ శ్రీవేంకటేశుఁ దేలె సిగ్గువడుదురా
కాయములు సోఁక విట్టె కలయుటగాక ॥ఏమే॥235

లలిత

ఎంచి చూడుమా నీ కెంత యితవైనాను
వంచన మీరి నవ్వవచ్చునా వోయి ॥పల్లవి॥

పాయలేక నీవెంత పచ్చిగా మోహించినాను
చేయరానిచేఁతలు చేయవచ్చునా
ఆయెడ నీ కటువంటి వలవాటు గలిగితే
చాయల మా కింతసేయ నంగతులా వోఇ ॥ఎంచి॥

వేడుకతో నీవెంత వెస నప్పణిచ్చినాను
ఆడరానిమాటలు విన్నాడవచ్చునా
యీడనాడఁ దిరుగాడి ఇవి నీకుఁ చవులైతే
పాడిదప్ప మాకివి పనులా వోయి ॥ఎంచి॥

ఇప్పుడే నీవు నాకు నెంత వ(చః)న విచ్చినాను
చెప్పరానివని నీకుఁ జెప్పవచ్చునా
నెప్పున శ్రీవేంకటేశ నీకు నేను దాఁతైతే
అప్పటి మా కలశించ నందమా విన్నోయి ॥ఎంచి॥ 236

తోండి

ఇదె నేఁజేసినభాగ్య మేమిచెప్పేది
పొదిగొవి వలపులె పోదిసేసేవు ॥పల్లవి॥

వంతులవాసులవారు వద్దఁ గాచుకుండఁగాను
చెంతల నాపైనేల చేయివేసేవు
సంతలో బేరములే సరసమే కురిసఁగా
పొంతనుండి నాతోనే పొందుసేసేవు ॥ఇదె॥

కోటానఁగోటిసతులు కొలువులో నుండఁగాను
సూటిగాను నామొగమే చూచేవు
తేటచెలమలవలె తేనెలమాట లాడఁగా
కూటమి కొదఁబఱచి కొంగువట్టేవు ॥ఇదె॥

నేసలువెట్టినవారు నేనానేన యుండఁగాను
ఆసపడి నన్నుఁ గూడి ఆనదించేవు
బాసల శ్రీవేంకటేశ పాలవలె నవ్వఁగాను
రాసికెక్క నన్నే గారవించి మెచ్చేవు ॥ఇదె॥ 237

కేదారగౌళ

చెలులాల మీరైనాఁ జెప్పరే బుద్ధి
చలములన్నియు మాని సరసమాడితివి ॥పల్లవి॥

యెప్పటికెప్పటిమాటలేల తలఁచుకొనే
చిప్పిలుచు లోలోనేల చెమరించీనే
తప్పులేదంటానేల తారుకాణించవచ్చీనే
అప్పుడే అన్ని మరచి అందాలఁ గూడితివి ॥చెలు॥

యెక్కడికెక్కడిపనులేల నిలువఁబెట్టీనే
వుక్కుమీరి తానేల వుస్సురనీనే
విక్కమిదంటానేల విందా నానలు వెట్టీనే
చక్కనై అలుకదేరి చవినేసుకొంటివి ॥ చెలు ॥

యేదనేదతగవులు యిందునేల కలపీనే
వోడక తానేల నాపై వొట్లువేసీనే
కూడి శ్రీవేంకటేశుఁడు గుఋతులేం వించీనే
ఆడానీడాఁ తెలుసుక అన్నిటా నమ్మితివి ॥ చెలు ॥ 238

మాళవిగౌళ

[1] ఇన్నిటా ఘనుఁడు దాను యేమిచెప్పేరే
యెన్నుకొనీ నాగుణము లేమిచెప్పేరే ॥ పల్లవి ॥

చెంతఁ దనచెప్పినట్టు సేసితినంటా నిదె
యెంత నన్ను బుజ్జగించీ నేమిచెప్పేరే
అంతటాఁ దన కిచ్చకమాడితినంటా నిదె
ఇంతలో నన్నుఁ బొగడీ నేమిచెప్పేరే ॥ ఇన్ని ॥

వొట్టి తనపై పాటలు వొవరఁ బాడితినంటా
యిట్టె విడెమిచ్చీని యేమిచెప్పేరే
జట్టిగాఁ జన్నులతోడ సామునేయించితినంటా
యెట్టనెదుటనే మెచ్చీ నేమిచెప్పేరే ॥ ఇన్ని ॥

మనసుమర్మములంటా మంతనమాడితినంటా
యెనసి కాఁగిలించీ నేమిచెప్పేరే
చెనకి మొక్కితినంటా శ్రీవేంకటేశ్వరుఁడు
యినుమడిగా మన్నించె నేమిచెప్పేరే ॥ ఇన్ని ॥ 239

1. ఇది అన్నమయ్య జీవితరహస్యముగ తోచుచున్నది.

రామక్రియ

వట్టివేసాలు వేసుక వాదులకు దూరేవు
గుట్టు బాయిటను వేసి గురిగాఁ జేసితినా ॥పల్లవి॥

కొప్పు నే దువ్వితిఁగాక కోపగించి విన్నేమైనా
వొప్పుగ ముంతటిపట్ల కొడిసితినా
విప్పక చేతులువట్టి వేఁడుకొంటిఁగాక విన్ను
ముప్పిరి నొసలు మోపి మొక్కించుకొంటినా ॥వట్టి॥

కందువ లంటితిఁగాక కపటాన విన్నేమైనా
కిందుపడ కావగోర గీరితినా
అందుకొమ్మనుచు [1] మోవినాకు నీ కిచ్చితిఁగాక
చెంది ఇప్పుడు నోరొగ్గించితినా యెంగిలికి ॥వట్టి॥

వలపు రేఁచితిఁగాక వడి విన్ను నేమైనా
కులికి చన్నుల నొత్తి కుమ్మితినా
యెలమి శ్రీవేంకటేశ యెనసి మెచ్చితిఁగాక
పలుకులలో నే బూతుబంపువఁ గిట్లితినా ॥వట్టి॥ 240

రేకు 134 సాళంగనాట

మెలుఁతలందరును మెచ్చిరమ్మా
వలపు లొక్కమాఁటె వంచితివమ్మా ॥పల్లవి॥

మారుగొండ లెక్కితివి మగసితొ దెక్కితివి
నేరుపరి వౌదువు నీవమ్మా
సారె జారించి పయ్యెద చన్నులు చూపితివి
నీరపమాయ వింక నేరజాణవమ్మా ॥మెలుఁ॥

1. మోవిన్ + అకు.

బొమ్మలను జంకించి బుద్ధులెల్ల బోధించి
చిమ్మటికోపము మానిచితివమ్మా
తమ్మిమోము మోము చేర్చి దప్పిదేర మోవి ఇచ్చి
కుమ్మరించితివి సిగ్గు సుణవతివమ్మా ॥ మెలు ॥

పాదము పాదానఁ దొక్కి పక్కన చెక్కులు నొక్కి
నేదదేర్చితివి నీకు చెల్లునమ్మా
ఆదిగావి శ్రీవేంకటమందు అహోబలేశ్వరు
పాటుఁ జేసితివి మంచిచక్కనిలక్ష్మివమ్మా ॥ మెలుఁ ॥ 241

మాళవిగౌళ

కోనతిరువెంగళేశ కోదెకాఁడా
ఆవించి నీసతి నీపై అప్పటి వలపులు ॥ పల్లవి ॥

వేడుకకు నీతోను వేసారక మాటలాడి
పీడెము చేతికి విచ్చి వెద్దువెట్టేవి
వాడికగా నీసొమ్ము వడిఁ దనమేనఁ బెట్టి
తోడనే మోపులుగట్టీ తొయ్యలి వలపులు ॥ కోన ॥

చెక్కునొక్కి నవ్వించి చిత్తము రా పన్నవేసి
మొక్కిమొక్కి ఆసవుట్ట మోవి చూపీని
వొక్కమాఁటే నీకొప్పుపువ్వులు దా ముడుచుకొని
చిక్కించి నీపై రాసిచేసీ వలపులు ॥ కోన ॥

కొంగువట్టి కొసరుచు కూరిమి కాఁగిట వించి
సంగతిగాఁ గూడికూడి చల్లీ నేస
రంగుగ శ్రీవేంకటేశ రతిని గంద మలంది
పొంగుచును కణఁజాలఁ బోసీ వలపులు ॥ కోన ॥ 242

దేసాళం

ఇంతితో నేఁటిపీరాలు యెందాఁకాను
సంతోసించి మచ్చికలు చల్లఁగరాదా ॥పల్లవి॥

చనవరికాంతగాన పతి నీపైఁ జేయిచాఁచె
కొనగోరు దాఁకెనంటిఁ(టాఁ?) గోపగింతురా
నసువు గలదుగాన నవ్వులెల్లా నవ్వె నీతో
కసుఁగొవి యందు కీకెఁ గాఁగిలించరాదా ॥ఇంతి॥

కూరిమివనితగాన కొప్పువట్టి విన్నుఁ దీసె
ఆరీతి జంకించెనంటా నదలింతురా
నేరుపుగలదుగాన నీకఁ(కం?)చే మితిమీరె
గారవించి అందుకిట్టె కాఁగిలించరాదా ॥ఇంతి॥

ఇచ్చకపుసతిగాన ఇటు విన్నుఁ జొక్కించె
పచ్చినేసెనంటా విట్టె పదరుదురా
మచ్చికె గలదుగాన మరిగె శ్రీవేంకటేశ
కచ్చుపెట్టి అందు కిట్టె కాఁగిలించరారా ॥ఇంతి 243

పాళి

ఇందాఁకామున్నభావ మేమి చెప్పేది
చెంది వేడుకతో మించె చెక్కునొక్కఁగాను ॥పల్లవి॥

చిగిరించెఁ జిత్తము చిరునవ్వులు మొనసె
మొగము కళలు విండె ముదితకును
వెగటులన్నియుఁ బాసె వేడుకలు దైవారె
మగటిమితో నీవు మాటలాడఁగాను ॥ఇందాఁ॥

పొదలెను కుచములు భోగపుటాసలు రేఁగె
యెదిరించెఁ బులకలు యింతికిని
అటన నానంద మబ్బె ఆయములు గరఁగెను
చదురుఁదనాన నీవు చనవియ్యఁగాను ॥ఇందాఁ॥

కొప్పు గడు వెడజారె గుట్టుఁ [1]దమకము నిండె
అప్పటి వలపు పండె నతివకును
కుప్పళించెఁ [2]దమకము కోరికలు దైవారె
నెప్పున శ్రీవేంకటేశ నీవు గూడఁగాను ॥ఇందాఁ॥ 244

సామంతం

ఎంతవాఁడవయ్య నిన్ను నేమనేము
సంతకూటములవాఁడ సంజటూరిచెన్నుఁడా ॥పల్లవి॥

సోగకన్నులనుఁ జూచి సొంపులమాటలాడి
వాగపుగొల్లెతలను వలపించేవు
జాగులనవ్వులు నవ్వి జాజరపాటలు వాడి
బాగుగా నప్పటిఁ గొంత భ్రమయించేవు ॥ఎంత॥

బింకపుసాములు సేసి బెట్టుగాఁ బువ్వుల వేసి
అంకెకు వచ్చినదాఁకా నాసరేఁచేవు
లంకెలమఁ గూచుండి లలితో మర్మము లంటి
మంకుఁదనములవారి మరిగించేవు ॥ఎంత॥

చీరలకొంగులు వట్టి సిగ్గులు బయటవేసి
గారవించి కాఁగిటను కరఁగించేవు
యీరీతి శ్రీవేంకటేశ యిందరిని యేలుకొని
మేరమీరి చనవిచ్చి మెప్పించేవు ॥ఎంత॥ 245

---

1, 2 పునరుక్తి.

సామంతం

రావయ్య చూతువు రమణిని
దేవుల కిటువంటి తెఱఁగులు ॥పల్లవి॥

పలచవియెలుఁగులపాటలు
చెలఁగొంచెలపలచెమటలు
విలువునివ్వెరగులనీటులు
కలిగె నేఁ డిదివో కలికికిని ॥రావ॥

సుడిగొవినయెదురుచూపులు
వుడుకవుడక వట్టె వూరుపులు
బడిబడిఁ దిరిగేటిబాగులు
అడియాలమయ్య నీయంగనకు ॥రావ॥

చేతిలో పిడికిటిసేసలు
రాతిరిఁబగలు రతిరహస్యములు
యీతల శ్రీవేంకటేశ యెనసితివి
లాతాయ మన్ననలు లలనకును ॥రావ॥ 246

రేకు 1342 రామక్రియ

ఒకటి కిసుమ దయ్యా నుప్పు చింది
మొకము చూచీ నట్టె ముచ్చటాడనీవే ॥పల్లవి॥

చలివాసివున్నదాన నము కాసున్నదాన
నలువంక వింకఁ గొంత నప్పనీవే
తలఁపులోవిదాన తగులాయమైనదాన
ములువాఁడికొనగోరు మోపనీవే ॥ఒక॥

వేవకు లోనైనదాన సేవసేయుచున్నదాన
పోసరించి యింకఁ గొంత బోదించనీవే
రావికెక్కినట్టిదాన రతి కియ్యకొన్నదాన
మోనపోవివలపుల ముంచనీవే ॥ ఒక ॥

కందువనే వున్నదాన కాఁగిలించుకొన్నదాన
యిందమని మోవి నాకు నియ్యనీవే
యిందరిలో శ్రీవేంకటేశ్వరుఁడు నన్నుఁ గూడె
మందలించి యింకానింకా మన్నించనీవే ॥ ఒక ॥ 247

కన్నడగౌళ

ఎప్పుడు దయదలఁచే వింక నీవు
దప్పిదేర మోవి యిచ్చి దక్కఁగొనవయ్యా ॥ పల్లవి ॥

నిలువెల్లఁ జెమరించె నీతో మాటాడరాఁగా
వెలఁదియలపుదీర విసరవయ్యా
నెలపై కొలువు సేసి నివ్వెరగుతో నున్నది
యెలమి నీతొడమీఁద నిడుకొనవయ్యా ॥ ఎప్పు ॥

భారపుకుచము లూరె పాదాలకు మొక్కరాఁగా
నేరుపున ముడిచి మన్నించవయ్యా
శేరకొన నిన్నుఁజూచి తిమురుచునున్నది
గారవించి కాఁగిటను కాఁగిలించవయ్యా ॥ ఎప్పు ॥

వెనఁ బోఁకముడి వీడె వీడెము చేతికిరాఁగా
పసగాను తెరవేసి పాలించవయ్యా
కొసరి శ్రీవేంకటేశ కూడె నిన్ను నింతలోనె
మసరాన రతులకుఁ జొక్కి మెచ్చవయ్యా ॥ ఎప్పు ॥ 248

దేవగాంధారి

ఇంత నెంతగావలె యీవలపూ
యింకదు చెమ్మచెమట యిదెకాదా వలపు ॥ పల్లవి ॥

పెదవిపై వీడెపుఁబిసరు
అదన నిమ్ముఁజూచి యసురుసురు
పదరి పయ్యదకొంగుపై విసరు
యెదిగించీఁ జెలి నీపై నిదెకాదా వలపు ॥ ఇంక ॥

గక్కన మనసులోవికరఁగా
మొక్కలపుపిగ్గులతో మొరఁగా
మిక్కిలిమరుకళలమెరుఁగా
యిక్కువలు చూపెఁ జెలి కిదిగాదా వలపూ ॥ ఇంక ॥

నమపుతో వెలవుల నగవూ
పెనఁగేటికాఁగిటిబిగువూ
యెనసె శ్రీవేంకటేశ యింతి నిన్ననూ
యినుమడించెఁ దమక మిదిగాదా వలపూ ॥ ఇంక ॥ 249

కాంబోది

ఎవ్వతెైనా వలచును యిటువంటిపనులకు
రవ్వపడినచేఁతల రతికెక్కితివిరా ॥ పల్లవి ॥

సొలపులాడిమనను సోదించి చూచితి
చెలుకఁగాఁ జెనఁగి నేఁ జూచితిని
యెలమి నందులలోనై ఇచ్చకమే సేసేవు
చలివాసె నన్నిటాను జాణఁడ వౌదువురా ॥ ఎవ్వ ॥

కప్పినసీవేఁతలు సంగడిఁ జూపి చూచితి
చొప్పులెత్తి నవ్వు నవ్వి చూచితివి
వొప్పుకొని అందుకెల్లా నొడఁబడఁ జెప్పేవు
తప్పువిటొంకవియట్టిదంట వౌదువురా ॥ఎవ్వ॥

మిక్కుటపురతులను మెప్పించి చూచితి
చొక్కించి గోరగిరి చూచితివి
యెక్కుడాను మోసపోవు యిన్నిటా నన్నేలితివి
యెక్కువైన శ్రీవేంకటేశుఁడ వౌదువురా ॥ఎవ్వ॥ 250

సామవరాళి

అన్నిటా గుట్టుతో నుండు టదిమేలు
తన్నుఁదానె వచ్చి యేల తిడవేవు మమ్మును ॥పల్లవి॥

మనసురావిసతి మాఁటలెన్ని యాడినాను
వొనరివుండరు కడువగరై తోఁచు
కొనవేసి మరికొంత కొసరఁగఁబోతేను
[1]పెనపరాలకు వచ్చి పిప్పిగట్టును ॥అన్ని॥

యెరపరికపుచెలి యెంత నవ్వు నవ్వినాను
సరవితో నుండదు చప్పనై తోఁచు
పొరలించి మరికొంత పూఁచి కానుక వెట్టితే
కరఁగక లోలోనే గరివడును ॥అన్ని॥

నెమ్మిఁ దరితీపులేవినెలఁత యెంత మొక్కినా
వొమ్మ సమ్మతమై వుండదు వుప్పనై తోఁచు
కమ్మి శ్రీవేంకటేశ నేఁ గలసితి నింకెట్టన్నా
చెమ్మవుట్టి వలపులు చిగిరించును ॥అన్ని॥ 251

1. పెనపరాలు=వివాదములు. 'పెనపరి' శబ్దభావార్థకరూపమా?

సాళంగం

గొల్లదాన నింతే నేను; కొంగువట్టి దొరకొనె
యెల్లవారుఁ జూడఁగాను యేమిసేతునే ॥పల్లవి॥

కన్నుల జంకించీని కైదండ వట్టీని
వున్నతపుకొనగోర నొత్తీని
చన్నులు చేతఁబట్టీని సరసములాడీని
యెన్నిచెప్పినా మానఁడు యేమిసేతునే ॥ గొల్ల ॥

తీగెనవ్వు నవ్వీని తెరలోనికి రమ్మనీ
బాగుగాఁ దానే కస్తూరి పైఁబూసీని
వేగిరించి వలపులు వెల్లవిరిగాఁ జేసీని
యీగతి వీనిగుణము లేమిసేతునే ॥ గొల్ల ॥

మొక్కలానఁ గాఁగిలించి మోవి గంటిచేసీని
చిక్కుదీసి శిరసుపై సేసవెట్టీని
గక్కన శ్రీవేంకటాద్రిఘనుఁ డిట్టె నన్నుఁ గూడె
యెక్కువగా మన్నించీ నేమిసేతునే ॥ గొల్ల ॥ 252

రేకు 1343 రీతిగౌళ

మంచిమేలు గలిగితే మానవచ్చునా
యెంచక చేకొనవయ్య ఇంటిదాన నేను ॥పల్లవి॥

యిన్నియు నేరుచు నాపె యెగ్గుసిగ్గులేని దాపె
వన్నెల వింకా నాపెకు వలవవయ్యా
మన్ననతోదాన నేను మానాపతివి నేను
వున్నతిఁ దొల్లే సతమైవున్నదాన నేను ॥ మంచి ॥

యేమైనాఁ జేసు నాపె యెమ్మెలెరగని దాపె
ప్రేమతో నాపె వింటికిఁ బిలువవయ్యా
నీమాటలోదాన నేను నిగర్వపుదాన నేను
కాఁచి నీ కెప్పుడునుఁ గలదాన నేను ॥ మంచి ॥

పవిలేనిపవి దాపె పంతములోల్లని దాపె
ననుపున బాసలిచ్చి నమ్మించవయ్యా
చనవరిదాన నేను జట్టిగొన్నదాన నేను
యెనసితివి శ్రీవేంకటేశ యిట్టె నేను ॥ మంచి ॥ 253

పూర్వగౌళ

ఎంతలేదు రమణునియేలాటాలు
పంతపుమాఁటలకెల్లా బారలుచాఁచేవా ॥ పల్లవి ॥

చెలువుఁడు నవ్వుతాను చేఁతలేమో సేసెనంటా
చలములు నీవేల సాదించేవే
జలజలమనుచును జడివాన గురిసితే
కలచోటికెల్లా నీవు కట్టలు గట్టేవా ॥ ఎంత ॥

రమణుఁడు వేడుకతో రవళించి తిట్టెనంటా
గమకాన నంత యేల కాఁతాళించేవే
సమముగా నంతటా వేసవి యెండగాసితేను
భ్రమసి యేడనేడకై పందిళ్లువెట్టేవా ॥ ఎంత ॥

శ్రీవేంకటేశుఁడు నిన్ను చెంగలించి కూడితేను
ఆవేళ నీవేల వుసురసు రనేవే
కావరించి పొలమెల్లా గాలి విసరితేను
దావతి నెందుఁజూచినా దళ్లుగట్టేవా ॥ ఎంత ॥ 254

ఆహిరినాట

ఇదియే చాలు నాకు యెడలేనివెగటుల
  పదిటి కొకమాఁటైనాఁ బలుకకుండేవా ॥పల్లవి॥

మంతనాన నీతోను మారుకొని మాటాడఁగ
  పంతము వచ్చెనా నేఁడు పలుమారును
  చింతతోడఁ దలవంచి చెక్కుచేతితో నుండఁగ
  కొంతైనా నన్ను వేఁడుకొనకుండేవా ॥ఇది॥

గద్దించి నీతో నేను తమ్మటివిఁ బెనఁగఁగ
  పెద్దరికమా నాకుఁ బెచ్చువెరిగి
  కొద్దితోడఁ బానుపుపై గుట్టుసేసుకుండఁగాను
  బుద్ధి దలఁచుకొనైనా బొందకుండేవా ॥ఇది॥

నెంపై కాఁగిటిలోను నిన్ను నలయించఁగాను
  కలిగెనా మేలు శ్రీవేంకటవిభుఁడా
  చెలఁగి రాజసముతో చేరి సంగడి నుండఁగ
  నలువంక నాతోనే నవ్వకుండేవా ॥ఇది॥ 255

శుద్ధవసంతం

పొగడేవు నన్నును పూఁచిపూఁచి పలుమారు
  యెగసక్కెములకైతే యేమిబాఁతి నేను ॥పల్లవి॥

వలపు చవిగొంటేను వడిఁ జెప్పరానితిపు
  బలిమి నొల్లకుంటేను బాఁతిగాదు
  పిలిచి విడెమియ్యఁగాఁ బ్రియురాల నైతిని
  యెలమి చింతకతొలి యేమి బాఁతి నేను ॥పొగ॥

రతివేడుక గలితే రసము లొలుకుచుండు
ఇతవుగాక వుండితే యెందూఁ బొందదు
తతి సరసమాడఁగా తగుచవవరినైతి
ఇతరకాంతలలోవ యేమిశాఁతి నేను ॥ పొంగ ॥

కాఁపురము నేసేనంటే కల్పవృక్షమై తోఁచు
వోపనంటే మోఁటుపడివుండు నూరకే
యేపున శ్రీవేంకటేశ యేలఁగా ఇల్లాలనైతి
యీపై చమ్మటూరఁ జూపే వేమిబాఁతి నేను ॥ పొంగ ॥ 256

దేసాళం

విన్వేరగుతో నుండాన విన్నుఁ జూచి
జవ్వనపుసంపదలు సందు చూపరాదు ॥ పల్లవి ॥

మనసార నే నీతో మాటలాడేనంటేను
వినేయందు నీకైతే వేళలేను
పనివడి యప్పటిని పాదాలు గుద్దేనంటేను
యెనసి కొలువేగాని యేకాంతము లేదు ॥ ఎవ్వె ॥

సారెసారె నీతోను సరసమాడేనంటే
కోరి నీవలపులకు గురిలేదు
గారవించి విన్ను నంటి కళలురేఁచేనంటే
యీరీతినైన నీకు ఇంపులేను ॥ విన్వె ॥

గక్కున విన్నుఁ గదిసి కాఁగిట బిగిసేనంటే
తక్కరితనాన నీకు తనివిలేదు
అక్కరై శ్రీవేంకటేశ అంటిలో నన్నేలితివి
యెక్కువతక్కువ లెంచ యీరసము లేదు ॥ విన్వె ॥ 257

దేసాళం

పోపో యెక్కడిసుద్ది వీడ్దువాదా అన్నీ నికు
యీపనులు మీకేకాక యిది మాకుఁ దగవా ॥పల్లవి॥

ఆకెతోడ నీవు నన్ను నాడుమన్నమాటలెల్లా
యేకతానఁ జెప్పఁబోతే యెటుండును
ఆకడనుఁ దనసరియాఁటదానిఁ బేరుకొంటే
యీకడ నీపెకు నేఁడు యితవవునా ॥పోపో॥

పుత్తడి నీవంపినవుంగరాలు చేతివవి
ఇవలఁ జేతికియ్యఁగ యేమనునో
అవల నొకతెపాదాలందున్నమెట్టెలిచ్చితే
నవతులైనవారు యీడాడల కోరుతురా ॥పోపో॥

ఉన్నతిఁ బిలువుమనఁగా యీరతు రప్పించితివి
యింతలో గూడె ఇంకెంత యొగ్గువట్టునో
వింతగా శ్రీవేంకటేశ వేరొకతె యింటలోన
బంతి యీపె వెట్టితే యీపవికి సయించునా ॥పోపో॥ 258

రేకు 1344 శుద్ధవసంతం

గెలువరాదు నీమాయ కేరడమా లేమాదేమో
కలికి వింతటనైనఁ గరుణించవయ్యా ॥పల్లవి॥

చెలితోఁ జుట్టమువలె సేసితివి మేలు మేలు
వెలలేనిదాగారాలే వేగినంతాను
పలుమారు మద్దులనే శ్రమలఁబెట్టితివి బిగ్గె
కలతోవికూటమ్ములే కలిగినంతాను ॥గెలు॥

అమర విజమువలె వాడితివి మేలుమేలు
మానవితోలిమాటలే మాపుదాఁకాను
పావఁబట్టి యాపలనే సంతోసాలు రేఁచితివి
వీనులపండుగలే విన్నంతాను ॥ గెలు ॥

పాడితివి పాటవలె బాసలే మేలుమేలు
యెడలేవి వొడఁబాట్లిందాఁకాను
పీడెమిచ్చి కూడితి శ్రీవేంకటేశ యీసతివి
వాడికవలపులే వలపినంతాను ॥ గెలు ॥ 259

## మధ్యమావతి

తనకంటె నేరుతుము తరవాతిపనులకు
చెనకెఁ జిగురుఁగొమ్మ చేఁగయయ్యీ ననరే ॥ పల్లవి ॥

చెప్పఁబోతే నెప్పుడైనా చిగిరించీ మాటలు
వొప్పుగ మోనముతోడ నుండుమనవే
అప్పటనుండి వింటి నవె చాలు నేమన్నా
పిప్పిగట్టీ వీరుదియ్యఁ బేమవచ్చీ ననవే ॥ తన ॥

చేరి పెంచఁబోతేను చెంగలించీ నగవులు
వోరుచుక గుట్టుసేసుకుండుమనవే
ఆరితేర కముఁగొంటి నవె చాలు వీఁకమీఁద
గోరగిరితే మఱి గొప్పయేరా ననవే ॥ తన ॥

వొత్తి కాఁగిలించుకొంటే వూరీని చెమటలు
వొత్తలవడక కొంత వుండుమనవే
ఇత్తల శ్రీవేంకటేశుఁ డిట్టె తా నన్నుఁ గూడె
కొత్తమొలకచన్నులే కొండలాయ ననవే ॥ తన ॥ 260

ధన్నాసి

బడలె నీమేనెల్ల పవ్వళింతువు రావయ్యా
తడయక నాకు బాలు తలగడబిల్లలు ॥ పల్లవి ॥

ఇంత ప్రొద్దువోయి వచ్చే వేడమంటి విందాఁకా
యెంతమాటలఁ బెట్టుక యెవ్వతుండెనో
వంతపుఁబందేలకు పగడసా లాడితివో
సంతకాణతనములు సతులెల్ల నాడిరో ॥ బడ ॥

తడఁబడి మాటాడేవు తలఁ పెక్కడివరాకో
బడిఁబెట్టి కెవ్వతైనా పనిగొనెనో
వెడయాసల నెఁ(నెం?)డైనా వేడుకకాఁడవైతివో
వడిపెట్టి వాడవారు వలపులు చల్లిరో ॥ బడ ॥

నవ్వుఁ గాఁగిలించి కూడి నలుదిక్కులు చూచేవు
పన్నల నెవ్వతైనా పంచకు వచ్చెనో
యిన్నిటా శ్రీవేంకటేశ యేమి సరసమాడేవో
కన్నవారెల్లా నీకికందువ నేరిపిరో ॥ బడ ॥ 281

వరాళి

ఇద్దరము మన్నారము యెందువొయ్యేము
తిద్దువద్దవనుపులే తెమలించీఁగాక ॥ పల్లవి ॥

సారెసారె నీతోను చలము సాదించనేల
కూరిములే కలిగితే కూరిచీఁగాక
కారములుగా విన్ను [1]గంటెపాలాడఁగనేల
పేరడైతేఁ దమకము పెడరేఁచీఁగాక ॥ ఇద్ద ॥

1. 'గెంటనములు'కు, 'గంటెపాలు' వ్యావహారికరూపము గాబోలు. ఇది యతి స్థానము గూడ: తిప్పక లోగదిది.

తెలుఁగుఁగాంబోది

చేయెత్తి మొక్కితి చెక్కు నొక్కితివి
ఆయెడ నీకెంత ఆసోదమో ॥పల్లవి॥

కప్పుర మిచ్చితి కాఁకలు చల్లితి
ముప్పిరిఁ జన్నులు మోపితి
చెప్పర నన్నేమి సేయుమన్న [illegible]
అప్పటి నీకెంత ఆసోదమో ॥చేయె॥

మొగము చూపితిని ముచ్చటలాడితి
నిగిడి మోవితేనె యిచ్చితి
పగటులేలరా పచరించే [illegible]
ఆగపడేవు యెంత ఆసోదమో ॥చేయె॥

కందువ చూపితి కాఁగిటఁ గూడితి
సందడి నీమేలు చవిగొంటి
చిందకురా సిగ్గు శ్రీవేంకటేశ్వర
అందరిలో నెంత యాసోదమో ॥చేయె॥ 284

రేకు 1345 శంకరాభరణం

ఇంటికి విచ్చేసె నీతఁడిదె
జంటయియున్నాఁడు [illegible] ॥పల్లవి॥

తలఁచిన [illegible]
[illegible]
[illegible]
అలుగుదురటవే అంతటిపనికి ॥ఇంటి॥

విడువవి వేడుకలు విరివాయ మరి
[1]గుదిగాను కూటమి కొనసాగె
యెడనెడ నాతఁడు యెవ్వతెఁ జూచిన
తడవుదురటవే దక్కినపనికి ॥ ఇంటి ॥

చేసినచేఁతలు చెల్లెను నీకిఁక
దాపినపెండ్లి తగులాయ
ఆసల శ్రీవేంకటాధిపుఁడు రతి-
సేసె నలతురచె చేకొన్నపనికి ॥ ఇంటి ॥ 265

దేవగాంధారి

మెచ్చితి మప్పుడే నీకు మిక్కిలి మోహించితిమి
హెచ్చె నీసింగారాలు యెక్కడఁ జూచినను ॥ పల్లవి ॥

అరిదిచెక్కులమీఁది యంగనకస్తూరిపూఁత
కరఁగి నీచెంపలపై కారివుండఁగా
దొరతనాలు సేసేవు తొయ్యలులలోననెల్లా
యిరవాయ నీయెమ్మె యేమిచెప్పేది ॥ మెచ్చి ॥

కోమలిగుబ్బలమీఁదికుంకుమగందపుఁబూఁత
ఆముకొని నీపురాన వంటివుండఁగా
సాముసేసేవావివలె సతులకుఁ జూపేవు
నే మెఱఁగమా నీవు నెరజాణవౌట ॥ మెచ్చి ॥

పొలఁతిమైవలఁదివపొదికప్పురపుపూఁత
నెలకొని రతివేళ నీపై నంటఁగా
కొలువులో మాకుఁ జూపి కూదితివి మమ్మిందరి
తలఁచమా శ్రీవేంకటోత్తమ నీమహిమలు ॥ మెచ్చి ॥ 266

---

1. 'గుతి'కి 'గుది' రూపాంతరమా? 'గుదిగాను'కు బదులు 'గుతిగాను' రూపము గూడ సుసాధ్యయమున పలుతావులం గలదు.

ఆహిరి

మన్నించవయ్య యింక మగువను
సన్నలనే మాకుఁ జెప్పి సంతము సేయుమని ॥పల్లవి॥

పయ్యదచెమటఁ దోఁగి బయటఁబడెఁ జన్నులు
ముయ్యఁ(య్యఁ?)జొచ్చె సిగ్గువడి ముంజేతులను
కొయ్యతనాన నంతలో గోర గీరేవు చెక్కులు
ఇయ్యెడఁ దప్పించుకొనే వెంకుకొను చెలియ ॥మన్నిం॥

పూరుపుగాలికి చీర వాడిసి తొడ గాన్పించె
అరసి సిగ్గున మూసీ నరచేతుల
కేరడాన నంతలో గిలిగించేవు సందులు
యీరీతిఁ దప్పించుకొని [1]యెన్నికొఁ జెలియ ॥మన్నిం॥

పులకల విబ్బరాన పోఁకముడి వీడెను
తులికి సిగ్గునఁ బట్టె కొనచేతుల
అలరి శ్రీవేంకటేశ అంతలోనె కూడితివి
యెలమి నవ్వులు నవ్వె యేమిటికొఁ జ(జె?)లియ ॥మన్నిం॥ 267

వసంతవరాళి

ఇన్నిటా సంతోసించితి ఇదివో నేను
యెన్నఁగ నీవెఱఁగని వేమున్న దింకను ॥పల్లవి॥

చెప్పకతొలుతే నీవు చేరి వింటి నామాట
విప్పుచు నేదింక విన్నవించేదేమి
అప్పుడే అందుకుఁగాదా అంగమెల్లఁ జెమరించె
తప్పక నీవలపెల్లా కంటిని నేను ॥ఇన్ని॥

1. "ఎన్నితికి" బదులు "ఎన్నికి" రూపము కావలెను.

సేయకతొలుతే నీవు చేకొంటివి వూడిగము
కాయకముగా నేను కావించేదేమి
నీయందు నందుకేకాదా వించె మోమునఁ గళలు
ఆయెడ నీపనులెల్లా అవునంటి నేను ॥ఇవ్వి॥

కూడకతొలుతే నీవే కూడితివి కాఁగిటను
వోడక శ్రీవేంకటేశ వొరసేదేమి
యీడ నీ విందుకేకా ఇటు మేను చొక్కితివి
జాడతోడ నీమతికి సమ్మతైతి నేను ॥ఇవ్వి॥ 268

సామంతం

ఏమి చెప్పేది నీసుద్దు లెంత లేదు
దామెన గట్టేవు బొంకు తారుమారుగాను ॥పల్లవి॥

చెప్పరాదు చూపరాదు సేసిననీచేఁతలైతే
అప్పటి దాసలు సేసే వందరిలోన
దుప్పటికొంగైతేను తొగరద్దినట్టున్నది
కుప్పళించేవు పంతాలు గుఱుతులుగాను ॥ఏమి॥

పట్టరాదు ముట్టరాదు పచ్చియైనపీషణైతే
పెట్టుకొనేవు ఆనలు పెద్దెఱఁగున
పట్టెపుంచమయితేను పదనుగారుచున్నది
దిట్టకూళతనములు బిగుపారించేవు ॥ఏమి॥

విసరాదు అనరాదు వీనుల నీగుణములు
వొనరించేవు సాకిరు లొక్కటొక్కటే
చెనకి శ్రీవేంకటేశ చెక్కులైతేఁ జెమటూరీ
యెనసితివి అనోదా లింకా నాపెఁ జలేపు ॥ఏమి॥ 269

నాదరామక్రియ

ఏల పంతాలాడుకొనే యెందాఁకాను
తాలి మెఱఁగను అట్టు తనకేలే ॥పల్లవి॥

సిగ్గువడేదానికేలే చెనకులు మరి
యెగ్గుపట్టేదానికేలే యేలాటాలు
అగ్గమైనననుబోఁటి కందమౌఁగాక వట్టి-
తగ్గుమొగ్గు లెంచేటితనకేలే ॥ఏల॥

గుట్టుచూపేతనకేలే కొసరులు కడు
మట్టులేనితనకేలే మంతనములు
యిట్టె నావంటిదే యెఱుఁగుఁగాక
దట్టప్ప(పు?)గర్వము దిది తనకేలే ॥ఏల॥

కూడెఁ దొల్లె తనకేలే కొరతలు యిట్టె
వీడెమిచ్చేతనకేలే వేసాలు
యీదనె శ్రీవేంకటేశుఁ డేలె నన్ను
తాడుపోదవుగర్వము తనకేలే ॥ఏల॥ 270

రేకు 1346 ముఖారి

ఔనయ్య మంచివాఁడ వౌదువు నీవు
కానుకవట్టిన మొక్కుఁగ దెరఁ బోతురా ॥పల్లవి॥

పేర దిద్దితే వచ్చితివి పెనఁగనేల చెలితో
గోరగీరేపని కేఁక గొద్దవేఁటికి
సారపుమోవితీపులో సరిపెట్టేవు తేనెలు
యేరు గుడిచి కాలువ యింత పొగడుదురా ॥ఔన॥

ఆసపడి చూడఁగానే ఆడించేవు యెగ్గమాట
చేసన్నవచ్చేపనికి చెట్ట యేఁటికి
యీసతిఁ జూచి యెప్పతో ఇటులావున్నదనేవు
పూసినగంధవుపూఁత పుప్పొడిఁ బోలుతురా ॥ఔను॥

నగినమాటలలోన నలుసులు వెదకేవు
తగులాటాలై నమీఁద తగవేఁటికి
జిగిమీరి కూడితివి శ్రీవేంకటేశ ఇంతివి
చిగిరించితే మరి చెట్టుగట్టకుండునా ॥ఔను॥ 271

రామక్రియ

ఏమాయ వింతలోనే యెగ్గులేల పట్టేవు
సాము సేయఁగా నూరుపు చల్లరాదా నేను ॥పల్లవి॥

యెగసక్కెలంటాను యేల నన్నుఁ దిట్టేవు
నగరాదా పూరకైన నాలోనను
పొగరాయనంటాను వురము దట్టుకొనేవు
మొగము నీవు చూచితే మొక్కరాదా నీకు ॥ఏమా॥

తివిరి కోపించెనంటా తెరవలతోఁ జెప్పేవు
చెమరించరాదా నాచెక్కులమీఁద
భ్రమసి నీకునీవే పంతమాతే నెంపేవు
సముకానఁ గానుక వొసఁగరాదా నీకు ॥ఏమా॥

అయ్యెడ సిగ్గువడితివంటానే కొసరేవు
మొయ్యరాదా చన్నులు నాముదిగొంగున
నెయ్యపుశ్రీవేంకటేశ నీవు నన్ను నేలితివి
చెయ్యంటఁగ పచ్చకము పేయరాదా నీకు ॥ఏమా॥ 272

బౌళి

పిలిచిన నెఱఁగవు ప్రేమపుఁబరాకున
　చెలరేఁగి ఆదేవు చెల్లునయ్య ఇఁకను ॥ పల్లవి ॥

చొక్కపుఇంతిగుబ్బలే జూజపుసారెలు నీకు
　చిక్కినమంచివురమే [1] నెత్తవంక
అక్కడిగోరిరేకలే అమర వ్రాసినయిండ్లు
　చిక్కించు కాటలాదేవు చెల్లునయ్య యిఁకను ॥ పిలి ॥

మదనమందిరమే మచ్చికపులిజూజము
　వుదుటుమొగపువజ్రా లొద్దినవాళ్లు
మొదలైనరతులెల్ల మూలదాంట్లు నీకు
　చెదరవిఆటాదేవు చెల్లునయ్య యిఁకను ॥ పిలి ॥

పొలసి ముట్టి మట్టాడేపోఁకముడి గుంతపోఁక
　కొలఁదైననాభే యిక్కువైనగుంత
వెలయ శ్రీవేంకటేశ వెసఁ గూడి సారెసారె
　చెలరేఁగి ఆదేవు చెల్లునయ్య యిఁకను ॥ పిలి ॥ 273

సౌరాష్ట్రం

ఎంత నిజమరివి విన్నెమిచెప్పేది
　బంతినే నోరూరించేవాగు లింతేకాక ॥ పల్లవి ॥

నెలఁతపై బత్తిగలితే విన్న రాకవుందువా
　పెలుచవై కన్నప్పటిబేఁటమేకాక
తలఁపులో నుండితేను తమకించకుందువా
　పలికి కొసరేవేళ పచారాలేకాక ॥ ఎంత ॥

1. నెత్త+వంక.

చేరి కూచ వేడుకైతే సిగ్గులువడుదువా
వూరట సరసాలాదేవుబ్బుయగాక
నారుకొన్నపనులైతే నవ్వులు నవ్వేదువా
పోరచి చుట్టరికాలపొందు లింతేకాక ॥ఎంత॥

ఆయములు గరఁగితే నందఁ బవ్వళింతువా
కాయకపుప్రియముల గచ్చులుగాక
యీయెడ శ్రీవేంకటేశ యింతలో నేలితి పీకె
చాయమరుఁడు వుట్టించేచవు లింతేకాక ॥ఎంత॥ 274

సింధురామక్రియ

నాటకాలు బూటకాలు నాతోనే పలెనా
నీటుతోడ నీసుద్దులు నే నెఱఁగనా ॥పల్లవి॥

తళుకున నాపెఁజూచి తలవంచుకొంటివివి[1]
వలవ నాసపడనివానివలెనె
తలఁపులో నారూపు తలపోసి తలపోసి
నెలకొని కరఁగేది నే నెఱఁగనా ॥నాట॥

ఆకెమాట చెవుల విననట్టె మారుమాటాడవు
వాకు నా కొప్పగించినవానివలెనె
చేకొని యీపరాకున సిగ్గులమాట యూహించి
నీకునీకె సుకించేది నే నెఱఁగనా ॥నాట॥

నీమీఁద నాపె చేచాఁచ నీవు నాపైఁ జేచాఁచేవు
వాములుగా నన్నుఁ గూడేవానివలెనే
యీపై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నీమన సాడ నుండుట నే నెఱఁగనా ॥నాట॥ 275

1. ఈ 'వి'వర్ణ మెక్కువగదా? 'తలవంచుకొంటివి వీ-వలన' అని వి[illegible]
అర్థమంత సంగతమా?

కేదారగౌళ

అడుగరే యీసుద్ది యౌనో కాదో
పడఁతులాల తనభావము దెలియను ॥ పల్లవి ॥

యెంతకు నంతేకావి యెక్కుడుబాఁతౌనచే
పంతాన తాఁ బిలిచితేఁ బలికితిని
అంతలోనె సొలయుచు నప్పటిని గొసరీని
వింతదాననా తనవిధము దెలియనా ॥ అడు ॥

కలది కలట్టేకాక కపటము నిజమచే
అలరి పీడెమిచ్చితే నందుకొంటిని
బలిమిఁ బైకొననంటా పలుమారు దూరీని
సిలుగుదాననా తనచిత్తము దెలియనా ॥ అడు ॥

యెప్పటికప్పుడేకాక యిఁక సంగతౌనచే
ముప్పిరిఁ దాఁ జూచితేను మొక్కితిని
యిప్పుడె శ్రీవేంకటేశుఁ డెనసియు నొసపడీ
తప్పించేదాననా తగవు దెలియనా ॥ అడు ॥ 276

రేకు 1347 మేఘరంజి

ఆతనిమనసు నేనే అన్నిటా నెఱుఁగుదును
ఘాత లెంతచూపినా కరఁగ దెంతైనా ॥ పల్లవి ॥

చెలులాల మీరు బుద్ధిచెప్పకురే పతికిని
వలపు వద్దనఁబోతే వదిఁబడును
తలఁచుక మాఇంటికి తనయంతనే రాని
తెలుపఁబోతే మంకు దేర దెంతైనా ॥ ఆత ॥

చేయివట్టి తియ్యఁగఁ జేరఁ జెలరేఁగి రమణుని
చాయ కొత్తితే గుణము చండిపడును
పాయక తానే వుండీఁ బట్టివచలమైతేను
పాయపుమదము మట్టుపడదు యెంతైనా ॥ అత ॥

అవిశము పైపైపెవి ఆనలెల్లఁ బెట్టకురే
పెనఁగితే ప్రియములు పిప్పిగట్టును
యెనసె శ్రీవేంకటేశుఁ డింతలోఁ దానె నన్ను
వెనకటివొందు యిఁక వింతగా దెంతైనా ॥ అత ॥ 277

ముఖారి

ఎమ్మెలు సేయఁగనేలే యేలుఁగాక
చిమ్ముగోరితాఁకులేలే చేకొమ్మఁగాక ॥ పల్లవి ॥

కమ్మల నవ్వినవాఁడు కాఁకలుపేయఁగనేలే
వన్నెతోనే మాయింటికి వచ్చుఁగాక
సన్నలుసేసినవాఁడు చలము సాదించనేలే
మన్నించి నాతోను మాటాడుఁగాక ॥ ఎమ్మె ॥

తప్పకచూచినవాఁడు తవివోవిడాగులేలే
కప్పురము నోటికిచ్చి కలయుఁగాక
కొప్పువట్టివట్టివాఁడు గుట్టువేసుకుండనేలే
కప్పినపయ్యెద దీసి కాఁగిలించుఁగాక ॥ ఎమ్మె ॥

చెలిమిసేసినవాఁడు సిగ్గులువడఁగనేలే
సొలసి రతుల చవి చూచుఁగాక
యెలమి శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁగూడె
వొలసినమోవితేనె లొపఁగుఁగాక ॥ ఎమ్మె ॥ 278

కురంజి

మానవునివోజలు మరి యెవ్వరు చెప్పినా
నానఁబెట్టి యేతుల నడపేవుగాని ॥ పల్లవి ॥

నయగారితనమున నాలి నీమాటలకేల
ప్రియమంది మోహించి బేలవైతివి
క్రియ యెఱఁగక నీవు కిమ్ములవారిఁ దెచ్చి
బయలీఁదింపుచు మముఁ బఱచేవుగాని ॥ మాన ॥

మతకారినవరసపుమచ్చిక నీమాయకే
ఇతవుగాఁ జైకొని యెడ్డవైతివి
చతురతలేక నీవు సరిగా నెవ్వతోఁ దెచ్చి
కుతిలపెట్టి గోరాదిగానేవుగాక ॥ మాన ॥

నటకారి నీమోవిచాయలనవ్వులకే
తటుకున విసుఁగూడి దంటనైతివి
నటన శ్రీవేంకటనాయక నీవాకెఁ దెచ్చి
కిటుకుదీర మొక్కించి కేరించేవుగాని ॥ మాన ॥ 279

సామంతం

ఎందున్నవి నీవిజాలు యేమాయ నేఁడు
ముందుముందే నీ కప్పటి మూరెఁడునోరు ॥ పల్లవి ॥

యెవ్వతెమాటలోకాని ఇప్పుడిట్టె వినవచ్చె
నివ్వటిల్లఁ బవళించె నీఇంటిలోన
దివ్వెవెలుఁగున నీద దిష్టముగఁ గానవచ్చె
నువ్వుఁబ్బూవ నాకె నలచున్నాఁడ నందువు ॥ ఎందు ॥

యెటువంటిదో కాని ఇదె వాసనలు వచ్చె
మటమాయదోమతెరమంచములోన
గటనఁ బన్ని రందుండి కాయవెలుగట్టి వచ్చె
ఇటు నాకెవయసు మీఁదె త్తితి నేనందువు ॥ ఎందు ॥

యెంతనేరుపరో కాని యెదురుగాఁ దానె వచ్చె
సంతైననీయురముపచ్చడములోన
ఇంతలోనె శ్రీవేంకటేశ వన్ను సేలితివి
పొంత నీయేకాంతము యెప్పుడు దాఁచనంటవు ॥ ఎందు ॥ 280

లాళి

ఏమి నవ్వులు నవ్వేవు యెరఁగా సతిసము
తేమచెమటలు నిండె తెలివేటువయ్యా ॥ పల్లవి ॥

కోమలిని రమ్మంటా కొంగు నీవు వట్టితేను
మోము చూడఁగానే పోఁకముడి వీడెను
చేముంచి చేతఁ బట్టి(ట్ట?)సిగ్గువడె నంతలోనే
కామించి నీపచ్చడము గప్పరాదా యిపుడు ॥ ఏమి ॥

పెనఁగి చుట్టరికాన ప్రియము నీవు చెప్పఁగా-
ననువుగ నప్పటి పయ్యద జారెను
వొనర వేరొకచేత నొగిఁ బట్టి సిగ్గువడీ
తనివోవివేడుకతో తెలుపు మూయరాదా ॥ ఏమి ॥

చేయిచాఁచి రతికిని సేస నీవు వెట్టఁగాను
ఆయెడఁ జెంపపై తురుమటు జారెను
పాయక శ్రీవేంకటేశ పట్టరాక సిగ్గువడీ
యీయెడఁ గాఁగిటఁ గూడి ఇట్టె వుండు మేఁకను ॥ ఏమి ॥ 281

ఆహిరి

చాలుఁజాలు విఁకనేల జాలిఁబెట్టేవు
యేలాటాలు యేనుగతో నింత నేరఁగలమా ॥ పల్లవి ॥

తగవులే నడపేవు తారుకాణకే వచ్చేవు
జగడము సాదించితే సారె నవ్వేవు
మొగము చూచితేను ముంచి యానలు వెట్టేవు
యెగసక్కెఁడవు నీతో నింత నేరఁగలమా ॥ చాలుఁ ॥

తేరకొనఁ జూచేవు తేనె లుట్టిపడించేవు
తారుచుఁ దిట్టితే జాణతనాలాడేవు
మారుమోమై వుండితేను మరియు వేఁడుకొనేవు
యీరీతివాఁడవు నీతో నింత నేరఁగలమా ॥ చాలుఁ ॥

కందువలే చూపేవు కాఁగిటనె కూడేవు
అంది వెంగెమాడితేను అట్టె మెచ్చేవు
ఇందరిలో శ్రీవేంకటేశుఁడ నన్నేలితివి
యిందరివాఁడవు నీతో నింత నేరఁగలమా ॥ చాలుఁ ॥ 282

రేకు 1348 శ్రీరాగం

పిలువవే ఇఁకనైనఁ బ్రియుఁ డితఁడే నీకు
పొలుపునఁ బాయరానిపొం దెంచవలదా ॥ పల్లవి ॥

అతిమోహములవారు అలుగఁగఁజెల్లునా
ఇతవుగ వేఁడుకొనే దింపౌఁగాక
ఇతరకాంతలకుఁగా నితనినేల కోపించ
పతి కిచ్చకములాడేపాది యెంచవలదా ॥ పిలు ॥

చేతికిలోనైనవారు సిగ్గువడఁదగునా
 కాతరానఁ బైకొంటే కందువగాక
దూతికపొందులకుఁగా దూరనేల రమణుని
 నీతైనమొగనిసేవ నీ వెంచవలదా ॥ పిలు ॥

నేసవెట్టినవారికి చిదుముడి పొసఁగునా
 వేసరనికూటములే వేడుకగాక
శ్రీసతివి గూడితివి శ్రీవేంకటేశ్వరుని
 ఆస విన్నెలినవాని నట్టె మెచ్చవలదా ॥ పిలు ॥ 283

హిందోళం

[1] ఏవీ(దీ?) నీయందుఁ జూపు ఇందులో నొకటైన
 ఆదిగాని విన్ను మెచ్చే నప్పుదే నేను ॥ పల్లవి ॥

తప్పక వలపులెల్ల తలకెక్కినప్పుడు
 కప్పురమే నోటికి కారమై తోఁచు
వుప్పటిల్లుమదనాగ్ని వొదల రేఁగినపుడు
 అప్పటి పన్నీరు వుడుకై తోఁచును ॥ ఏలీ ॥

కందువైనకాంక్షలు కన్నులఁదొట్టినప్పుడు
 గందమే బాసటమై కమ్ముకొనును
మందలించి తమకము మనసునిండినప్పుడు
 విందుల నమృతమైనా వెగటై తోఁచును ॥ ఏలీ ॥

చిగిరింపుఁజింత చేయి చెక్కిట మోపినపుడు
 మొగిఁ గొప్పువిరులెల్లా మొనలై విక్కు
విగిడి శ్రీవేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
 నగిన నగవులెల్లా వనుపులై మించును ॥ ఏవీ ॥ 284

1. ప్రాసభంగము.

ఆహిరి

ఆనతీవయ్యా నాకు నన్నియు వినేఁగాని
మోనముతో సిగ్గువడి మొక్కక వుందానను ॥పల్లవి॥

చెలులచే విన్నపము సేయించినమాటలు
తలఁగ కెప్పుడు నీచిత్తాన నున్నవా
వలపు రొమ్ములబంటి వాసులు యీఁతలబంటి
పలుకఁగ సిగ్గువడి భ్రమతో నుందానను ॥ఆన॥

కానుకగా నీకంపినకందువైనగురుతులు
తానకమై బండారాన దాఁచివున్నవా
నానెను జవ్వనమెల్లా నవ్వులు మొలకలెత్తె
పూని యంట సిగ్గువడి పొంచుకవుందానను ॥ఆన॥

ఇంపులసన్నలనే యెచ్చరించినచేఁతలు
ముంపులై యిప్పుడు నీమోవి నున్నవా
వింపుల శ్రీవేంకటేశ నీమోవినే మరుముద్ర-
గుంపు నిన్నుఁగూడి సిగ్గు గుఱుతై వుందానను ॥ఆన॥ 285

వేళావళి

నెరవాదిరమణుఁడ నీదే భాగ్యము
సారిమ నీకందరు సొక్కులైవున్నారు ॥పల్లవి॥

గరగరనియాఁటది గడుఁజేసూటై యుండితే
వరుసఁ గూడేటిమొగవానిభాగ్యము
ఇరవున యిటుగాక యెరవెరవై వుండితే
పరగ నందుకంటె పాపములేదు ॥నెర॥

చక్కవిరమణి రతిచవులు పుట్టించఁగాను
చొక్కమై కూడేటిసరసువిభాగ్యము
వెక్కసము యిటుగాక విరసాలు నెరపితే
పక్కన నందుకంటె పాపములేదు ॥ నెర ॥

పాయపుదానను నీపాదాలసేవ సేయఁగ
నీయందే మెచ్చఁగలిగె నీభాగ్యము
యీయెడ శ్రీవేంకటేశ యిటుగాక మరెవ్వరు
పాయుమన్న నందుకంటె పాపములేదు ॥ నెర ॥ 286

భైరవి

నేరనివారము మాకు నేరుపవయ్యా బుద్ధులు
మేరమీరి మాయంతనే మెప్పించఁగలమా ॥ పల్లవి ॥

వంతువాసులు పుట్టించి వనితల రప్పించి
సంతవలపులు రేఁచి జాజరాదేవు
బంతికూటివార మింతే పందెలువేసి నే మంత
దొంతులపొందులు చేసి తోడుచూపఁగలమా ॥ నేర ॥

వొక్కరికొక్కరు చూడ వొడివట్టి పెనఁగుచు
జక్కవచన్నులు ముట్టి జాజరాదేవు
ప్రక్కనుండేవార మింతే బలిమిసేసి నే మంత
పిక్కటెల్లేనీమోవి పిప్పిసేయఁగలమా ॥ నేర ॥

ఆయము లిందరి కంటి ఆసలెల్లాఁ బుట్టించి
చాయల సన్నలనే జాజరాదేవు
యీయెడ శ్రీవేంకటేశ ఇటు నన్ను నేలితివి
నోయఁగానఁ గొపరుచు నొలయఁగఁగలమా ॥ నేర ॥ 287

గౌళ

నే నెప్పుడు నెఱఁగుదు నీగుణాలు
కానీలే పనులకు తార్కాణలు గావలదా ॥ పల్లవి ॥

చేకొని చెమటలెల్లా చెక్కులనే కారఁగాను
ఆకెకు మోహించనంటా నానవెట్టేవు
నీకు నీబొంకులెల్లాను నిజముపలె నుండితే
వాకునఁ జూచినయట్టివారు మెచ్చవలదా ॥ నేనె ॥

ముంచినవిట్టూర్పులు ముక్కుకొన నుండఁగాను
అంచె నాకెఁ గూడనంటా నానవెట్టేవు
యెంచఁగ నీకపటాలు యియ్యకోలు నీకైతే
పొంచి పొగుడువారెల్లా పొగడఁగవలదా ॥ నేనె ॥

పోసరించి మేనిమీఁద పులకలు విందుండఁగా
ఆసపడ నాకెకంటా నానవెట్టేవు
రాసికెక్క శ్రీవేంకటరమణ నన్నేలితివి
నేసవెట్టినాకె కివి నెలవు గావలదా ॥ నేనె ॥ 288

రేకు 1349 దేసాళం

ఇంకనేల యీసుద్దు లెందాఁకాను
సంకె దీరె నన్నిటాను చలివానె నీకును ॥ పల్లవి ॥

పిలిచి పెక్కుసతుల పెండ్లియాడితివంటా
చలము సాధించేనా సారెసారెకు
తెలివిఁ జెక్కుల గోరు దీఇంచుకొంటివంటా
నెలకొన్న నిను నేఁడు నేరము లెంచేనా ॥ ఇంక ॥

తచ్చన కెవ్వతెచ్చిరో దట్టిగట్టుకొంటివంటా
మచ్చరించేనా నీతో మాటిమాటికి
మెచ్చుల కాపెనొమ్ములు మెడఁబెట్టుకొంటివంటా
తుచ్ఛములాడి నీపై దూరుగట్టేనా ॥ ఇంక ॥

ఆవపడి వాడవారి నట్టె చూచితివంటా
బావగొనేనా నిన్నుఁ బలుమారును
వేనవెట్టి కూడితివి శ్రీవేంకటేశ నన్ను
చేసినచేఁతలకెల్ల సిగ్గువరచేనా ॥ ఇంక ॥ 289

వరాళి

ఇటమీఁద నతి విన్ను నేమి సేసునో
తటుకున మీఁదవెత్తు తలఁచుకో యిపుడు ॥ పల్లవి ॥

తెలవ కన్నుల నిద్రదేరేది మానిపేనంటా
మఱి చన్నులు పిసికి మలసితివి
జలసి యందుకుఁగాను జంకించె ఆకెఁ(కె?) దిట్టితే
తఱి పూవులచెండునఁ దాఁకవేసే విదివో ॥ ఇట ॥

వవితయలఁతపరవశము మాసిపేవంటా
కొనగోర చెక్కు చురుకున నూఁదితి
పెనచి యందుకు నాకె బిగియించి పట్టితేను
మొనసి యట్టె కప్రములు చల్లీవిదివో ॥ ఇట ॥

ఇంతి విన్నుఁ గూడినచొక్కట్టె మానిపేనంటా
కాంతకెమ్మోవిమీఁద గంటిసేసితి
చెంత నందుకుఁగా నవ్వె శ్రీవేంకటేశ విన్నాకె
పంతాన పన్నీరు పైపైఁ జల్లే విదివో ॥ ఇట ॥ 290

సాళంగం

కానవచ్చె నీగుణాలు కలవెల్లాను
నానవేసేవు పొందులు నవ్వుతానే యిపుడు ॥పల్లవి॥

నెట్టుకొన్న మోహమైతే నిన్న రాకవుందువా
వెట్టికిఁ గాఁగా నేఁడు విచ్చేసితివి
చుట్టమవై తే నీవు సుద్దులు చెప్పుదువా
బట్టబాయ లీఁదించేవు పనిలేనిపనికి ॥కాన॥

ఆయములు గరఁగితే నప్పుడే కూడవా
కాయకము గాఁగాను కాఁక చల్లేవు
చేయంకెకు వచ్చితేను సిగ్గులువడుదువా
మాయలెల్లాఁ జేసేవు మనసుపట్టలేక ॥కాన॥

వేడుక గలిగితేను విడెము చేతికియ్యవా
యీడుజాడ గాఁగాను యెమ్మెనేసేవు
పాడితో శ్రీవేంకటేశ పైకొని నన్నేలితివి
జోడుగూడ మన్నించేవు సొంపులెల్లా రేఁగను ॥కాన॥ 291

భైరవి

చాలదా నా కీభాగ్యము సతమాయను
కాలుదొక్కినప్పుడే కావిమ్మంటిఁగదవే ॥పల్లవి॥

మాఁటలు సారె నాడితే మందెమేళమయ్యీని
యేఁటికే గుట్టున నుందే దిది మేలే
చీకటి మాటికినేల చేరి యానలువెట్టినే
చాటించి తొల్లి తనకు సతినై తిఁగదవే ॥చాల॥

చూపులు చూడఁజూడఁగ చులకఁదనములౌను
యేపున మాటున నుండు టిది మేలే
తోపునూకఁడు సేసుక తొంగి యేల చూచీనే
వోపి తొల్లె సేసపెట్టి వుందానఁగదవే ॥ చాల ॥

నవ్వులు సారె నవ్వఁగ నసుపు మొగచాటయ్యీ
యవ్వలఁ గాఁగిట నుంచె నది మేలే
రవ్వలేల సేసీనే రతి శ్రీవేంకటేశుఁడు
వువ్విళ్లూర దేవులనై వొప్పుగొంటిఁగదవే ॥ చాల ॥ 292

మాళవిశ్రీ

ఇట్టిపతితో వేసా లిఁక నేలే
చుట్టరికములే నీతోఁ జూచుకొనఁగదవే ॥ పల్లవి ॥

చెక్కులు నొక్కఁగాను చేయివట్టి తియ్యఁగాను
యెక్కుడుగాఁ బెనఁగేవు ఇది యేమే
యిక్కువ లంటఁగాను ఇయ్యకోళ్లు సేయఁగాను
మొక్కు మొక్కి కరఁగవు మంచి నీవ దేమే ॥ ఇట్టి ॥

మంచిమాట లాడఁగాను మచ్చికలు చూపఁగాను
యెంచుకొనేవు నేరే ఇదియేమే
కంచపుమోవియ్యఁగాను కాఁగిలించుకొనఁగాను
ఇంచుకంత నవ్వు నవ్వి యెనయు విదేమే ॥ ఇట్టి ॥

పంతము లియ్యఁగాను బాసలెల్లఁ జేయఁగాను
యెంతైనాఁ గొసరేవు ఇదియేమే
వింతగా బుజ్జగించి శ్రీవేంకటేశుఁ డేలె విన్ను
దొంతిరతిఁ దనియవు తోడనే ఇదేమే ॥ ఇట్టి ॥ 293

లలిత

నీ నెఱఁగవా ఇంత నెరజాణవు
భావించి నవ్వంగానే పంతములాడు సురా ॥పల్లవి॥

చిత్తగించవమ్మా చెలి; నీవు చూచుదాఁకా
తత్తరించీ రమణుఁడు ;తలవంతురా
కొత్తలేఁటికమ్మా కొలువులోపల ;నీపై
బత్తితోడఁ బిలువఁగఁ బలుకకుందురా ॥నీవె॥

అందుకొనవమ్మా అతఁడు వీడెము చేత-
నందియ్యఁగాఁ జేకొనక అట్టె వుందురా
మందట లేలమ్మా మనసిచ్చి తనమోవి-
విందు నీకుఁ బెట్టఁగాను వీఁగుచు నుందురా ॥నీవె॥

మెచ్చు మెచ్చవమ్మా మేకొని శ్రీవేంకటేశుఁ-
డచ్చముగా నిన్నుఁ గూడె నలఇంతురా
తచ్చనేఁటికమ్మా తగినరతుల నీతో
మచ్చికలాడఁగాను మరపింతురా ॥నీవె॥294

రేకు 1350 శుద్ధవసంతం

ఎదురుబడి వలపు లిట్టుండవలదా
ముదురుఁబరువముతో మునుకొని వివిగో ॥పల్లవి॥

సిగ్గులనే తెర వేసి చిరునవ్వుఁదలఁబాలు
అగ్గలము నీపైఁ జల్లీ నతివ
వెగ్గళించి నీపై నవి చెమటముత్యాలై
దిగ్గన వలువంకల దిగుపారీ నవిగో ॥ఎదు॥

తీపుమోవి లిం(విం?)దువెటి తెలిగన్నులతేటల
చూపులవిడేలు వెట్టీ సుదతి
పైపై యవే సిమేనఁ బచ్చిపులకమోసులై
మోపులకొలఁదులతో ముంచుకొని నవిగో ॥ ఎదు ॥

కాఁగిటనే పీఁటవెట్టి కడుంతుల వేడుకఁ
బాఁగుచునుఁ బెండ్లాడీ పడఁతి
చేఁగలై యవే శ్రీవేంకటేశ్వర
దాఁగనిమరుకళలై తమిరేఁచి నవిగో ॥ ఎదు ॥ 295

మాళవిగౌళ

ఏమీ నవఁగఁజాల మింత నిన్ను
దీమసాన నీకునీవే తెలుసుటగాక ॥ పల్లవి ॥

కలికి వలచెనంటా కదల నాడుకొనేవు
నెలకొన్ననీమాఁటలు నికే మెచ్చు
అలయింతురా మరి యంత సేసినవాఁడవు
నలఁగకుండాఁ బొందునడపుటగాక ॥ ఏమీ ॥

అప్పటి నవ్వు నవ్వేవు అందవాయదంటాను
నెప్పున నీచేఁతలు నీకే మెచ్చు
కొప్పువట్టి తీతురా గోమునఁ బెంచినవాఁడ-
వొప్పురతుల మెల్ల నే వోలార్చుటగాక ॥ ఏమీ ॥

సారె నిన్నుఁ గూడెనంటా సన్నలుసేసి చూపేవు
నేరుపు లిన్నియు నివి నీకే మెచ్చు
జీరదీతురా యిట్టె శ్రీవేంకటమేలేవాఁడ-
వోరలేక యిచ్చకమై వుండుటగాక ॥ ఏమీ ॥ 296

బౌళి

ఉండనీవే తానెట్లనుండినాను నే నిమ్మ-
పండు గానుకిచ్చితేను పనులెల్లా నౌను ॥ పల్లవి ॥

యెఱఁగనిపొందుల యెక్కడోవారికినైన
జఱఁగఁ బొఁ(బొం?)దైతేనే చవిపుట్టును
మఱచి మమ్మదముతో మాఁకువలె నుండినాను
గుఱిగా గోరునోఁకితే కోరికలు రేఁగును ॥ ఉండ ॥

అగ్గలమై యించుక మోహములేనివారికైన
దగ్గరఁ గూచుండితేనే తమి రేఁగును
సిగ్గువడి తలవంచి చెక్కుచేతిలో నుండిన
వొగ్గి మాటలాడితేనే వొడఁబడు మనసు ॥ ఉండ ॥

అక్కజపువొట్లతో నలిగినవారికైన
చక్కఁజూపి నవ్వితేనే సమ్మతులౌను
యిక్కువెఱిఁగి శ్రీవేంకటేశుఁ డిటు నన్నుఁ గూడె
మొక్కిననామొక్కులెల్ల ముద్దులై తోఁచును ॥ ఉండ ॥ 297

రామక్రియ

ఇప్పుడుగా నీవు నాకు ఇచ్చకము సేసేవు
అప్పుడైతే నింతేసి అనువుకు వత్తువా ॥ పల్లవి ॥

చలము సాదించేవేళ సరసునితోడను
పలికినపలుకెల్ల పంతములౌను
యెలమి నీలాగెరిఁగి ఇందుకే వూరకుండితి
మలసి నీవంతలోనే మఁచివాఁడవైతివి ॥ ఇప్ప ॥

---

[1]క్రీగీత గలది చిలుమూరివరి.

గోరబుసేసేటివేళ గోర గీరి యేపాటి-
సరసములాడినాను సారెంపులౌను
ధరలో నీజాడెరిఁగి తలవంచుక వుంటిని
మరిగి నీవంతలోనే మంచివాఁడవైతివి ॥ ఇప్పు ॥

సిగ్గులువంచేవేళ శ్రీవేంకటేశ్వర నీ-
దగ్గరఁ గూచుండినాను తమకమౌను
వొగ్గి నీగుణ మెరిఁగి వొట్టుకై నన్నుఁ గూడితి-
మగ్గపురతులవేళ మంచివాఁడవైతివి ॥ ఇప్పు ॥ 298

నాదరామక్రియ

నేసపాలవారము చెల్లుబడి గల -
తాసువలె రతుల కిద్దరము నున్నారము ॥ పల్లవి ॥

మఱవదు మనసు మరి నీవాడినమాట
గుఱుతై మనసులో గుబ్బతిలీని
మఱి తెరమఱఁగె తే మంచివయ్యా నన్నియును
తఱియైన పనొ(?)ల కిద్దరము నున్నారము ॥ నేస ॥

పాయదు [1]నెఁ(నెం?)జెరివి పంతపు నీచేఁతలకు
చేయంటినజిడ్డులై చిమ్మిరేఁచీని
మూయికి మూయున్న దింతే మూసివాఁచితి నీకు
దాయిదండై వేడుక కిద్దరము నున్నారము ॥ నేస ॥

పిడువదు ఆసా టెఁ(ఎం?)త నీకూటములకు
వుదివోవవలపులై వుమ్మగిలీని
చెదవిమేలై న దింతె శ్రీవేంకటేశ యెప్పుడు
తదయవిమొక్కుల కిద్దరము నున్నారము ॥ నేస ॥ 299

1. 'వెంజెలి' కి రూపాంతరమా? క్రిగీతలు గలవి చిలుమూరివవి.

సామంతం

నీకివి ప్రియములు నే నెఱుఁగుదును
జోకలాయ మెచ్చుము సతినయ్యా ॥పల్లవి॥

పొలపుఁజూపులలో బొమ్మలజంకెలు
సళుపుఁబ్రియములలో సాదింపులు
పలుసరసములలో పంతపుసణుఁగులు
చెలి నెరపీ నదె చేకొనవయ్యా ॥నీకి॥

మక్కువపొందులలో మందెమేళములు
మొక్కులలో గోరమొన వాఁడ్లు
చొక్కుమాటలలో సొలపులకొసరులు
మిక్కిలి జరపీ మెఱఁగానవయ్యా ॥నీకి॥

తఱితీపులలో తమకపుటాసలు
చిఱునవ్వులలో సిగ్గులును
నెఱితో శ్రీవేంకటనిలయ నిన్నెనసీ
మఱియు నాపె నెనరు మన్నించవయ్యా ॥నీకి॥ 300

రేకు 1351 మంగళకౌసిక

తగవు తానె యెఱుఁగు తాఁ జేసినచేఁతకు
చిగురునవ్వులు రేఁచె చెక్కుచేతివెలిఁ ॥పల్లవి॥

కొప్పు దువ్వుమనఁగదే గుబ్బలు గూడఁ జెలికి
ఇప్పుడే తాఁ బానుపుపై నంతసేసెను
దప్పికిఁ బన్నీరును తానె ఇమ్మనఁగదే
చప్పిరిగా నలసించె మొక్కఁగానే చెలిని ॥తగ॥

వీడె మిమ్మనఁగదవే వెస నిచ్చకముగాను
యీడఁ దెరమఱఁగున నింతసేసెను
వాడువిడువ సురటి వడి విసరుమనవే
జోడై విట్టూర్పులు రేఁచె చూడఁగానే చెలివి ॥తగ॥

గంద మిమ్మనఁగదవే కాఁగిట శ్రీవేంకటేశుఁ –
డిందుముఖిఁ జెమరింప నింతసేసెను
కందువాయ మోవికే కప్పుర మిమ్మనఁగదే
అంది కళలెలా రేఁచె నంటఁగానే చెలిని ॥తగ॥ 301

బౌళి

ఆతఁడుచేసినభాగ్య మది యెట్టిదో
చేతికి వచ్చినమేలై చెంతలనే నిలిచె ॥పల్లవి॥

చెలి నీవు పతితోడ సెలవి నవ్వేనవ్వు
వెలయు నాతనిమతి వెన్నెలగానె
నిలిచి కన్నెదురను నీవుండి(?)భావము
తలకొన్నముంగిటనిదా(ధా?)నమై నిలిచె ॥ఆతఁ॥

జాఱకుండా రమణునిఁ జక్కఁగఁ జూచినచూపు
మీఱి యాతనిమేనిపై మెఱుఁగులెక్కె
వేఱులేక నీవిప్పుడు వీడెమిచ్చినభావము
ఆఱడితో మదనుని అడపమై నిలిచె ॥ఆతఁ॥

తోడనే శ్రీవేంకటేశుతో నీవాడినమాటలు
జాడ నాతనిచెవులకు చవులు మించె
కూడితివి యింతలోనే కూరిమి నీరతి యిదె
పాడితో యింటిలోపలిబండారమై నిలిచె ॥ఆతఁ॥ 302

## పాడి

మందెమేళమై నీవు మన్నించరాఁగాను
యెందుకని విన్నవించే నీడ నుండేనయ్యా ॥ పల్లవి ॥

మంతనములాడఁగానే మరి దగ్గరవచ్చునా
ఇంతటనుండేదే మేలు ఇద్దరికిని
చెంతల నప్పటి నిన్ను చేఇ దాఁకించవచ్చునా
వింతలుగా నాకు నీవు విడెమియ్యఁగాను ॥ మందె ॥

నవ్వులు మీరు నవ్వఁగా నడుము చొరవచ్చునా
వువ్విళ్లూర గుట్టుతోడ నుండుదే రీతి
జవ్వనమదమునోఁ చన్నులంటించవచ్చునా
పువ్వులు ముడువుమని పొందుసేయఁగాను ॥ మందె ॥

ఇట్టె మీరు గూడుండఁగ నెలిఁగించుకోవచ్చునా
చుట్టుక మీవారమై మెచ్చుటే మేలు
రట్టుగా శ్రీవేంకటేశ ఇట్టె యాడుకోవచ్చునా
గట్టిగా నెందుకు నీవు సన్న సేయఁగను ॥ మందె ॥ 303

## హిజ్జిజి

మానవచ్చునా నీవు మన్నించఁగా
సేనలుగా సేవలు సేసేమయ్యా ॥ పల్లవి ॥

పెనఁగఁగవచ్చునా ప్రియపడి నీవు రాఁగా
కినియఁగవచ్చునా కేలు చాఁగఁగ
అనుమానించవచ్చునా ఆయము నీవంటఁగాను
చెనకి నీ చెప్పినట్టు సేసేమయ్యా ॥ మాన ॥

కసరఁగవచ్చునా కప్పురము నీ వియ్యఁగ
కొసరఁగవచ్చునా కూడేనవఁగ
విసుగఁగవచ్చునా వేఁడుకతో మాటాడఁగ
పసలుగా విన్నదై పాయకుండేమయ్యా ॥ మాన ॥

తలవంచవచ్చునా తప్ప కిట్టై చూడఁగాను
చలపట్టవచ్చునా చౌలు చూపఁగ
యెలమి శ్రీవేంకటేశ ఇట్టై నన్ను నేలితివి
కలకాఁ మును నిన్నుఁ గడుమెచ్చేమయ్యా ॥ మాన ॥ 304

మధ్యమావతి

మాతో నేఁటికి నీవు మరిఁ బంతాలాడేవు
ఆతలివారినే యిఁక ననరాదా నీవు ॥ పల్లవి ॥

పన్నుక నీచెక్కులపై పచ్చిచేఁతలతో వచ్చి
నన్నుఁ దప్పకచూచేవు నగితివంటా
యెన్నికమీరఁగ నేఁడు యింత సేసినఆపెను
వన్నెలుగా నటు దూరవద్దా నీవు ॥ మాతో ॥

కుంకుమపూఁతచన్నులగుఱుతులతోనే వచ్చి
సుంకుమోవఁ దిట్టేవు చూచితివంటా
కంకిగా విన్నింతారడిగాఁ జేసినాపెను
వంకలొత్తి నాదించవద్దా నీవు ॥ మాతో ॥

పేరిచిననీమోవిపిడుచలతోనే వచ్చి
మేరమీరి తిట్టేవు మెచ్చితివంటా
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్నాపెను
వారించక బుద్ధిచెప్పవద్దా నీవు ॥ మాతో ॥ 305

నాదరామక్రియ

ఎందాఁకా మంకుఁదన మింత గలదా
విందుచెప్ప నాతఁడు వేడుకపడీని ॥ పల్లవి ॥

చలపాదితనమేల సరసములాడఁగదె
అలరి వేడుకపడీ నాతఁ డందుకు
తలవంచుకుండ నేల తప్పకచూడఁగదవె
నెలవున నీమొకమై నిలుచునాఁ(న్నాఁ?) డతఁడు ॥ ఎందాఁ ॥

పంతము లింతలోనేల పట్టఁగదవే విడెము
వింతగాఁ దమకించీని విభుఁ డిందుకు
చింతతో నుండఁగనేల చిమ్మిరేఁగి నవ్వఁగదె
చెంతనే కాచుకుండి చెలఁగీ నతఁడు ॥ ఎందాఁ ॥

సిగ్గులువడఁగనేల చేకొని కూడఁగదవె
వెగ్గళించీ శ్రీవేంకటవిభుఁ డిందుకు
తగ్గవియ్యాసోదమేలే తవిసి మెచ్చఁగదవే
నిగ్గుల నిన్నేలి మేలు నిండించీ నతఁడు ॥ ఎందాఁ ॥

రేకు 1352 వరాళి

వినఁగదవే చెలులపిన్నపము లింకనైన
మనసిచ్చి నీకాతఁడు మరిగినాఁ డిపుడు ॥ పల్లవి ॥

సిగ్గులకుఁ దుదయేది చేయి చాఁచఁగదవే
వొగ్గి విడిమిచ్చీ నాతఁ డొడిఁబెట్టుక
కగ్గివున్న దెల్లఁ దేరె కన్నుల మొక్కఁగదవే
అగ్గలమై నీకు నాతఁ డాసపడీ నిపుడు ॥ వినఁ ॥

గుట్టునేయ నెడయేది కొంగు వొడ్డఁగదవే
వొట్టి సొమ్ములిచ్చి నాకఁ దొడిఁబెట్టుక
చిట్టకములెల్ల మానె చెవియొగ్గఁగదవే
[1]అగ్గలమై(అట్టియగా?) నీకు నాతఁ డాసపడీ విపుడు ॥వినఁ॥

తప్పించుకోఁ బనిలేదు కొప్పు వంచఁగదవే
వొప్పుగఁ బువ్వులు వించీ నొడిఁబెట్టుక
తప్పు లిన్నియునుఁ బాపె తగిలి మోవియ్యఁగదే
ఇప్పటి శ్రీవేంకటేశుఁ డేలె నిన్ను విపుడు ॥వినఁ॥ 307

దేశాక్షి

ఏమేమి నీవు నేసినా వింపే నాకు
యీమేకులకు నే లోనే యిఁకనేల సిగ్గులు ॥పల్లవి॥

మూసీఁ దనచేత నోరు మునిమునినవ్వు రాఁగా
నేసినచేఁత నీవే చెప్పుకొనఁగ
ఆసుద్దులు వినవేడుకయ్యీ నాపెచేత నాకు
యీసరిఁ గూచుండఁబెట్టు మిఁకనేల సిగ్గులు ॥ఏమే॥

విట్టదూపులమఁ జూచీ విన్వేరగు గాఁగాను
నెట్టన నీవిజములు నెరపఁగాను
గట్టిగా నడిగేను విక్కము నాపెను నేను
యెట్టైనా తప్పించు నీ కిఁకనేల సిగ్గులు ॥ఏమే॥

మెచ్చీఁ దనవేలను మేనెల్లఁ గళలుబ్బఁగ
చెచ్చెర నన్ను నేయఁగ శ్రీవేంకటేశ
తచ్చి వన్నెలితి విది తలపోసే నాపెతోడ
యిచ్చకములెల్లఁ జూపు మిఁకనేల సిగ్గులు ॥ఏమే॥ 308

1. ప్రావతంగము.

మేచబౌళి

ఇందాఁకావలెఁ గాదు యిదేమి నీవు
సందుగొవి సారెసారె సరసమాడేవు ॥ పల్లవి ॥

నీమాట సరివచ్చెనో నీ వేమి దలఁచితివో
నామోము చూచి యిట్టె నవ్వు నవ్వేవు
కాముఁడు మరి యేసెనో కాంతలమాట వింటివో
గోమునఁ బెంచినచమ్మఁగొండ లంటేవు ॥ ఇందాఁ ॥

ఇచ్చకములు చూపేవో యెగసక్కెము చేసేవో
మచ్చికచేయుచు నాతో మాటలాడేవు
ముచ్చటాడెనో కీరాలు మోహము నీకుఁ బుట్టెనో
పచ్చితేనెమోవికి పైకొనేవు ॥ ఇందాఁ ॥

వన్నెలు చూపవలెనో వాడికలు సేసేవో
కన్నులఁ దప్పకచూచి కాఁగిలించేవు
వెన్నెలచంద్రుఁ దేఁచెనో వేడుకో శ్రీవేంకటేశ
మన్ననరతులకె మచ్చు చల్లేవు ॥ ఇందాఁ ॥ 309

ఆహిరినాట

ఆయనాయ రావయ్య అంగనవద్దికి నేఁడు
పాయపునీదేవి యింత బాఁతిపడఁగాను ॥ పల్లవి ॥

మాటలెవ్వి లేవు మాపుదాఁకా నాడితేను
కూటమి నీమన్నవలే గుఱుతుగాక
నే(నేఁ?)టనె తప్పెనా నీనేరుపులే పచరించ
అఁటది నీవిరహాన నట్లుండఁగాను ॥ ఆయ ॥

నవ్వు లెన్ని లేవు నముపులు జరపితే
యివ్వలఁ గరుణించుటే యెన్నికైగాక
రవ్వగా విందువంకనా రాజసము విలిపేది
జవ్వని నీయాసల లోఁగఁగాను ॥ఆయ॥

మొక్కు లెన్ని లేవు మోపులుగాఁ గట్టితేను
యిక్కువ పట్టి కూడిన దెక్కుడుగాక
నిక్కము శ్రీవేంకటేశ నీజాడ లిట్లానా
చక్కనమ్మ నీవొందు పారెఁ జేయఁగాను ॥ఆయ॥ 310

శుద్ధవసంతం

ఏల తమకించేవు యింతలోఁ దప్పిన దేమి
ఆలికిఁ బంపువేసితే నందరును నవ్వరా ॥పల్లవి॥

పంతములాడినయాకె పలుకకుండీనా
రంతులఁ దిట్టినయాకె రాకుంతునా
యింతలోనె నీవు లోఁగి యేల ప్రియాలు చెప్పేవు
కాంతకుఁ గిందుపడితే కిరవారు నవ్వరా ॥ఏల॥

మారుకొనివుండినాపె మాటలాడకుండీనా
కీరమాడినాపె ప్రేమ పెంచకుండీనా
ఆరీతి యిందుకువేల అట్టె కాఁతాళించేవు
కోరి సతికి బఁ(బం?)టైతే కొమ్మలెల్ల నవ్వరా ॥ఏల॥

అలుక దేరిసయాపె అట్టె కూడకుండీనా
కలపె విన్నాపె ఇఁకఁ గాదనీనా
మొలమి శ్రీవేంకటేశ యిట్టె నన్ను నేలితివి
తొలుతాపెకు మొక్కితే దొడ్డివారు నవ్వరా ॥ఏల॥ 311

శ్రీరాగం

ఇప్పుడే నీరమణుఁడు యెనసీ నిన్ను
చిప్పిలఁగ నప్పటిని సేదదేర్చవలెను ॥ పల్లవి ॥

నెలవంకచందురులు నీచన్నుపై నుండఁగ
పలుమారు విరహతాపములేలే
కలువరేకులు నీకన్నులై వుండఁగాను
చలిమందులవుపచారములేలే ॥ ఇప్పు ॥

మదనరేకలు నీకు మరి చెక్కుల నుండఁగా
అదన పువ్వుటమ్ముల కలుకనేలే
చెదరనికప్పురము నెలవుల నుండఁగాను
యెదుటనున్నకాఁకలు యేమి నేసీనే ॥ ఇప్పు ॥

మంచినచుక్కలు నీమోవిపై నిండివుండఁగా
యెంచి[1]పగలంటి నిద్దిరించేవేలే
అంచెల శ్రీవేంకటేశుఁ డంతలోనే నిన్నుఁ గూడె
ఇంచుకంతా చీఁకటి ఇఁకనేదదే ॥ ఇప్పు ॥ 312

రేకు 1353 సామంతం

నీచిత్తమే యెరుఁగు నెలఁతలలాగులెల్ల
యేచి నీమేన గురుతు లింత నించఁగలరా ॥ పల్లవి ॥

పంతములు నీతోను వలుమారు నాడఁగాను
యెంతటిదని చిత్తాన యెట్టుండునో
సంతలోకూటమువలె సతులెందరు గూడినా
వింతనే నీకరమున పూనై వుండఁగలరా ॥ నీచి ॥

1. పగటిపూట నిద్రించుటయా ?

వీరములు నీముందర బెట్టుగాఁ జూపఁగాను
యేరీతుల నీచిత్త మెట్టుండునో
వూరఁగూటములవారు వొద్ద నెంత వుండినాను
యేరా నీపీఁవుమీఁద నెక్కివుండఁగలరా ॥నీచి॥

నవ్వులు నీపై నిట్టె నయమున గుప్పఁగాను
ఇవ్వల నీచిత్త మెట్టుండునో
రవ్వగా శ్రీవేంకటేశ రతి నన్నుఁ గూడితివి
యెవ్వరు నావలె వురమెక్కి వుండఁగలరా ॥నీచి॥ 313

నారాయణి

మచ్చికగలపతివి మంచిదయ్యాని
ఇచ్చకము సేసుకొని యెనయరాదా ॥పల్లవి॥

చిగురుమోవితోడిచెలి మాటలాడితేను
వొనరై వుండక వేరే వుప్పసుండునా
యెగసక్కెలంటానేల యెగ్గుపట్టేవు
సగమందుఁ బంచదార చల్లుకోరాదా ॥మచ్చి॥

వసమై కెందామరలవంటికనుచూపులు
దెసల నెఱ్ఱనుండక తెల్లనుండినా
మొసఁగి కోపమంటాను యేల దూరేవు
పొసఁగఁ గప్రము గొంత పొదుపుకోరాదా ॥మచ్చి॥

సరుస కొండలవంటిచన్నులకాఁగిలి నీకు
ధర గట్లుగాక మెత్తన లయ్యీనా
యిరవై శ్రీవేంకటేశ యేలితి వింతలోనె
వురమునఁ బూదండ లొత్తుకోరాదా ॥మచ్చి॥ 314

దేసాళం

మొకదాకిరిదానను మొదల నేను
వెకలివైతివి యిట్టె వెలయవయ్యా ॥ పల్లవి ॥

తేనెగారీ నీమాటల తేటలూరీ నీచూపులను
ఆనుకొని యేమని ఆదే నిన్ను
నానుపుఁజెమటలను ననలైనపులకలు
సోనల నీమేన నివె చూచుకోవయ్యా ॥ మొక ॥

రసముబ్బీ నవ్వులను రాసివడీ మొక్కులను
దొసకులేమని దూరే నిన్ను
పసిమి మోముకళలు బచ్చనమైగుబుతులు
సుసరాన నీకునివే చూచుకోవయ్యా ॥ మొక ॥

చిగిరించీ సిగ్గులను చిమ్మిరేఁగీ వేడుకల
తగవుల నేమని తడవే నిన్ను
నిగిడి శ్రీవేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
సొగసులు నీకునివే చూచుకోవయ్యా ॥ మొక ॥ 315

మాళవిగౌళ

నీచలము నీకుఁ జెల్లె నేరుపులేల
చేచేత నీవంటఁగాను సిగ్గు లిఁకనేల ॥ పల్లవి ॥

మొగము చూచి నీకు మొక్కినయప్పుడే తొంటి-
జగడములెల్లఁ బాసె జంకింపులేల
చిగురుమోవి యెత్తి చేరి మాటాడినపుడె
పగయెల్లాఁ దీరె మరి పంతములేలా ॥ నీచ ॥

చనవు సేసుక నీసంగడిఁ గూచున్నప్పుడె
కినుకలిన్నియుఁ దీరె కేరడాలేల
వెనకి నీకు నేను సేవలు సేసినప్పుడె
వెనక కోపము దీరె వేఁడుకొననేలా ॥నీచ॥

తైవశమై విన్ను నేనుఁ గాఁగిలించుకొన్నప్పుడె
యేవలెల్లా ముగిసెను యెన్నికెలేల
శ్రీవేంకటేశ నీపై సేస నేఁ బెట్టినప్పుడె
చేవలు నిండె రతుల చిఱునవ్వులేలా ॥నీచ॥ 316

సింధురామక్రియ

నే విట్టె కొసరితేను నీ వెఱఁగేవా
కానుకలు చూపనేల కమ్మటి తీరములు ॥పల్లవి॥

చెంతలఁ గూడేయప్పుడే చెప్పేఁగాక బుద్ధి
పంతమాడనేల నీతో పలుమారును
మంతనమైనపుడే మహిమలు చూపేఁగాక
దొంతివెట్టనేల నీతో తోడనే గర్వములు ॥నేవి॥

పిడెమిచ్చేయప్పుడే వేడుక నేసేఁగాక
పాడివెట్టనేల నీతో బలిమి సేసి
యీడుజోడైనప్పుడే యెరుక నేసేఁగాక
కూడఁగట్టనేల నీతో గుంపెనసొలపులు ॥నేవి॥

నవ్వేయప్పుడే విన్ను నంటున మెచ్చేఁగాక
రవ్వ సేయనేల విన్ను రచ్చలోనను
యివ్వల శ్రీవేంకటేశ యేలితివి నన్ను విట్టె
వువ్విళ్లూరించఁగనేల వొక్కపరే యాసలు ॥నేవి॥ 317

తెలుఁగుఁగాంబోది

ఏల జోలిసేసేవు యెందాఁకాను
యీలీల నన్నివినోదా లింటిలోనే వున్నవి ॥పల్లవి॥

జలజాక్షి నవ్వులైతే చల్లి వెదలు
కలికితనములు పోఁకఋఁగఁబట్టెఁడు
విలువఁజక్కఁదనము విందుబందారు
కలిగె నీకు రావయ్యా కందువల విపుడు ॥ఏల॥

తరుణిపలుకులె తంగేడుజున్ను
వెరసేటివిన్నపము పెళ్లిచెట్టు
అరుదైనవలపెల్లా నట్టెకొటారు
దొరకె నీకు రావయ్యా తొడిఁబడ విపుడు ॥ఏల॥

వనితకాఁగిటిరతి వాదవిపువ్వు
తనివోనిమోవి దొంతరబోనము
యెనసితివి శ్రీవేంకటేశ యీకెను
వొనగూడీ రావయ్యా వొద్దికతో విపుడు ॥ఏల॥ 318

రేకు 1354 రీతిగౌళ

చెలువుని కిచ్చకమే సేయఁగదవే
అలుగుదురా వట్టిఅఱడిగా విపుడు ॥పల్లవి॥

పిలిచి తెచ్చినవేళ ప్రియము చెప్పఁగవలె
బలిమి చూపుదురా పతితోను
చెలిమిసేసేటివేళ చెక్కులు నొక్కఁగవలె
చలము సాదింతురా సంగతిగా దిపుడు ॥చెలు॥

తొయ్యలి పేసవెట్టితే తొలుతటిదాన నేను
గయ్యాళించి యాతని గాతనేసేనా
ఇయ్యకొని మొక్కితేను ఇందుకులోనే నేను
కొయ్యతనమున రేఁగి కొంగంటఁగలనా ॥అని॥

కొమ్మ నీవు గూడితేను కుడిపక్కదాన నేను
రమ్మని శ్రీవేంకటేశు రచ్చవేసేనా
ఇమ్ములఁ గలిపితివి ఇందుకులోనే నేను
యెమ్మెల కాతనితోడ యెదవాయఁగలనా ॥అని॥ 415

నారాయణి

కామిని విధానమై కలిగె నీకు
నేమెల్లాఁ బొగడఁగా నీదివో బదుకు ॥పల్లవి॥

మొగము చూచి నవ్వి మొనగోరు దాఁకించి
చిగురుమోవితేనె చిమ్మరేఁగఁగా
వొగరుమాట లాడి వొడివట్టితినె నాపె
నెగడినజాణఁడవు నీదివో బదుకు ॥కామి॥

విరులదండ వేసి వేడుకతో సన్న సేసి
పరగ నీమీఁదటిపాటలు పాడి
పరిమళములు పూసి బలిమితోఁ బెనఁగె
విరతి నెరజాణవు నీదివో బదుకు ॥కామి॥

నిడెము చేతికిచ్చి వీఁపుమీఁదఁ జేయివేసి
వాడుదేరఁ గూడె నాపె వన్నెలువేసి
యీడనె శ్రీవేంకటేశ యెనయించె నన్ను నీతో
నిదమందే సుకించేవు నీదివో బదుకు ॥కామి॥ 416

రామక్రియ

నేము నీ కితవైనట్టే నేరుచుకొనేమయ్యా
మోము చూచి మంచితనములకు లోఁగావు ॥పల్లవి॥

వొక్కమాటే యాపె నీతో వుద్దండాలు నేసినేసి
మొక్కలానఁ దిట్టితేనే మోహింతువు
వెక్కసాన నేమెంత వినుతులు నేసినాను
కక్కసమేగాని మతి గరఁగదు ॥నేము॥

వాసిరేఁచుకొని యాపె వచ్చినప్పుడే విన్ను
చేసోఁక నవ్వితేనే చెలఁగుదువు
సేసవెట్టి నేమెంత సేవలెల్లాఁ జేసినాను
ఆసలు పైపైనేకాని ఆయములు సోఁకవు ॥నేము॥

అట్టుగా నాపె కాఁగిట నట్టె రసము లొలుక
చుట్టి పట్టి కూడితేనే చొక్కుదువు
యిట్టె శ్రీవేంకటేశ యితవుగా నేఁ గూడితి
గట్టిప్రియములేకాని కాదనఁగఁజాలవు ॥నేము॥ 417

వరాళి

మంకుఁదన మేమిటికి మగువలకు
అంకెకు వచ్చి యిచ్చకమాడరాదా యిపుడు ॥పల్లవి॥

నగేటివతితో మాకు నగక వుండితేను
యెగసక్కెమై వుండదా యెవ్వరికైనా
వెగటేమి గలిగినా వెనక సాదింతుగాని
మొగము చూపి చేయెత్తి మొక్కరాదా యిపుడు ॥మంకుఁ॥

పలుమారుఁ బిలువఁగఁ బలుకకవుండితేను
అలిగినట్టుండదా అందరికిని
మలసి నీచలమెల్లా మాపు చూపుదువుగాని
యెలమిఁ జేతికి నీడెమియ్యరాదా యిపుడు ॥మంకుఁ॥

ఆతఁడు గాఁగిలించఁగా నట్టె కాఁగిలించకుంటే
యేతులని యెంచరా యింతులెల్లాను
యీతల శ్రీ వేంకటేశు నింకాఁ గూడుదువుగాని
చేతనైనపాటి సేవసేయరాదా యిపుడు ॥మంకుఁ॥ 418

పాడి

ఏమి చెప్పేరే బుద్దులు ఇద్దరు నొక్కటే తాము
సాము లెంత సేసినాను చనవులై వుండు ॥పల్లవి॥

చెలువపురమణుఁడు సేఁత లేమి సేసినాను
యెలమి మోహించునింతి కింపులై వుండు
తలఁచుకొంటే నవే తగులాయములై వుండు
కలిమితో మేనికి సింగారములై వుండు ॥ఏమి॥

వనపైననాయకుఁడు నవ్వులెన్ని నవ్వినాను
యెనసినకామినికి ఇంపులై వుండు
తనివోనివేడుకలుఁ దరితీపులై వుండు
పెనఁగినప్పుడెల్లాను ప్రియములై వుండు ॥ఏమి॥

యీరీతి శ్రీవేంకటేశుఁ డెంత కాఁగిలించినాను
యీరసములెల్లా మాని ఇంపులై వుండు
తారుకాణలై వుండు తమకములై వుండు
వూరేటియమృతమెల్లా వుట్టిపడి వుండు ॥ఏమి॥ 419

లలిత

అద్దమరాతిరికాడ అలపు చూడక వచ్చె
వొద్దికతోఁ బీటపైఁ గూచుండఁబెట్టుకోవయ్యా ॥ పల్లవి ॥

సారె జాఱుఁదురుముతో సతి సిగ్గుటికి రాఁగా
జీరల చెమటగారీఁ జెక్కులవెంట
చేరి సురటి విసరి చెంగలువలు ముడిచి
గారవించి పరపుపైఁ గాఁగిలించుకోవయ్యా ॥ అద్ద ॥

పయ్యదకొం గెడలఁగఁ బరువున రాఁగాను
కయ్యమడిచీఁ జన్నులు కదలఁగను
చెయ్యి వురమున మోపి చెంగావిదుప్పటి గప్పి
పుయ్యాలమంచము మీఁద వొద్దికచూపవయ్యా ॥ అద్ద ॥

గందపుబొట్టు గరఁగ కలసి విన్నంటరాఁగా
చిందేటిమోవితేనెలు చిప్పిలీని
కందువ మోవి యాని కస్తూరి నుదుటఁ బూసి
పొందుల శ్రీవేంకటేశ పొసఁగించుకోవయ్యా ॥ అద్ద ॥ 420

రేకు 1371 ద్రావిళభైరవి.

మందాటా లిఁకనేల మాపుదాఁకాను
వుండినయట్లనే పొనగూడుమనవే ॥ పల్లవి ॥

మనసులో కపటాలు మతకరిమాటలు
కనుఁగొన్నయప్పుడే కానరాదా
తనకేఁటియానలు తగదనే వారెవ్వరు
మనసలో చుట్టరికాన మన్నించుమనవే ॥ మందా ॥

తిరిగేటితిమ్మటలు తెమలవివేసాలు
గరువపునవ్వులోనే కావరాదా
సిరినేల వాడఁబాటు [1]చాలున(చెల్లదః)నేవారెవ్వరు
కరుణగలిగినట్టే కయికొమ్మనవే ॥ మందా ॥

రాఁగినచలములు రమించేవలపులు
కాఁగిటిలోననే కావరాదా
మాఁగఁబెట్టనేల మోవి మరిగి నవ్విటు గూడె
దాఁగక శ్రీవేంకటేశు దయఁజూడమనవే ॥ మందా ॥ 421

మంగళకౌశిక

వెసఁ గాఁపురము సేయ విచ్చనవి(వి?)డి
ముసగసలేఁటికి ముదితలతోడను ॥ పల్లవి ॥

గరిమ గుఱుతు చెప్పఁగానే చుట్టరికమాయ
తెరమఱఁగుకు రాఁగా తేరె వావి
తరుణికి నీకును తగులు కామఁడే సేసె
శిరసువంచుక యేల సిగ్గువడేవు ॥ వెసఁ ॥

తప్పకచూడఁగానే దైవారెఁ బొంతనాలు
చిప్పివి విదేలియ్యఁగాఁ జేకూరెఁ బెఁడి(బెండ్లి?)
కప్పురగందికి నీకుఁ గంతుఁడే వొజ్జలాయ
అప్పటి ఇంకానేల అనుమానాలయ్యా ॥ వెసఁ ॥

పామపుపైఁ బండఁగానే పలియించె సంసారము
వానె శ్రీవేంకటేశ నీనవ్వులమోవి
మానవతికివి నీకు మరుఁడే సేస లందిచ్చె
పూవిపట్టి మరియేల బోదించ విపుడు ॥ వెసఁ ॥ 422

1. యతిభంగము.

పాడి

గడుసవంటా విన్ను కన్నవారెల్లా నాడేరు
జడిగొని యాదరించఁగవద్దా నీవు ॥ పల్లవి ॥

చెలఁగి ల లిత నీతో నెలవుల నవ్వె నాకె[1]
కలువపువ్వుల వేసె కమ్మటి నాకె
పిలిచి పెదవులవే(నేఁ) ప్రి(బ్రిః)యములు చెప్పె నాకె
మెలఁగి యిఁ(యిం?)తటనైనా మెచ్చవద్దా నీవు ॥ గడు ॥

సారెకు మోవి చూపి చవులుసేసె నాపె
కూరిమి గొసరి గోరగీరె నాపె
ఆరీతి వేరుసేయకుమని విడెమిచ్చె నాపె
నీరతులఁ దనిపి మన్నించవద్దా నీవు ॥ గడు ॥

గక్కనఁ గాఁగిటఁ గూడి కదుఁ బచ్చిసేసె నాకె
అక్కవలెఁ గరఁగించి లాలించె నాకె
యెక్కువ శ్రీవేంకటేశ యేలితివి నన్ను విట్టె
విక్కమున నీదయే వించవద్దా నీవు ॥ గడు ॥ 423

వరాళి

పచ్చలాయకట్టినట్టు బయలు వందిలైనట్టు
గచ్చులెన్నైనాఁ గలవు కైకొనేముగాక ॥ పల్లవి ॥

మచ్చిక నీమాఁటలు దీమపుమెకమువంటివి
కుచ్చితాన మెల్లనే తగులఁదీసేవు
పచ్చివెచ్చియైయుందు పడఁతులకెల్లాను
యెచ్చరి నీవాడినట్టె యియ్యకొంటగాక ॥ పచ్చ ॥

1. పాదాంతమందలి గీత లేదు.

మాయల నీ నవ్వు లివి మచ్చుమేపులవంటివి
వాయల సన్నల నాసాని(స?)ఁ బెట్టేవి
మూయక మూపినట్టుండుః ముద్దరాండ్ల కెల్లాను[1]
తోయక నీకిచ్చలాడదొరకొంటగాక ॥ పచ్చ ॥

చెనకేనీకాఁగిలి జిగురుఁగందెవంటిది
అనువుగాఁ జొక్కించి అంటుకొనేది
ఘనుఁడ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
తనిసి వేడుక లోలో దైవారుటగాక ॥ పచ్చ ॥ 424

మాళవిగౌళ

ఎవ్వ రేమవిరి నిన్ను యేల వేగిరపడేవు
జవ్వనపు మంకులేల చాలు నుండవయ్యా ॥ పల్లవి ॥

పంతపుమాటలకేమి పై పై నీ మోహము చూచితే
కాంతుఁడ నీగుణమెల్లాఁ గానరాదా
అంత కోపకాఁడవా అన్నిటా మంచివాఁడవే
సంతరొదలేల యీడఁ జాలు నుండవయ్యా ॥ ఎవ్వ ॥

వొట్టులు వెట్టుకోనేల వొట్టే నించుక వుండితే
యిట్టె నీసరితలెల్లా నెఱఁగరాదా
గట్టువాయవాఁడవా కడునేరుపరివే
జట్టి తరితీపులేల చాలు నుండవయ్యా ॥ ఎవ్వ ॥

నేమము వలుకనేల నేఁడు నిన్నుఁ గూడితిమి
దీమసపునీవలపు తెలియరాదా
గామిడివాఁడవా శ్రీవేంకటగిరి దేవుఁడవే
సాముల బిగువులేల చాలు నుండవయ్యా ॥ ఎవ్వ ॥ 425

1. పాఠాంతమందలి గీత లేదు.

ఆహిరి

కన్నియ ముద్దరాలు కదుఁ(బి)న్న
యెన్నిక నీకాతరాన కింత కోపునా ॥ పల్లవి ॥

చెక్కులవెంటఁ గారీ చెలియకుఁ జెమటలు
అక్కరతో రతి నెంత యలయించితివో
ముక్కున విట్టూర్పులు మునుకొని రేఁగెను
పెక్కువిధముల నెంత పెనఁగితివో ॥ కన్ని ॥

మదమెలదాఁకా నీడె మగువ నెరిఁగురులు
తదవి యెంత సదమదము నేసితో
కడ కస్తూరి బొట్టు కదుఁజెందువందులాయ
అ... నుర్మము లెంత అంటితివో ॥ కన్ని ॥

చిమ్ముచుఁ గ...ల నదె చింది విద్దుర లింతి
యెమ్మె జాగర మెంత నేయించితివో
కమ్మి శ్రీవేంకటేశుఁడ కాఁగిలింపించుకొంటివి
కిమ్ముల సిగ్గు లెంతేసి కెరలించితివో ॥ కన్ని ॥ 428

రేకు 1372 పళవంజరం

ఏల కోపగించి చూచే వీతవిదిక్కటే నీవు
తాలిమి నేసుకొంటేఁ బంతముదప్పీనా ॥ పల్లవి ॥

వెక్కసపుఁగొ ప్పతఁడు విడిచితే నేమాయ
పెక్కునెరిఁదుమ్మిదలు బెదరీనటే
పిక్కటిల్లఁగుచములు పిసికితే నేమాయ
ఘుక్కువ నందలివిగు వింతలో మాసీనా ॥ ఏల ॥

వొప్పుగా నాతఁడు నీవొడివట్టితే నేమాయ
మిప్పిరి నీపోఁకముడి మున్ద్రదప్పినా
అప్పటిఁ బిరుఁదు చేతనంటితే నేమాయనే
గొప్పతన మంతలోనే కొంచమయ్యీనా ॥ఏల॥

శ్రీవేంకటేశుఁడు గోరఁ జెనకితే నేమాయ
సోవల నీపులకసనులు వంగినా
కైవశము సేసుకొని కలసితే నేమాయ
నీ వలమేల్మంగ వాతనికి జంటగాదా ॥ఏల॥ 427

పూర్వగౌళ

అందరివలెనే చూచే వప్పటి నన్ను నీవు
సందడి మందమిరేలు చల్లఁగా నేను ॥పల్లవి॥

సరసములాడుతానే చలము సాదించె నాపె
యిరవై తి వింతసేయ నే నోపఁగా
తరుణి పాదాలొత్తుతా తానే తాఁకించే గోరు
వొరపి మేరలుదప్ప నోపఁగా నేను ॥అంద॥

కదిసి మాటాడుతానే కాఁకలురేఁచె నాపె
యిదివో నేనై తేను ఇంతకోపఁగా
చదురంగమాడుతానే సారెసారె ఎనుఁ దిట్టె
పుదుటువ గాతసేయ నోపఁగా నేను ॥అంద॥

గారవానఁ గూడుతానే గంటిసేసె మోవి యాపె
యీరీతి నిన్ను జరయ నింతకోపఁగా
కోరి శ్రీవేంకటగిరిగోవింద నన్నేలితివి
వూరకే నిన్ను దూరనోపఁగా నేను ॥అంద॥ 428

మంగళకౌశిక

ఆకెఱుఁగు నీవెఱుఁగు దంతేసి మాకననేల
సాకిరి యడిగితేను సమకావ నాదేము ॥పల్లవి॥

చలములు నీతోను సాదించ నాకేమిటికి
[1] చెరి(లి?)వద్దికిఁ బోరాదా చెప్పీఁగాని
యెలమి నీ వెక్కుడనో యేమేమో నేసితివట
కొలఁదితో నవీఁ గొన్ని కొంతగొంత వింటిమి ॥ ఆకె ॥

యెదుటనే మోవిచొప్పు లెత్తఁగ మాకేమిటికి
సుదతి నడుగరాదా చూపీఁగాని
బెదరించనేల నీకు ప్రేమ మెందో వున్నదట
అదనఁ బొరుగువారు ఆడఁగానే వింటిమి ॥ ఆకె ॥

వేమారు విన్న మాకు వెరపించనేమిటికి
కోమలికి మొక్కరాదా కూడీఁగాని
నేమపుశ్రీవేంకటేశ నీవే యాకె నేలితట
కామిను లిందరునుఁ బొగడఁగా వింటిమి ॥ ఆకె ॥ 429

తెలుఁగుఁగాంబోది

ఇంతి నీకు మీఁదెత్తి ఇట్టె వలపు
కాంతుఁడ చేకొనవయ్య కడలేనివలపు ॥ పల్లవి ॥

చిగురుఁగత్తిపైదార చిమ్మిరేఁగేవలపు
బిగువునామనివేళ పెడరేఁచేవలపు
మొగిలు కన్నులఁ గంటే మొనచూపేవలపు
బిగిడి పూవుటమ్ముల విందువాఁడివలపు ॥ ఇంతి ॥

1. ప్రాసభంగము..

మాపులంటితేనే వొళ్లు జుమ్మురనేవలపు
యేపుమాటలనే నాములెక్కేటివలపు
పైపై నెఱిపినవ్వుల భ్రమయించేవలపు
కాపైనవెన్నెలలోవికదువేఁడివలపు ॥ ఇంతి ॥

పానుపుపైఁ గూడితేనే పచ్చి చూపేవలపు
పూనినమోవితే కు పొత్తుసేసేవలపు
కానుకై శ్రీవేంకటేశ కాంత విట్టె యేలితివి
నానీ నిమన్ననలను ననుపైనవలపు ॥ ఇంతి ॥ 430

నాదరామక్రియ

మట్టుమీర నేమిటికి మాకు నీనేవే చాలు
చుట్టాలమే యెట్టుండినా నొరిది నీ కెపుదు ॥ పల్లవి ॥

చిల్లర పొందులెల్లాను జీరలై నీమేన నంటె
వెల్లవిరిఁ దుడిచితే వెసఁ బోవునా
పల్లదాన నాకొంగు పట్టేవు నీ వప్పటివి
వొల్లమయ్యా అంటించుకోనోపము నీమేనివి ॥ మట్టు ॥

కమ్మలవారిమాటలు కెంపులై నీమోవి నంటె
అమ్మరో యెంతదాఁచినా నణఁగుండీనా
చిమ్ముచు మాతో నీవు చేరి నవ్వే వప్పటివి
వొమ్మనా మాకింతేసి నీవొళ్లిసింగారములు ॥ మట్టు ॥

చిత్తజరతు చేదవో చెమటలై మేనఁ గారీ
వొత్తి యెంత దుడిచినా వూరకుండీనా
ఇత్తల శ్రీవేంకటేశ ఇటు నన్ను నేలితివి
పుత్తి(త్తే)పుపై వుండీనా నీవొద్దినయానలకు ॥ మట్టు ॥ 431

గౌళ

మీకిద్దరికే తెలుసు మీరివచ్చేపనులు
  సాకిరి వితరులకు చక్కఁబెట్టరాదు ॥పల్లవి॥

చలపాదివాని నంత చంచపెట్టఁబనిలేదు
  చెలరేఁగి ఇచ్చకమే సేయవలెను
  నెలకొన్న రమణివి నీవు నట్లానైతేను
  పొలఁతుల కింక మరి బుద్ధిచెప్పరాదు ॥మీకి॥

మంకువోజవానితోడ వచ్చరించఁబనిలేదు
  అంకెకు వచ్చినట్టెల్లా నాదవలెను
  సంకెలేక నీవూ నాజాడలనే మెలఁగితే
  పొంకపుఁజుట్టాలకు బుద్ధిచెప్పరాదు ॥మీకి॥

దొరపాటివానితోడ దూరఁగఁబనిలేదు
  యిరవై శ్రీవేంకటేశుఁ డేలె విన్నను
  సరిగా నీవూ నట్టే సమరతి నొత్తితేను
  పొరుగిరుగువారికి బుద్ధిచెప్పరాదు ॥మీకి॥ 432

రేకు 1373 ముఖారి

ఇదివో ఇప్పటిమాట ఇంకా నేమేమి గలవో
  యెదుట నే విన్నట్టే పంతమిచ్చితినంటివట ॥పల్లవి॥

మచ్చికతో నీవు నాకె మంతనము లాడుకోఁగా
  వచ్చి నాతో ఘొంచువిన్నవారు చెప్పిరి
  ఇచ్చి నీచెక్కులమీఁద గోరుదీయమంటివట
  వచ్చి యాపెకే నీవు వలతునంటివట ॥ఇది॥

పన్ని నీవు నాపెను బాసలు సేసుకోఁగాను
కన్నవారే నాతో నీకథఁ జెప్పిరి
సన్నల నెదురాడవిచన విప్పినంటివట
చిన్నైనాఁ బెద్దదేవులఁ జేసేనంటివట ॥ ఇది ॥

ఆడ నాపెఁ గూడి నాకై అప్పణ లిప్పించుకోఁగా
వూడిగపువారే నావొద్దఁ జెప్పిరి
జాడల శ్రీవేంకటేశ సరిగా నన్నేలితివి
వోడక యిందూ నందూ వుండేనంటివట ॥ ఇది ॥ 433

సాళంగనాట

ఇది యెంతగా బోదించె యెవ్వతో నీకు
అదనాయఁ దెరలోని కంకెల రావయ్యా ॥ పల్లవి ॥

పాదాలుపిసికేదాన పైపై విందలాడేనా
లేదుసుమీ నీగుణాలు లెక్కవెట్టితి
సాదనై మొక్కేచేత సారె గోరుదీసేనా
సేదదేర మేలుతోడ చెక్కులు దువ్వితివి ॥ ఇది ॥

నీకు నాలనైనదాన నేఁ బంతాలు చూపేనా
వాకువ సత్తువచూడవలె నంటివి
కైకొవి మోవియిచ్చి కారములు చూపేనా
కోకొమ్మని తేనెలకు గుంటలు సేసితిని ॥ ఇది ॥

వూడిగపుదాన నీపై వొగిఁ బాదము చాఁచేనా
వాడికరతుల విమ్ము వలపించితి
కూడితి శ్రీవేంకటేశ కొసరులు నెరపేనా
పీడెములోవివిందులు పీడుదోడాడితివి ॥ ఇది ॥ 434

హిందోళం

నీకేల వెఱపు నిన్నెవ్వ రేమని రీడ
పోకలఁబో కాపె నిట్టె బోగించరాదా ॥ పల్లవి ॥

అంగన మాటలాడితే నాయములు గరఁగేవు
చెంగలించి చూచితేనే చెమరించేవు
ముంగిట నిలిచతేను ముంచి పులకించేవు
పొంగినాస నీ కాపెను బోగించరాదా ॥ నీకే ॥

కందువల నవ్వితేను గక్కన భ్రమసేవు
అంది కానుకలిచ్చితే నలసేవు
సందడి నీకు మొక్కితే సారె నునుపనేవు
పొందులుసేసు కీపెను బోగించరాదా ॥ నీకే ॥

వావులు నీకుఁ జెప్పితే వలపులు రేఁగేవు
చేవట్టి తీసితేనే చిక్కువదేవు
శ్రీవేంకటేశ్వరుఁడ చేరి నన్ను నేలితివి
జూవానఁబెట్టు కాపెను బోగించరాదా ॥ నీకే ॥ 435

సామంతం

ఒక్కపానుపుమీఁదనే వున్నార మిద్దరము
పక్కన వలపు యెట్టు పంచియిచ్చేవు ॥ పల్లవి ॥

కోరి నే మాటడుగఁగ గోర నాపె వూఁదఁగాను
యీరీతి నిద్దరినంది నెట్టు చిక్కితి
నేరుపు చూతము నీవు నెరజాణఁడ వందురు
బారపువలపు యెట్టు పంచియిచ్చేవో ॥ ఒక్క ॥

నవ్వులు నే నవ్వఁగాను నట నాపె మొక్కఁగాను
ఇవ్వల విద్దరిసంది నెట్టు చిక్కితి
జవ్వనపువాఁడవు చతురత నేరుతువు
పవ్వళించి వలపెట్టు పంచియిచ్చేవో ॥ ఒక్క ॥

సారె మోవి నే నానఁగ చన్నుల నాపె వొత్తఁగ
యీరీతి విద్దరిసంది నెట్టు చిక్కితి
కోరి శ్రీవేంకటేశుఁడ కూడితివి మమ్మిద్దరి
పైరులవలపు యెట్టు పంచియిచ్చేవో ॥ ఒక్క ॥ 436

మధ్యమావతి

ధర నెఱఁగవా యీతగవు జాణఁడవు నీవు
సరసము విరసము సరిపెట్టఁదగునా ॥ పల్లవి ॥

కొసరికొసరి విన్ను కొఁ(కొం?)గువట్టి తియ్యఁగాను
విసరి పూవులఁగాపి వేసేవు
ఆసురుసురై యట్టె ఆఁటది వలచిరాఁగా
రసికుఁడు మొగవాఁడు రాయిడించఁదగునా ॥ ధర ॥

కలసి మెలసి నేను కందువకుఁ దియ్యఁగాను
వెలుపల మంది నీవు విఱ్ఱవీఁగేవు
ఆలరుచు నాఁటది యీనలు పైఁజల్లఁగాను
బలిమికి మొగవాఁడు పంతమాడఁదగునా ॥ ధర ॥

కైవశమై నే విన్ను కాఁగిటఁ గూడఁగాను
శ్రీవేంకటేశుఁడ నీవు సిగ్గువడేవు
చేవదేర నాఁటది చేరి మోవి ఇయ్యఁగాను
కావరించి మొగవాఁడు గంటిసేయఁదగునా ॥ ధర ॥ 437

ముఖారి

ఏఁటికి వేసాలు నేనే వెందాఁకాను
ఆఁటదాని దయఁజూచి యాదరించరాదా ॥ పల్లవి ॥

రతికి వేడుకపడి రమణి వద్దనుండఁగా
కతలేమి చేప్పేవు జాగరముగాను
యితవుగాకుంటే నానతియ్యరాదా వొకమాట
చతురత నాడీఁగావి చదరంగమైనను ॥ ఏఁటి ॥

జవ్వని మోవితేనె సారెసారె నడుగఁగ
నవ్వులేమి నవ్వేవు నాఁటకానను
చివ్వన నీవియ్యనంటే చేత వా(వ్రా?)సి చూపరాదా
తవ్వి వానగుంతలైనా తా నాడీఁగావి ॥ ఏఁటి ॥

చక్కవింతి గాఁగిలించి చన్నుల వినోత్తఁగాను
మొక్కులేమి మొక్కేవు మోపులుగాను
ఇక్కువ శ్రీవేంకటేశ యేలితి పందెమీరాదా
పక్కన నాడీఁగావి పగడసాలైనను ॥ ఏఁటి ॥ 438

రేకు 1374 మేఁచబౌళి

అలిగివుండిననన్ను ఆయములంటీఁ దాను
నెలకొన్నకూటమికి నేనూఁ గావలెనా ॥ పల్లవి ॥

చుట్టరికములు నేయ సుదతు లెందరు లేరు
ఇట్టె పాదాలు పిసుక నెందరు లేరు
వట్టివదుమ నవ్వులు నవ్వఁగ నెందరు లేరు
నెట్టుకొన వేఁడుకొని నేనూఁ గావలెనా ॥ అలి ॥

అంచెల సేవలుసేయ నప్పటి నెందరు లేరు
యెంచఁగ బంతికూటికి నెందరు లేరు
మించి విడేలందుకొనుమెలఁత లెందరు లేరు
నించి చెక్కులు నొక్కిసి నేనూఁ గావలెనా ॥ అలి॥

వలచి దినదినము వరుస కెందరు లేరు
యెలమిఁ దన్నుఁబొగడ నెందరు లేరు
అలరి శ్రీవేంకటేశుఁ డంతలోనె నన్నుఁ గూడె,
నెలకొని బుజ్జగించె నేనూఁ గావలెనా ॥ అలి ॥ 439

వరాళి

తాను సేసినపనులు దక్కె నెలెననటాను
నావఁబెట్టుక లోలోనే నవ్వులు నవ్వీనే ॥ పల్లవి ॥

తగవులు చెప్పరాను తనను నేమీ ననరాను
మగువ సవతిగాఁగా మాటాడితినే
అగడుసేసితివంటా అదె నెపముసేసుక
పగటువ పానుపుపై పవ్వళించియున్నాఁడే ॥ తాను ॥

వలపులు రేఁచరాను వాదులు వెట్టుకోరాను
చెలిక త్తెగాఁగా వటు చెనకితినే
చలము సాదించెనంటా సాకిరు లందరిఁబెట్టి
వెలయఁగ దోమతెర వేసుకవున్నాఁడే ॥ తాను ॥

కల్ల మోపరాను తన్ను కరకరించరా నాకె
చెల్లెలుగాఁగాఁ బెండ్లి సేసితినే
ఇల్లిదె శ్రీవేంకటేశుఁ దేలె నన్ను మీరెనంటా
పల్లదానఁ గాఁగిలించి పాయకున్నాఁడే ॥ తాను ॥ 440

సామంతం

ఏల సిగ్గులువడేవు యేమోయి
వేళతోడఁ జనవిచ్చి వెసఁ గొనవోయి ॥ పల్లవి ॥

చెక్కుచేతితో నాకతె చింతలచిగురులమ్మీ
గుక్కకిట్టె వెలవెట్టి కొనవోయి
ముక్కుమీఁదివేలితోడ మోవిపండ్లమ్మీని
నెక్కొన్నవలపుతోడ నీవు గొనవోయి ॥ ఏల ॥

చలికప్పుచేతులతో సతి నిమ్మపండ్లమ్మీ
కొలచినందె కొలచి కొనవోయి
వులివచ్చిసిగ్గులు వాడిఁబెట్టు కమ్మీని
విలువునరసము వ నీవు గొనవోయీ ॥ ఏల ॥

కమ్మకొన్ననవ్వులను కప్పురపులప్పలమ్మీ
కొమ్మను కాఁగిటిరతిఁ గొనవోయీ
నెమ్మది శ్రీవేంకటేశ నీవు వన్నెలితి వాకె
నేమ్మనములోనఁ గొంత నిండుకొనవోయీ ॥ ఏల ॥ 441

దేసాళం

వేఱొకటిగాఁ జూడకు వేడుక నావూడిగము
మీఱి నే విన్నవించి మెప్పించితి నిపుడు ॥ పల్లవి ॥

కోపగించుకోకుమీ గోరుదీసితినంటా
చేపట్టి రతెచ్చరిక నేసితివింతే
చాపలానఁ గసరకు చన్నుల నొత్తితినంటా
రాపాడి పీవురము పింగారించితి నిపుడు ॥ వేఱొ ॥

మంచి యొగ్గుపట్టకుమీ మోవి గంటిసేసెనంటా
కొంచక బూవపుపొత్తు గూడితివింతే
పంచల జంకించకుమీ పట్టిపెనఁగితినంటా
పెంచపుసిగ్గు విడిపించితి నే నిపుడు ॥ వేఁటా ॥

గక్కన వలయకుమీ కాఁగిటఁ గూడితివంటా
పెక్కువిధముల మేలు పెంచితినింతే
పక్కన శ్రీవేంకటేశ పాయకుమీ దూరెనంటా
వెక్కసపునవ్వులు నవ్వితి నే నిపుడు ॥ వేఁటా ॥ 412

శుద్ధవసంతం

ఇంక నోఁజకువచ్చినా యెంత బుద్ధిచెప్పినాను
బింకపుమోహాన రట్టు పెట్టితివి యీపెను ॥ పల్లవి ॥

వుంకించి నీవొడివట్టి వొకటొకటె విన్నాడీ
మంకుది; నీతో నెంత మందెమేళము
జంకించి నే వెదచొచ్చి పారెవద్దన్నా మానదు
తెంకి నింత రాఁగఁజేసితివి నీవే యీకెను ॥ ఇంక ॥

కొప్పువట్టి విన్నుఁ దీసి కొసరీఁ గూరిమిలెల్లా
ఇప్పుడే నీతోడి; [1]నీకెంతగర్వము
చెప్పుచు నేఁ గసువన్న సేసినాఁ దా నెఱఁగదు
చిప్పిల గట్టువాయఁ జేసితివి నీ వీపెను ॥ ఇంక ॥

గోర గీరి కాఁగిలించి కుచముల విన్నునొత్తి
తారసిల్లీ; తన కెంతదంటతనము
చేరి విన్ను నెవసి సిగ్గువరచినఁ బోదు
మేరలు శ్రీవేంకటేశ మీరించితి నీపెను ॥ ఇంక ॥ 413

1. 'నీకె కెంత' అని యుండవచ్చునేమో.

కుంతలవరాళి

చదివితినందువు జాణవందువు
ముదుటఁ గొంచేవు రాజ్య మెట్ల నేలితివో ॥పల్లవి॥

ఆఁటదియైతేఁజాలు నట్టె చూచి భ్రమతువు
యీటుతోడ యెగ్గుసిగ్గు లెంచవు నీవు
పాటలువాడితేఁజాలు భ్రమసి చొక్కుదువు
వాఁటముగఁ; దొల్లి దొడ్డవాఁడ వెట్టనైతివో ॥చది॥

మొగము చూచితేఁజాలు మొక్కలే మొక్కుదువు
పొగిపి నవ్వేవారిఁ జూడవు నీవు
పొగడి మెచ్చితేఁజాలు పొందులెల్లాఁ జేతువు
తగవుతోఁ దొల్లి దొరతన మెట్లఁ జేతువో ॥చది॥

పరుసఁ గూచుండేఁజాలు చలపట్టి కూడుదువు
పరవితో దొడ్డ గొంచము లెంచవు
గొరబై శ్రీవేంకటేశ కూడితివి నన్ను నిట్టె
పొరిఁ దొల్లి గొల్లెతలభోగమెట్లఁ జేతువో ॥చది॥ 444

రేకు 1375 సౌరాష్ట్రం

అతివ వింత సేతురా అవునయ్యా
తతితో నవ్వులు రాఁగా తలవంచుకొనెను ॥పల్లవి॥

సింగారించుకొని రాఁగా చిమ్మనఁగోవినీరు
అంగనపైఁ జిమ్మితివి అవునయ్యా
చెంగావిదువ్వటము చిప్పిలి యంటుకొంటే
అంగాలెల్లఁ గానరాఁగా నద్దె సిగ్గువడెను ॥అతి॥

కిన్నెర మీటుతా రాఁగా గిన్నెలఁ గప్పురధూళి
అన్నిటా ముంచిపోసితి వౌనయ్యా
వున్నతపుఁగొప్పు పీడి వాగిఁ గాళ్లఁ దొడరఁగా
కన్నులుమూసుక విన్నుఁ గాఁగిలించుకొనెను ॥ అతి ॥

చెంది నీ కొప్పంటరాఁగా చెంగలువరేకులను
అందియంది వేసితివి అవునయ్యా
గొందినె శ్రీవేంకటేశ కూడి మేను చొక్కఁరాఁగా
సందడి నీపచ్చడము సరిఁ గప్పుకొనెను ॥ అతి ॥ 445

కాంబోది

ఇంతి నీవూ నాడుకోఁగా నేకాంతములెల్ల వింటి
దంతపుటింటిలోనివి దాఁచక చెప్పవయ్యా ॥ పల్లవి ॥

పూసగుచ్చినట్టుచెప్పేబుద్దులెల్లా వింటివా
సేసవెట్టినట్టిపాలు చేకొంటివా
బాసడిగినట్టెల్లాఁ దప్పక నీవిచ్చితివా
ఆసుద్దులు వినవేడుకయ్యాఁ జెప్పవయ్య ॥ ఇంతి ॥

పాదా లాపె పిసుకఁగ పరిణామించితివా
ఆదిగొవి పాడఁగాను ఆలించితివా
పాదులు గిలిగించఁగా పక్కన నవ్వితివా
కాదుకూడదన నేను కలట్టె చెప్పవయ్యా ॥ ఇంతి ॥

సరసములాడఁగాను చనవులిచ్చితివా
మెరసి వూడిగాలెల్ల మెచ్చితివా
యిరవై శ్రీవేంకటేశ యిటు వన్ను నేలితివి
అరుదాయ నాపెచేఁత లవియుఁ జెప్పవయ్యా ॥ ఇంతి ॥ 446

ఆహిరి

చెక్కునొక్కి వేఁడుకొని చేతులెత్తి మొక్కె నీకు
నేకొన్నసీసతి నేమ నేరము లెంచే(చ?)కుమీ ॥ పల్లవి ॥

మనసు నొవ్వదుగదా మగువను జంకించితే
ఘనమోహ మాపెమీఁదఁ గలదు నీకు
కనుఁగొంటే సవతులు గరిసించక మానరు
పనివడి అవెల్లా నీపైఁ బెట్టుకోకుమీ ॥ చెక్కు ॥

సిగ్గులువడవుగదా చెలి నేతువలెత్తితే
అగ్గలమై నీకెపుడు నాపె ప్రాణము
దగ్గరఁ గూచుంటే పదితలింతురు ఆఁడువారు
దిగ్గన నవెల్లా నీమీఁదికిఁ దీసుకోకుమీ ॥ చెక్కు ॥

సూడులువట్టవుగదా సుదతి నే పంగించితే
యీడ శ్రీవేంకటేశ నీకిపె చుట్టము
కూదితివి నను నిట్టె పాడి యెంతురు కాంతలు
వేడుకలవెల్లా నీవు వేసరుకోకుమీ ॥ చెక్కు ॥ 447

రామక్రియ

అప్పుడే మఱతురా అంగనసేసినమేలు
చొప్పులెత్తఁగా నణఁచుట నీవెఱఁగవా ॥ పల్లవి ॥

ఆకడ నెవ్వతో నిన్ను నట్టె తుటారాలాడఁగ
యీకె సన్నసేసి మాన్పె నిదెఱఁగవా
పైకొని యప్పటి నీపయిఁ జేయిదాఁచఁగాను
చేకొని నీకడ్డమువచ్చినది యెఱఁగవా ॥ అప్పు ॥

కదఁగి యొకతె నీపై గట్టిపూబంతి వేయఁగా
యెదచొచ్చి పట్టుకొనె విదెఱఁగవా
ఐడియ కంతలో విన్ను నరిఁ గిందవేసుకొంటే
వెడిదాన విన్ను మీఁదఁబెట్టినదెఱఁగవా ॥ అప్పు ॥

వొద్దనున్నచెలి విన్ను వొగిఁ గాఁగిటఁ గూడితే
తిద్ది తానూఁ గలసినది యెఱఁగవా
యిదరూ నుండఁగానే యిటు విన్ను నేలితివి
[1]బద్దుల శ్రీవేంకటేశ పాడి నీవెఱఁగవా ॥ అప్పు ॥ 448

మంగళకౌశిక

అడుగరాదా బుద్ధి ఆపెనే నీవు
కడనుండేవారికిఁగాఁ గాఁకలఁబడుదురా ॥ పల్లవి ॥

మేనవారితోడనే మేలమాడుదువుగాక
నానవిజాణతనాలు నాతో నేఁటికి
కానికిచ్చేయాపెకే కప్పుర మిత్తువుగాక
కానకమైవుండేనాకుఁ దమ్ములమిడుదురా ॥ అడు ॥

మనుపటిదేవులనే మోవఁజెనకుదుగాక
వనచవినగవులు నాతో నేఁటికి
పనులు నేసేయాపెనే పైపై మెత్తువుగాక
మనికై వుండే నన్ను మన్నించవలెనా ॥ అడు ॥

పమ్మి రొమ్మపై యాపెకే బాసలు నేతువుగాక
నమ్మికయానలువెట్ట నాతో నేఁటికి
కమ్మర నాపెనే శ్రీవేంకటేశ కూడుదుగాక
యెమ్మెకు నన్ను నేలితి వింత సేయఁదగవా ॥ అడు ॥ 449

1. బద్దు=బొంకు అని వా.వి. ఇక్కడ భద్రశబ్దభవము కావచ్చు. క్షేమములనిచ్చు అని యర్థము.

తెలుఁగుఁగాంబోది

చే దాఁచవయ్యా నీకుఁ జిక్కేఁ గానికె
కాచినపూచినకలగంపలతో కానికె ॥పల్లవి॥

చెనకినగోరొత్తులచేకానికె
మొనలచన్నులు నీకు మునుగానికె
చనవులనవ్వు దరిశనకానికె
కనుచూపులే మంచికప్పురపుఁగానికె ॥చేదాఁ॥

వలపులమొక్కు దీపావళికానికె
క కమాఁటలు వుగాదికానికె
పై మోవిపండు విందుకానికె
కలికసి మించుఁగప్పురకానికె ॥చేదాఁ॥

వనపులకూటమి కట్నముకానికె
పొమఁగుమోవినోఁకులు బూమికానికె
యెనసితివి శ్రీవేంకటేశ వన్నువ
పనిగానేరతులు పైపై తొలైకానికె ॥చేదాఁ॥ 460

రేకు 1376 మాళవశ్రీ

మమ్ము నేమియడిగేవు మాపుదాఁకాను
సమ్మతిగా సేసలు చల్లుకోరాదా ॥పల్లవి॥

చెలికి వలతువట చెప్పనేల నీముద్దులు
కలయ నీవాడకు గక్కున రారాదా
కలిమివి యీపెపుంగరము నీచేతనుండే
తెలుపనేల వావి గద్దియపై నుండరాదా ॥మమ్ము॥

అంగవఱు దావయి స్త్రీవట మరేల సిగ్గులు
యింగిత మెఱిఁగి విడెమియ్యరాదా
ముంగిటినీమోవిమీఁద [1]మొల చాపెగురి వుంటే
సంగతిగ నట్టే సంపు సారెఁ జేయరాదా ॥ మమ్ము ॥

అతివఁ గూడితివట అప్పటినేల మరపు
రతులచవులెల్లా మరపఁగరాదా
యితవై శ్రీవేంకటేశ ఇద్దరూ నెనసివుంటే
సతమై రాజ్యమేలుచు సనవియ్యరాదా ॥ మమ్ము ॥ 451

సాళంగనాట

అయ్యా జియ్యాలువెట్టేనీయాఁడువారము
పయ్యదకొంగువఁ గట్టేపాటివారమా ॥ పల్లవి ॥

కాంతలయడాటాన కాఁకదేరినవాఁడవు
చెంతల వలపించనేర్చినవాఁడవు
దొంతిమోవుల దోమటిదొడికినవాఁడవు
పంతాలు నీతో నాడేపాటివారమా ॥ అయ్య ॥

సరసపుమాటలనే వంతవెట్టినవాఁడవు
సరి నవ్వుఁగప్పురాలే చల్లేవాఁడవు
తొరలింపుసిగ్గులకు దోసిలొగ్గినవాఁడవు
సరగ నీకాళ్ల దొక్కేపాటివారమా ॥ అయ్య ॥

కొలఁదిమీరినచమఁగొండలలోవాఁడవు
మెలుపుశ్రీవేంకటాద్రిమీఁదివాఁడవు
అలమేల్మంగమ నే నన్నలమినవాఁడవు
కలసినరతుల వొగడేపాటివారమా ॥ అయ్య ॥ 452

---

1. మొలచి+అపె

ఆహిరి

ఇంతితోటియేలాటా లెందుఁకాను
చింతదీర చెక్కునొక్కి సేదదేర్చవయ్యా ॥ పల్లవి ॥

చలము లేమిటికయ్య సతితోను
వలచినమేలు చూడవద్దా నీవు
జలజలఁ జమరించె చందపుమేను
కలసి కాఁగిటిలోనె కాఁకదేర్చవయ్యా ॥ ఇంతి ॥

పంతము లేమిటికయ్య పడఁతితోను
యింత(తి?)నేసినవూడిగా లెంచఁగవద్దా
మంతనాన ఓట్టూర్పుల మలసీ వీదె
వొంతనే మరుతంత్రాల బుజ్జగించవయ్యా ॥ ఇంతి ॥

గుంపెన లేమిటికయ్య కోమలితోను
యింపులు దలఁచవద్దా యిప్పుడైనాను
పెంపున నలసె నీతో బెరయుచును
అంపక శ్రీవేంకటేశ ఆదరించవయ్యా ॥ ఇంతి ॥ 453

శ్రీరాగం

వినరమ్మ యీసుద్దులు వెలఁదులాల
కొనబుకాఁడుగదమ్మ గోవిందరాజు ॥ పల్లవి ॥

పీదెపు లందియ్యఁగాను వింజామరలు వేయఁగా
వోదక చెలులు పాదాలొత్తఁగాను
మేడలోనఁ బవళించి మెత్తవిపరపుమీఁద
కోడెవేఁతలు సేసీవి గోవిందరాజు ॥ విన ॥

అట్టె నాట్యములాడఁగ అంకించిపాడఁగాను
ఇట్టువట్టు వీణలు వాయించఁగాను
వొట్టుక మలఁగుమీఁద వొడ్డోలగమై యున్నాఁడు
గుట్టుతోడివాఁడుగదె గోవిందరాజు ॥వివ॥

పరిమళాలు పూయఁగ పలువిందులు వెట్టఁగ
సిరియు భూమియుఁ బెండ్లి సేస చల్లఁగా
తిరుపతిలోన నొద్దిక శ్రీవేంకటేశుఁడై
గొంతై నవ్వఁగదె గోవిందరాజు ॥వివ॥ 454

పాడి

నీకంటెఁ జలమరి నెలఁతకుఁ జెప్పరాదు
దాకొని నీవు నవ్వితే తానే కాఁగిలించీని ॥పల్లవి॥

పయ్యెదమీఁద నీవు పన్నీరు చల్లఁగాను
వొయ్యనే లోలోనే తిట్టె వుసిద నిన్ను
కయ్యమువిడిచీ నిందుకుఁగా కాఁకలఁ బొరలనేల
పయ్యాలపైకి రారాదా వొక్కటిసేసేను ॥నీకం॥

పువ్వుల చెండుఁగొని పూఁచి నీవు వేయఁగాను
జవ్వని బొమ్మల నిన్ను జంకించెను
అవ్వల నిందుకుఁగాను అసురుసురనవేల
నవ్వించరాదా వద్ద నంతాలు దిద్దేను ॥నీకం॥

శ్రీవేంకటేశ నీవు చెలిగుబ్బ లంటఁగాను
కావరించి యాకె మోవి గంటిసేసెను
చేవదేర నిందుకుఁగా సిగ్గులువడఁగనేల
తావించి కప్రమీరాదా బత్తి నేఁ జూపేను ॥నీకం॥ 455

సామంతం

తగునయ్య నీకిన్నియు దైవపురాయ
మొగమునఁ గళనిండె మోహనరాయా ॥పల్లవి॥

మీఱుచు మాటలాడి మెలుఁత చెక్కులవెంట
జాఱించితిగా చెమట జాణరాయ
ఆఱడిమాఁటలాడి అట్టె పట్టి నీవు
చూఱగొంటివిగా సిగ్గు సుగుణరాయ ॥తగు॥

మంతనాన నవ్వుతానే మర్మములు గరఁగించి
వింతలు నేసితివిగా విటరాయ
అంతలోనే పైకొని అధరపుఁదేనె లిచ్చి
చెంతఁ జొక్కించితివిగా చెలువరాయ ॥తగు॥

పులకలు పెదరేఁచి పొంకులెల్లాఁ జేసి యీకెఁ
జెలరేఁగించితివిగా సింగారరాయ
ఱలురతుల నోలార్చి పలుమారు మన్నించి
చిలికితివిగా మేలు శ్రీవేంకటరాయా ॥తగు॥ 456

రేకు 1377 వరాళి

కూడినవేళనే ఖానగానవలెను
వాడలు దిరిగితేనే వంచరాదుసుమ్మీ ॥పల్లవి॥

సిగ్గులువడకువే చేపట్టి తీసితేను
వెగ్గళించినవ్వకువే వేఁడుకొంటేను
అగ్గమై నీయింటికి రమ్మనవే రమణుని
ఎగ్గులవెవక మరి నేరరాదుసుమ్మీ ॥కూడి॥

కొంచకువె నీతోను కోర మాటలాడి తేను
వంచకువే శిరసు నీవాఁడనఁగా
మంచము వేయవే నీమగనికిఁ బవ్వళించ
యుంచుక మఱచినాను యేఁకరేవుసుమ్మీ ॥కూడి॥

తరితీపు సేయకువే తగఁ గాఁగిలించుకొంటే
వరుస వెరగేఁటికే వావి చెప్పఁగా
ఇరవై శ్రీవేంకటేశుఁ డేలె విన్నిఁక మెచ్చవే
వొరసితే రతులిఁక వుడివోవుసుమ్మీ ॥కూడి॥ 467

ఆహిరినాట

ఆఁడమండవే నామారు; ఆతనికి నాకుఁబోదు
దండిగా నాపై దయను తానే వచ్చీఁగాని ॥పల్లవి॥

మనసులో నాభక్తి మఱవకుమనఁగదే
వనితలు పెక్కుఁగలవాఁడు తాను
ఆసతము నాకాపికె అందుకొమ్మనఁగదవే
ఘనమైనసంపదలు గలవాఁడు తాను ॥అంద॥

తగిలిన నాసేవ తలఁచుకొమ్మనఁగదే
మగటిమితో ఘొత్తులమగఁడు తాను
పొగిపి నాలేఖలు చూచుకొమ్మనఁగదే
అగపడి అష్టే లోఁడై వుండుఁ దాను ॥అంద॥

సోఁకిననాగోరితాఁకు చూచుకొమ్మనఁగదే
వాఁకపురతిపాముఁవాఁడు తాను
యేఁకట శ్రీవేంకటేశుఁ డిట్టె తా నన్నుఁ గూడె
పోఁకవెట్టి పెండ్లాడినపురుషుఁడే తాను ॥అంద॥ 458

బౌళి

ఇందుకా నీదొరతన మిందరిలోన
కందువల విందు నేమి గట్టుకొంటివయ్యా ॥ పల్లవి ॥

సెలవుల నే నవ్వితే సరసమంచేవు నీవు
కలదా యేమైనాను కల్ల నీమీన
విలువు నూయ వందీవి నీపంక చూచితేను
తొలుసారే యేపనికి దొరకొంటివయ్యా ॥ ఇందు ॥

చేసన్న నేఁ జేసితేను సిగ్గులువడేవు నీవు
మూపి దించి నింద నీపై మోచెనా నేఁడు
ఆసఁ దేనె లుట్టిపడినట్టై నీతో మాటాడితే
వోసరించ [1]కెంతవని కొడిగట్టితివయ్యా ॥ ఇందు ॥

కామక నే నిచ్చితేను కాఁగిటఁ గూడేవు నీవు
పూని యిందుకే కాచుకున్నాఁడవో
ఆనుక శ్రీవేంకటేశ అలమేలుమంగను నేను
నీనేరుపు లెంతెంత నేరిచితివయ్యా ॥ ఇందు ॥ 459

సాళంగనాట

ఇప్పుడే వేగిరమేల ఇన్నిటికిని
కప్పురమిచ్చేవేళ కనిపించేఁగాని ॥ పల్లవి ॥

కాంతమీఁద నీకు విట్టై కడుమోహమై వుండఁగా
యెంత నే విన్నవించినా యితవయ్యీనా
ఇంతి గలితే నీవు మాఇంటికి వచ్చేవేళ
దొంతరనానేరుపులు తోడుచూపేఁగాని ॥ ఇప్పు ॥

1. ఎంత+వని.

వుమ్మడి నాపె నీవును వాదివట్టి పెనఁగఁగ
తమ్మవి నేఁ బిలిచితే రతికెక్కీనా
సమ్మతైతేఁ గనక నీసరసమాడేటివేళ
పమ్మి నాప్రియములెల్లఁ బచరించేఁగాని ॥ ఇప్పు ॥

మరిగి మఱఁదలిపై మనసువెట్టుకుండఁగ
గరిమ నేఁ బైకొంటే కనుపట్టీనా
అరిది శ్రీవేంకటేశ అలమేలుమంగను నేను
యిరవై వన్నెలితివి యిఁక మెచ్చేఁగాని ॥ ఇప్పు ॥ 460

రామక్రియ

అవధరించవయ్యా ఆపెకలికిచేఁతలు
తివిరి చెమటమంచు దిగుపారించీని ॥ పల్లవి ॥

తేనెగారేమోవితోడ తేటమాట లాడుతాను
కానుకిచ్చి యాపె నిన్నుఁ గరఁగించీని
సావఁబట్టేచూపులను చలములు రేఁపుతాను
వీనులపండువగా విన్నపాలు సేసీని ॥ అవ ॥

బంకెనబొమ్మలతోడ సరసములాడుతాను
లంకెలంపొందుల నాపె లోఁ రేఁచీని
కుంకుమగుబ్బలమీఁదిగురుతులు చూపుతాను
కొంకునఁ గొసరు తేక కొంగులు వట్టీని ॥ అవ ॥

వెన్నెలనవ్వులతోడ వేడుకలునెరపుతా
కిన్నెరమీఁట్ల నాపె గిలిగించీని
అన్నిటా శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
పన్నల నిన్నుఁ గూడితే చవులు తా వించీని ॥ అవ ॥ 461

సామంతం

ఇదివో నాభాగ్య మేమిచెప్పేది
  మదనగురుఁడు నన్ను మన్నించెను ॥ పల్లవి ॥

జాణతనాలాడఁగాను సరసుఁ డందుకు మెచ్చి
  అణిముత్యములకంఠహార మిచ్చెను
  వీణె నేను వాయించఁగ వేడుకతోడ నట్టె
  రాణించినసతులలో(తో?) రతికిఁ జెప్పించెను ॥ ఇది ॥

ఇచ్చకములు సేయఁగా యీతఁడే అందుకు మెచ్చి
  పచ్చలకడియము లప్పటి విచ్చెను
  పచ్చితోడ తనమీఁదిపాటలెల్లాఁ బాడఁగాను
  పచ్చడముకొంగు నాపైఁ గప్పెను ॥ ఇది ॥

చేరి కాఁగిటఁగూడి శ్రీవేంకటేశుఁడు మెచ్చి
  పేరుకలనీలాలపెండె మిచ్చెను
  నేరి చలమేల్మంగను నేఁ దన్నుఁ బొగడితేను
  సారెసారె నన్నునేలి చనవిచ్చెను ॥ ఇది ॥ 462

రేకు 1378 లలిత

ఎక్కడ పరాకునేనే వెందాఁకాను
  వెక్కసపుఁదమకావ విడెమియ్యరాదా ॥ పల్లవి ॥

చిదుముదినవ్వుతోడ చెలి విన్నుఁ గొసరఁగా
  తొడపైఁ బెట్టుకోరాదా దొరవు నీవు
  వడియుఁజెమటతోడ వలపులు చల్లఁగాను
  తుడువరాదా నీవు దుప్పటికొంగునను ॥ ఎక్క ॥

వాఁకచూపులతోడ వనిత నీకు మొక్కఁగా
పాలించి పైకొనరాదా పతివి నీవు
మేలములాడుచు నీతో మేనరికము చెప్పఁగా
అలిగాఁ బెండ్లాడరాదా ఆదరముతోడను ॥ఎక్క॥

అలమేలుమంగ నిన్ను నట్టె కాఁగిలించుకోఁగా
చెలఁగి మోవియ్యరాదా శ్రీవేంకటేశ
చలిమిబలిమి నీకు చవులు వుట్టించఁగాను
పలుమారు మెచ్చరాదా భావము దెలియను ॥ఎక్క॥ 463

దేసాళం

జాణతన మెంచవద్దా సతులయడాటాన
వీణె వాయించినదాఁకా వేగిరమా ॥పల్లవి॥

మొగముచూడఁగానే మొక్కులుమొక్కేయాపెను
అగడుసేసి పెనఁగి యలయించేతురా
తగిలి చెదియఁగాక తమకించి యంతలోనే
బిగువుకుచము లిట్టె పిసుకుదురా ॥జాణ॥

సిగ్గుతోడ విన్నపాలుసేసేటియాపెను
బగ్గనను గోర గిరి పచ్చిసేతురా
విగ్గున సంతటఁబోక నీయేతులెల్లా మెరసి
వెగ్గళించి పోఁకముడి పీడఁజేతురా ॥జాణ॥

గుట్టుతోడ వీడెమిచ్చి కూడేటియాపెను
అట్టుసేసి సేర్పు రచ్చనట్టె వేతురా
ఇట్టె శ్రీవేంకటేశ యీ యలమేలుమంగను
గట్టిగా నేలితి వింత కందువఁ జొక్కింతురా ॥జాణ॥ 464

### పాడి

అట్టె కాపీలేవే అతఁ[1]డింతేయిత్తసేసె
నెట్టన నే విన్నాళ్ల నిన్నెఱఁగనా ॥పల్లవి॥

జడియుచు మూరిసేవు సవతులయెదుటనే
కదలేవిసంపదలగర్వమా యిది
జడిజడి నందరిలో పంతములే నెరపేవు
వొడలిలో వుప్పతిల్లేవుగటా యిది ॥అట్టె॥

దొరకొని కెలసేవు తోడివారు వినఁగానే
మరుతంత్రములలోవిమదమా యిది
పరగ బంగారుపీఁటపయి విఱ్ఱవీఁగేవు
కరఁగినమనసులో గజరా యిది ॥అట్టె॥

కూడి శ్రీవేంకటపతిఁ గొసరేవు మాయెదుట
జాడల నీతఁడిచ్చినసలిగా యిది
వోడక యక్కచెల్లెండ్ల[2]రొమ్మ సమ్మతిసేసేవు
నీడల నీనేర్చిననేరుపా యిది ॥అట్టె॥ 465

### మాళవి

ఎప్పుడూఁ దనవారమే యేడనున్నాను
వొప్పయ వలపు లూరకుండుమనఁగదవే ॥పల్లవి॥

సరసములాడఁబోతే సరి వలపులు చిక్కు
కరకరించఁగఁబోతే కాఁకలురేఁగు
తెర దియ్యఁగఁబోతే తరితీపులే కడుమించు
వొరయనేఁటికి వూరకుండుమనఁగదవే ॥ఎప్ప॥

---

1. ఇంత+అయిత్త అనియా? 2. చెల్లెండ్లరు+ఒమ్మ అనికావలెను. లేకున్న ప్రతిభంగము. ఒమ్ము=సరిపడు అని శ.ర. 'ఇది నా కొమ్మదు'. అనియు వ్యవహారము.

చలము సాధించఁబోతే చండితనములు వుట్టు
బలిమి చూపఁగఁబోతే పంతాలు హెచ్చు
గిలిగించఁబోతేను గిరలు వొళ్లెల్లా నిండు
వులివచ్చిసేయ కూరకుండుమనఁగదవే ॥ ఎప్పు ॥

బట్టబయలీఁదించఁబోతే భావము చిక్కులువడు
గుట్టులు చూపఁగఁబోతే కుప్పలౌఁ దమి
ఇట్టె శ్రీవేఁకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
వొట్టు చెల్లె నిఁక నూరకుండుమనఁగదవే ॥ ఎప్పు ॥ 466

బౌళి

ఔనటవే ఇంకా నేమందునే నేను
వైనవైనాలుగా నన్నీ వా(వ్రా?)సిత్తునటవే ॥ పల్లవి ॥

చెల్లునే తాఁజేసినచేఁతలెల్లాను
వెల్లవిరాయఁ బనులు వేగినంతాను
కల్లలూఁగావే తన చక్కనిమాఁటలూ
పల్లదాన నన్నిటాను పంతగాఁడే తాను ॥ ఔన ॥

మెచ్చిరే యందరూఁ దనమేకులెల్లాను
పచ్చితనమెల్లా బంగారాయనే
తచ్చనలూఁగావే తన తగవులునూ
వొచ్చెములేవిగుణాలవారపరే తానూ ॥ ఔన ॥

దక్కెనే తనకు మంచితనమెల్లాను
మొక్కినట్టే వరమిచ్చె ముమ్మాటికివి
యిక్కువతో నన్నుఁ గూడి యిచ్చె మేలెల్లా
వెక్కసపుశ్రీవేంకటవిభుఁడే తానూ ॥ ఔన ॥ 467

ఆహిరినాట

ఆఁడువారి నీ వింత అగడాలు సేతురా
వోఁడిమిఁ జెమటఁ దోఁగె వొంచి వయ్యాదెల్లాను ॥ పల్లవి ॥

కొప్పువెట్టుకొనఁగాను కొమ్మకరమూలములు
తప్పకచూచి నీ వంతలో నవ్వఁగా
చిప్పిలసిగ్గున నాకె చేతు లదుముకొంటేను
ముప్పిరిగొని మోముపై ముంచుకొనె నెరులు ॥ ఆఁడు ॥

కోక గట్టుకొనఁగాను కొమ్మెరుఁగైనతొడలు
జోకలుగా నీవట్టె చూచి నవ్వఁగా
కాకరిసిగ్గునను మో కారించుక కూచుండే
ఆకెమొలనూలిగంట లట్టె కుప్పవడెను ॥ ఆఁడు ॥

హారములు వెట్టుకోఁగా నందపుచన్నులు చూచి
నేరిచి శ్రీవేంకటేశ నీవు నవ్వఁగా
ఆరీతి సిగ్గున విన్ను నట్టె కాఁగిలించుకొంటే
కూరిమితోఁ బులకలు కోరి జాజుకొనెను ॥ ఆఁడు ॥ 468

రేకు 1379 భైరవి

ఇటువంటివెలిసేల యెలయించేవు
తటుకునఁ గాఁగిలించి దయఁజూడవయ్యా ॥ పల్లవి ॥

యేపొద్దు నీతో నవ్వ నెఱుఁగు వింతేకాని
కోపగించ నెఱఁగదు కొమ్మ యఁ(యం?)తైనా
చూపుల విమఁజూచి చొక్కఁగ నెఱుఁగుఁగాని
యేపునఁ దలవంచఁగ నెఱఁగ దెప్పుడును ॥ ఇటు ॥

చలపట్టి నీతో సరసమాడ నెఱుఁగుఁగాని
యెలమిఁ బలుకఁ గుంద నెఱఁగ దీకె
వలచి ప్రియము చెప్పి వంచుకో నెఱుఁగుఁగాని
అలఁగఁగ నెఱఁగ దెఁ(దెం?)తైనా నీతోను ॥ ఇటు ॥

పానుపుపైఁ గాఁగిలించి పైకొననెఱుఁగుఁగాని
ఆనలువెట్టినాఁ బాయనెఱఁగదు
యీనెపాన శ్రీవేంకటేశ యింతిఁ గూడితివి
తేనెమో వెఱుఁగుఁగాని తెగువ యెఱఁగదు ॥ ఇటు ॥ 469

## పాడి

[1] చిట్టకీవివలెఁ దాను చిన్నచేఁతలెల్లాఁ జేసీ
యెట్టు దెలియఁగవచ్చు నెఱఁగనే నేను ॥ పల్లవి ॥

కప్పుర మిచ్చేనంటా కందువకుఁ జేయి చూపి
తప్పించి కండచక్కెరలప్ప వెట్టెను
విప్పక విజమనుచు విడెములో వేసుకొంటిఁ
గప్పి తములము తీపుగాఁగా నుమిసితినే ॥ చిట్ట ॥

ఇదె నూరినకస్తూరి ఇచ్చేనంటా ముందు చూపి
మెదిగిన మిరియము మేపి కిచ్చెనే
పుదుటున నౌనంటా వొడల నేఁ బూసుకొంటి
పదరాన వెట్టగాఁగా జలక మాడితినే ॥ చిట్ట ॥

విరుల పావిచ్చేనంటా వెనఁ బెద్దరాశి వోసి
యొరవులేకుండాఁ దాను ఇటు దాఁగెనే
పరగఁగా విమ్మనుచుఁ బవ్వళించితే నందు
తరి శ్రీవేంకటేశుఁడు తాఁ గూడె మొక్కితినే ॥ చిట్ట ॥ 470

1. 'చిట్టకము' శబ్దముపై కుతుకార్థక తద్ధితము. చిట్టకము=పరిహాసము. శృంగార చేష్ట.

సామంతం

విన్నవించితిమి నీవిద్యలెల్లాను
అన్నియుఁ జెప్పేఁగాని ఆకె నీకు బుద్ధులు ॥పల్లవి॥

వెలలేనివలపుల వేడుక కాఁద
పలుసరసంబులపగిడి గాఁద
విలువులమొమ్మెలనీటు కాఁద
పిలిచీ రావయ్య ప్రియురాలు ॥విన్న॥

చల్లేటికర్పూరపుజాజర కాఁద
గొల్లెతలమానములకొల్ల కాఁద
చల్లువెదనవ్వులనట కాఁదా
యిల్లిదె పిల్చీ రావయ్య యితవురాలు ॥విన్న॥

వంకచందురులచెక్కువన్నె కాఁదా
కొంకక కూడె నిన్నాపె కోడె కాఁదా
అంకెల శ్రీవేంకటాద్రిఅనోదకాఁదా
బింకాన బిలిచీ రావయ్య బిత్తరాయ ॥విన్న॥ 471

శుద్ధదేశి

మాతోఁ బంతాలాడేవు మరి నీవు
కాతరాన నాపెకు కడుఁగిందుపడవా ॥పల్లవి॥

మగువ మోవికి యాకు మడిచి నీవందియ్యఁగా
జిగిఁ గొనగోరు ఆపె చెక్కు దాఁకెను
పగటున నందుకుఁగాఁ బలుమారు దిట్టితేను
మొగము చూచి చేయెత్తి మొక్కవా నీవపుడు ॥మాతోఁ॥

చెలియకుఁ బత్తితోడ సేవలెల్లాఁ జేయఁగాను
కొలువులో నాపె కట్టుకొంగు జారెను
కులికి యంతలోన కూరిమిఁ గోపగించితే
పెలుచఁదనాలు మాని ప్రియములు చెప్పవా ॥ మాతోఁ॥

కాంతమ నీవు గూడి కప్పురము నోటికీఁగా
వింత పలునొకఁకులు వెల్లవిరాయ
పొంతనే శ్రీవేంకటేశ బొమ్మల జంకించితేను
బంతినే కామకలిచ్చి బంటనయ్యేననవా ॥ మాతోఁ॥ 472

దేసాళం

నే నెఱఁగినవే తొల్లి నీసుద్దులు
మానఁగదవయ్యా నీమతకము లెల్లను ॥ పల్లవి ॥

నీవున్న యిక్కు లెఱఁగి నెలఁత యీడకే వచ్చె
సేవసేయ రమ్మని చెప్పెంపితివో
వోవల నీవప్పటిని వొట్టేల పెట్టుకొనేవు
దేవరవు గావా నీవు దిమ్మరితనానకు ॥ నేనె ॥

తప్పులేక నీవన్నట్టె తారుకాణమాట లాడె
వొప్పుగఁ బదరుకొంటివో తొలుతే
కప్పికప్పి నీవేల కడునొదఁబరచేవు
యెప్పుడు రాజవుగావా యీవిద్దెలకును ॥ నేనె ॥

నెక్కొని శ్రీవేంకటేశ నీవు నవ్వినట్టె నవ్వె
యెక్కడఁ గూడితిరో యింతకముందే
చెక్కులేల నొక్కేవు చిప్పిల నవ్విట్టె కూడి
గక్కనను గురువవుగావా యీయెమ్మెలకు ॥ నేనె ॥ 473

వరాళి

ఇవి గొవ్వి నేర్చితివి యీడానాడఁ దిరిగాడి
తవిలి యొక్కటొక్కటే తలఁపునఁ బారునా ॥పల్లవి॥

వంతులేల వెట్టేవు వాసులేల రేఁచేవు
పొంతమండి నీకదేమి పొద్దువోదా
బంతికేల పిలిచేవు బాసలేల సేసేవు
కాంతల గన్నప్పుడే కడునెమ్మె వచ్చునా ॥ఇవి॥

చేతులేల చాఁచేవు సిగ్గులేల తడవేవు
రాతిరిఁబగలు నీరసమాయనా
ఘాతలేల సేసేవు కమ్మలనేల మొక్కేవు
జాతుల నీకాఁడువారు సదరములయిరా ॥ఇవి॥

గుబ్బలేల చెనకేవు గురులేల వ్రాసేవు
వుబ్బి మదనకళలు వొళ్లు నిండెనా
విబ్బరాన శ్రీవేంకటనిలయ నన్నేలితివి
అబ్బురపుసతులమే యంత నీకుఁ బ్రియము ॥ఇవి॥ 474

రేకు 1380 కాంబోది

తొలుతనే మంకువారు [1]దొడ్డివారు
చలములు సాదించితే జడుతురా చెలులు ॥పల్లవి॥

సిగ్గువడి యుండఁగాను చెలి యలిగెనంటాను
యెగ్గులువట్టి తిట్టేవు యేమయ్యా
తగ్గక నీచేసినచేఁతలూఁగాక అందుమీఁద
వెగ్గళించితేఁ జెలులు వెఱతురా యిపుడు ॥తొలు॥

1. దొడ్డివారు=గొల్లవారు.

పవ్వళించి వుండఁగాను పడఁతి మాటాడదంటా
ఇవ్వల రవ్వ సేసే వేమయ్యా
కువ్వలై నీమేనిమీఁద గురుతులూ నుండఁగాను
జవ్వనాన ఉంకించితే సైఁతురా ఇందుకు ॥ తొలు ॥

పట్టి కాఁగిలించుకోఁగా బలిమి సేసీనంటా
ఇట్టునట్టుఁ బెనఁగేవు యేమయ్యా
గుట్టున శ్రీవేంకటేశ కూడితివి మగువను
వెట్టికిఁ గొసరితేను విఱుచ(తు?)రా పంతము ॥ తొలు ॥ 475

శంకరాభరణం

వేగిరమేల వే సుపీవోలా
ఆగతులెల్లాను ఆయ్యీఁగావి ॥ పల్లవి ॥

వలపవికోలి వలపువిరాలి
యెలమివి జరపే వేమిటికి
తెలిసిం నేనూ దిష్టముగాను
చెలిమి విజమయితేఁ జెప్పేఁగావి ॥ వేగి ॥

గరివద్దపెసరు కందువకొసరు
యెటిఁగినపనులే యేమిటికి
గుటియాయ నాకు గుదిగొన్న కాకు
తటి వచ్చినప్పుడే తలపించేఁగావి ॥ వేగి ॥

కొండలనునుపు గొనకొన్ననసుపు
యెండలు నీడలు యేమిటికి
ఉండనె శ్రీవేంకటాధిప నన్నేలితివి
పండుమోవి తేనె పరపేఁగావి ॥ వేగి ॥ 476

నాదరామక్రియ

మెత్తనిమనసుదాన మిక్కిలి నేనూ
హత్తి నీవాడినట్టెల్లా నాదేవయ్యా ॥పల్లవి॥

యిప్పటినీనవ్వు లివి యెన్నిటికైనావచ్చు
వుప్పటించనోప నూరకుండవయ్యా
దప్పిదేరె నిన్నుఁజూచి దయపుట్టీ నంతలోనె
చెప్పేటిప్రియాలు నాకే సెలవాయనయ్యా ॥మెత్త॥

రొక్క పునీమాటలు రొంపిలోనికంబాలు
యెక్కడికెక్కడ మరి యెందాఁకానయ్యా
మొక్కేటినీవేసాలకు మొగమోట గనమాయ
మక్కువనీచేఁతలు సమ్మతైనట్టే అయ్యా ॥మెత్త॥

కందువనీరతు లివి కట్టఁ మంచిచద్దులు
చెంది నిన్నుఁ గూడితి తనిసితినయ్యా
అందపు శ్రీవేంకటేశ ఆసపుట్టీఁ గమ్మటివి
చందపునీమోవిలోనే చలిగొంటినయ్యా ॥మెత్త॥ 477

ధన్నాసి

ఇందరిలో నీముద్దులు యేమిచెప్పేవు
కందువతో నేకతానఁ గరుణించరాదా ॥పల్లవి॥

చెంగలువకన్నులను చెలి నిన్నుఁ జూచితేను
అంగమెల్లఁ బులకించెనది యాదేవు
యింగితాన వలపులు ఇంత నీకుఁ గలిగితే
కంగుదీర నీకె విట్టె కాఁగిలించరాదా ॥ఇంద॥

కప్పురవుఁబలుకులకాంత నీతో మాటాడితే
అప్పుడే నే భ్రమసితినవి యాదేవు
ముప్పిరిగఁ దమకము ముందు నీకింత గలితే
కప్పి పచ్చడముతోనే కాఁగిలించరాదా ॥ ఇంద ॥

వెన్నెలనవ్వులతోడ వెలఁది నిన్నుఁ గూడితే
అన్నిటాను భ్రమసితినవి యాదేవు
మన్నించి శ్రీవేంకటేశ మనసు లేకములైతే
కన్నప్పుడెల్లా నిట్టె కాఁగిలించరాదా ॥ ఇంద ॥ 478

రామక్రియ

కాదనేమా నేము నీ గయ్యాళితనములకు
ఆదెసనీ దెసను నీవాడివట్టే అయ్యేవి ॥పల్లవి॥

పంతమాడి నిన్ను వంత వరచఁగ నోపుదుమా
చెంత నుండి నీసేవ సేసేముగాక
యింత నీకు [1]వేడుకైతె నెందువో యేమిఁక నేము
అంత వేగిరించకుమీ అడివట్టె అయ్యేవి ॥ కాద ॥

సరికిబేసికి నిన్ను సాదించ నోపుదుమా
పెరరేఁచి చిత్తము రప్పించేముగాక
కరుణ నీకుఁ బుట్టితే కావిమ్మనఁగవలదా
అరుదుగాఁ గోరకు నీవాడివట్టె అయ్యేవి ॥ కాద ॥

శ్రీవేంకటేశ నిన్ను శిరదియ్య నోపుదుమా
మూవంకఁ గూడితి మిఁక మొక్కేముగాక
యీవల మన్నించితేను యెప్పుడూ నీవారమే
ఆవిధాన నింకా నీవాడివట్టె అయ్యేవి ॥ కాద ॥ 479

1. వేడుకైతి+అవి+అందువో

దేవగాంధారి

రావయ్యా వో రావయ్యా
తావుకొని నిన్నుఁ దలఁచీని ॥ పల్లవి ॥

చిప్పిలఁ జెమటలు చెక్కులవెంటాఁ
గుప్పళించీ నిదె కోమలి
దప్పిదేరుచును తనపెదవుల
పిప్పిగట్టి నిన్నుఁ బిలిచీని ॥ రావ ॥

చల్లఁబులకలు చన్నులనిండా
జల్లన నించీని జవరాలూ
వెల్లి నిట్టూర్పులు వెలయ నీయింటి-
కల్లదె వచ్చి నిన్నడిగీని ॥ రావ ॥

సిగ్గుల మొక్కులు చేతుల రెంటా
వొగ్గుచు నీకిచ్చీ నువిద
యెగ్గుల శ్రీవేంకటేశ నిన్నుఁ గూడి
అగ్గలపురతు లవే కొసరీని ॥ రావ ॥ 480

రేకు 1381 సింధురామక్రియ

మేలే యెట్టుండినాను మేనవారము
జాలిఁబెట్టి నిన్ను మరి చండిసేసేనా ॥ పల్లవి ॥

కూరిమి గలితేఁజాలు కొసరితే నేమాయ
యేరా నీతో నే నెగ్గుపట్టేనా
గారవించితేఁజాలు కడమంటే నేమాయ
రారా నిన్నంతేసి రవ్వసేసేనా ॥ మేలే ॥

కూడామాడా సంకేఁజాలు గోరగిరితే నేమాయ
ఆదరా యేమైనా మాట లవుఁగాదనేనా
వేడుక గలితేఁజాలు వెక్కసమైతే నేమాయ
పాడిదప్పకుర నీతో వంతమాడేనా ॥ మేలే ॥

నవ్వులు నవ్వితేఁజాలు నాలిసేసితే నేమాయ
జవ్వనమద మిదౌరా సాదించేనా
ఇవ్వల శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నివ్వటిల్లెరా మన్నన నీకెదురాడేనా ॥ మేలే ॥ 481

ఆహిరి

నెలఁత మేనియలపు నీదిగాదా
లలి నివియల్లాఁ జూచి లాలించవలదా ॥ పల్లవి ॥

వలపులవసివాడు వనితకు నుండఁగాను
చలము లింకానేల సరసుఁడవు
చెలపచెమటలు చెక్కులపై నుండఁగాను
కలఇకరతులను కరుణించవలదా ॥ నెలఁ ॥

పెదయాస పులకలు పెలఁదికి నుండఁగాను
బెదరుఁబరాకులేల ప్రియుఁడవు
తదఁబదేతమకము తలఁపులో నుండఁగాను
అదరి మోవి ఇచ్చి ఆదరించవలదా ॥ నెలఁ ॥

కూడినసంతోసము కోమలికి నుండఁగాను
గాదఁబెట్టనేల శ్రీవేంకటేశుఁడవు
వోదక విట్టూర్పులు వొగిఁ బుక్కిట నుండఁగ
నీదలను విలిచి మన్నించఁగవలదా ॥ నెలఁ ॥ 482

శంకరాభరణం

కొంకకువే యిఁకఁ గోమలి
పొంకమయినట్లఁ బొసఁగీఁగాని ॥ పల్లవి ॥

ధరలోపల మతి తమకము గలిగిన
సరసపుమాఁటలు చాలౌను
వొరపి చూడవే వోపిక గలిగిన
వెరుపక రమణుఁడు వచ్చీఁగాని ॥ కొంక ॥

మనకొని పైపై మోహము గలిగిన
చనవులు మనవుకు చవులౌను
పెనఁగవె వొకపతి ప్రియము గలిగితే
చొనిపి విభుఁడు దయఁజూచీఁగాని ॥ కొంక ॥

సేవసేయఁగా చిత్రము గరఁగిన
యేవేళ రతులు యితవౌను
వావి దెలుపఁగా వచ్చి వన్నెనసె
శ్రీవేంకటేశుఁడు చెలఁగీఁగాని ॥ కొంక ॥ 483

మాళవిగౌళ

వెంగెమాడేనా విన్ను వేగివంతాను
వంగతిగా మొదల విచ్చకురాల నేను ॥ పల్లవి ॥

పగదాఁటేనా నీతోఁ బక్కన వవ్వేఁగాక
యెగసక్కెలకు నీవు యెంత సేసినా
తెగనాడేనా నీవే దేవరవనేఁగాక
వగటువ నీమోవి వచ్చియై వుండినను ॥ వెంగె ॥

కోపగించేనా విన్ను గుట్టువ మెచ్చేఁగాక
మాపుదాఁకా నీవెంత మట్టుమీరినా
రాఁపువేసేనా విన్ను రసికుఁడవనేఁగాక
తోపునూకుదుగ నెంతదూరు నీపై మండినా ॥ వెంగె ॥

బొమ్మల జంకించేనా పొగడుచు నుండేఁగాక
దిమ్మరివై నీవెటు దిరిగినను
యెమ్మెలెంచేనా శ్రీవేంకటేశుఁడ వనేఁగాక
సమ్మతించి నన్నుఁగూడి సదమదమైనను ॥ వెంగె ॥ 484

## ముఖారి

ఊరకే కరఁగునా వుక్కురాతిగుండె నీది
సారెకు విన్నవించఁగా సమ్మతించితివి ॥ పల్లవి ॥

చెప్పరానియటువంటిసేవలెల్లాఁ జేయఁగాను
తప్పకుండా నేఁడు నీ చిత్తము వచ్చెను
వొప్పుగా నెప్పుడు నీవొద్ద నిట్టె వుండఁగాను
కప్పి యన్నిటా నీవు కరుణించితివి ॥ ఊర ॥

యేదలేవియటువంటిఇచ్చలెల్లా నాదఁగాను
వాదలోవనెల్లా నాకె వలచితివి
జాదతోద రేపుమాపు సారెసారె మొక్కఁగాను
యీడులేవిచనవులు యిచ్చితివి నీవు ॥ ఊర ॥

మిక్కిలిరతులఁ గూడి మీఁదమీఁద మెప్పించఁగా
మక్కువదేవులఁగా మన్నించితివి
నిక్కపుశ్రీవేంకటేశ నీవె యిన్నియును నేర్పి
వొక్కటై వన్నేలి మోవి వొసగితివి ॥ ఊర ॥ 485

పాడి

ఇంతి యివి చూచితేను యేమనునో
అంతటిలో నొకవుపాయము చూచుకోవయ్యా ॥ పల్లవి ॥

కూరిమితోడుత విన్నుఁ గొమ్మ పిలువఁగనంపె
చేరి మాయింటికివి విచ్చేయువయ్యా
జీరలు నీబుజముల సేనగా నున్న వివిగో
గారాబానఁ బచ్చడము కప్పఁగదవయ్యా ॥ ఇంతి ॥

కమ్మరాను యెదురుగాఁ గానుక లప్పటి నంపె
వుమ్మడిని మేడలోఁ గూచుండవయ్యా
సొమ్ములు వింతలు నేఁడచ్చుగా నీమేన వివే;
నెమ్మది నందుకు మాట నేరుచుకోవయ్యా ॥ ఇంతి ॥

బత్తితోడుతను నీకు పానుపు వరచె నిదె
కొత్తగా శ్రీవేంకటేశ కూడఁగదయ్యా
హత్తి పెరవాసనలు అవిగో శ్రీసతి యంపె
బత్తితో నేలితివి కప్రము పూసుకోవయ్యా ॥ ఇంతి ॥ 486

రేకు 1382 దేసాళం

తానెరుఁగు నేతతపుతనచేఁతలు
యీవిజములెల్ల మీయెదుటనేకాక ॥ పల్లవి ॥

తప్పులేదవి మంచితగవులే చెప్పివి
అప్పుడాడినమాట లాడెనటవే
దప్పి మోమునఁ దేర దయలు వుట్టించివి
యిప్పు డిందాఁకాఁ దా విట్టుండెనా ॥ తానె ॥

వడుమ నూరక ఇచట నవ్వులే నవ్వీవి
వుడివోవియాచలము లున్నవటవే
విడువ కిటు నాయెదుట వేసాలు నేసీవి
అడరి తనవోజ నే నది యెఱఁగనా ॥ తానె ॥

మొగమోటమునఁ దాను మోహములే చల్లీని
వగకాఁడు అపుడిట్ల వచ్చెనటవే
తగిలి శ్రీవేంకటోత్తముఁడు నన్నిటు గూడె
వెగటుఁగూరిము లపుడు వెలయించెనా ॥ తానె ॥ 487

ముఖారి

ఈమేలు దలఁచుకో యెప్పుడును నీమతిలో
సాములు సేసి నీతో చలము నెరపదా ॥ పల్లవి ॥

కొంతగొంత నాచెక్కు గోర నీవు గీరితేను
పంతములాడితినా పదరితినా
రంతుల వేరొకతై తే రవ్వ సేసి నీమేను
యెంతైనా నొకటికి యినుమడి సేయదా ॥ ఈమే ॥

పలుమారు నామోవిపై పలునోఁకులు వించితే
బలిమి సేసితినా పదరితినా
వెలయ వేరొకతై తే వింతలుగా వి న్నప్పటి
యెలయించి వొకటికి యినుమడి సేయదా ॥ ఈమే ॥

చందపుశ్రీవేంకటేశ చన్నులొత్తి కూడితివి
పందెములు గొంటినా పదరితినా
విందులవేరొకతై తే వేసాలెల్లాఁ జూపి
యిందరిలో వొకటికి యినుమడి సేయదా ॥ ఈమే ॥ 488

గౌళ

చేకొని నీసేవలెల్లాఁ జేసేఁగాని
యీకడ నిట్టె నీవు మాయింటికి రావయ్యా ॥పల్లవి॥

గొల్లెతలు వలచిరి కోరినట్టె నేసితివి
చెల్లునయ్య నీచేసినచేఁతలెల్లాను
మెల్లనే నీవంటుకోఁగా మేమిఁకఁ గాదనేమా
ఇల్లిదివో వున్నది మాయింటికి రావయ్యా ॥చేకొ॥

పదియారువేలింతులపతివై తి వెమ్మె మించె
యెదురు లేదయ్య నీకు నేమిటాను
పుదుటునఁ జెనకఁగా వోపననేమా నేము
యెదిగెఁ జన్నులిదె మాయింటికి రావయ్యా ॥చేకొ॥

పట్టపుదేవులు గద్దు పనులెల్లాఁ జక్కనాయ
తొట్టుకొంటివయ్య మేలు వొమ్మి నీకును
గుట్టున శ్రీవేంకటేశ కూడితి వేఁటికనేమా
యిట్టె నీవొరుగే మాయింటికి రావయ్యా ॥చేకొ॥ 489

దేశాక్షి

కానీవయ్య అందుకేమి కానవచ్చె నీసుద్దులు
గోనాలగొందుల నింత గుట్టునేసుకొందువా ॥పల్లవి॥

పెనఁగి సారెకు నిన్ను ప్రియురాలు నిలువఁగ
కొనగొనలనే నీవు కొంకేవు
పెనకులు నీమేనఁ జేసెనో యెవ్వతెయైనా
నినుఁ గల్లమోవకుంటే నీవిట్లాఁ జేతువా ॥కాని॥

వొగ్గుచు గంధము నీకు వుపిద వుయ్యఁగాను
పిగ్గులువడుచు చెక్కు చేతఁబెట్టేవు
వెగ్గళమై నీమేన వింతవాసన లున్నవో
యెగ్గులచేఁత లేకుంటే యింతేసి లోఁగుదువా ॥ కానీ ॥

మొక్కి యింతి గూడి నీకు మోవితేనె లియ్యఁగాను
అక్కమోవఁ దలవంచి అట్టె నవ్వేవు
పక్కన శ్రీవేంకటేశ పలుసోఁకు లున్నవో
తక్కు లింతేసి లేకుంటే తప్పించుకొందువా ॥ కానీ ॥ 490

## అహిరినాట

అలిగితినా నీతో అవుఁగాదని యంటినా
తలఁపులో నున్నాఁడవు దయఁజూడరా ॥ పల్లవి ॥

ఆనలేల పెట్టేవు ఆసలేల రేఁచేవు
మోవమున నున్నదాన ముద్దరాలనే
కానీలేరా నావంటికాంతలు నీకుఁ గలరు
దానికేమి అట్లానే దయఁజూడరా ॥ అలి ॥

చెక్కులేల నొక్కేవు సిగ్గులేల పుట్టించేవు
ఇక్కడనే వున్నదాన హితురాలనే
దిక్కులను మరి నీవు తెచ్చుకొంటి వింతులను
తక్కక నన్నట్లానే దయఁజూడరా ॥ అలి ॥

యేల కాఁగిలించేవు యెంత వొడఁబరచేవు
యీలాగుల నున్నదాన యిల్లాలనై
అలరి శ్రీవేంకటేశ అంత్లఁ బెండ్లాడితివి
తాలిమి నన్నట్లానే దయఁజూడరా ॥ అలి ॥ 491

బౌళిరామక్రియ

ఇందుకేల లోఁగేవు యెప్పుడూ నీకుఁ గలదే
మందలించి దూరను మరిగితి విన్నును ॥ పల్లవి ॥

చిగురుమోవిగంటికి సిగ్గులువడఁగనేల
మొగము చూడవయ్యా మొక్కే నేను
అగడుసేసినదాని ననవయ్య; నేము విన్న
యొగసక్కేలాదేమా యేల నీకు వెలపు ॥ ఇందు ॥

బడలిక గాకుండా పలుకకుండఁగనేల
కడుఁ జేయి చాఁచవయ్య కానుకిచ్చేను
జడియ నలయించినసతినే అనుటగాక
సడిఁబెట్టేనా విన్ను సారెనేల వెలపు ॥ ఇందు ॥

అంగపువాసనకుఁగా అందకు రాకుండనేల
కొంగి శ్రీవేంకటేశ కూడితి నేను
అంగడిఁ బెట్టినదాని ననరా; నే నలమేలు-
మంగను నన్నేలితివి మరి యేల వెలపు ॥ ఇందు ॥ 492

రేకు 1383 శంకరాభరణం

ఇందుకు జంకించనేలే తాను
వందడి నావల్ల చల మున్నదా ॥ పల్లవి ॥

వొద్దమండఁగా వొరసీఁ జన్నులు
పెద్దరికావకుఁ బెనఁగేనా
సుద్దులు చెప్పఁగా సోఁకె నాకెమ్మోవి
వుద్దండమ లిందుకు నున్నవటే ॥ ఇందు ॥

వీడె మియ్యఁగా వెస గోరు సోఁకె
జాడతో తను నే సాదించేనా
సాదఁగానే తనపైఁ జెమట చిందె
యీడనే పంతాలు హెచ్చెనదే ‖ ఇందు ‖

సరసమాడఁగా సమరతు లబ్బెను
నెరపి దొరతనము మించితినా
కరుణించి శ్రీవేంకటేశుఁడు గూడె
గురుఁడు మరునికివిఁ గొంకెనదే ‖ ఇందు ‖ 483

ఆహిరినాట

దొరవు సారెకు నిన్ను దూరవచ్చునా
యిరవై నీవే మమ్ము నేలేవు గాక ‖ పల్లవి ‖

మనసువచ్చితే నీవే మన్నించేవుగాక మమ్ము
యెనలేక కొసరఁగా నేమి వచ్చీని
వనములతీగెలు వసంతకాలమునాఁడు
ఘనమై పూచినపాటే కాచీఁగాక ‖ దొర ‖

కరుణ నీకుఁ బుట్టితే కలసేవుగాక నేఁడే
వరుసఁ బెనఁగఁగాను వచ్చేదేమి
గరిమ నేరులు వానకాలమున మేఘాలు-
గురిసినపాటి నీళ్లు పారుఁగాక ‖ దొర ‖

యేలితి శ్రీవేంకటేశ యీడేరించేవుగాక
కాలమెల్లాఁ గోరఁగాను కలిగేదేమి
తాలిమితోఁ జెఱకులు తతికాలమునాఁడు
చాలా ముదిరినపాటి చవిపుట్టుఁగాక ‖ దొర ‖ 484

నాగగాంధారి

నాకు నీవే గురి నీకు నేనే సాక్షి
దాకొని నన్ను నిట్టె దయఁజూడఁగదరా ॥పల్లవి॥

యేరా నీమాఁట లెందాఁకా నాదేవు
గారవించి నాకుఁ గాఁగిలీరా
చేరి చూడఁగానే చెక్కు లెల్లాఁ జెమరించె
తారుకాణాయ వలపు దయఁజూడఁగదరా ॥నాకు॥

జలపులఁ బెట్టఁగానే స[illegible]ద్దులాయను
మఱి పచ్చడము గప్పి మన్నించరా
చిఱునవ్వు నీది చూచి చిమ్మిరేఁగెఁ బులకలు
తఱి నీకే తెలుసును దయఁజూడఁగదరా ॥నాకు॥

గక్కన నీవు గూడఁగా గనమాయ కోరికలు
మొక్కేఁగాని నాకు మోవియ్యరా
నిక్కి శ్రీవేంకటేశుఁడ నినుఁజూచి దప్పిదేరె
దక్కితివి నన్ను నిట్టె దయఁజూడఁగదరా ॥నాకు॥ 495

నాదరామక్రియ

ఎటువలె నమ్మించీనే యింకఁ దనచిత్తము
ఆటమటముల కోప వడుగరే ఆతని ॥పల్లవి॥

మొగము చూచునందాఁకానే మంచినయెడమాటలు
నగినదాఁకానే నంటునేర్పులు
తగులైనదాఁకానే తలపోఁతలెల్లాను
అగపడ్డదాఁకానే ఆసలన్నియును ॥ఎటు॥

నను పైనదాఁకానే నయగారితనములు
మనసుగన్నదాఁకానే మంతనములు
చనవిచ్చుదాఁకానే సముకపుఁగొలువులు
యెనసినదాఁకానే యిచ్చకములు ॥ ఎటు ॥

తతి గూడుదాఁకానే తరితీపులన్నియును
రతిఁ జొక్కుదాఁకానే సమ్మతిమొక్కులు
యితవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
సతమైనదాఁకానే చవులెల్లాను ॥ ఎటు ॥ 496

హిందోళవసంతం

మంచికాలమాయ మరువిరాజ్యాన
కొంచక యీతనిఁ గొనియాడరే ॥ పల్లవి ॥

సరసమాడఁగఁ జవులు పుట్టెను
గరిమ నావిభుఁ గంటిరటే
తెరదియ్యఁగానే తేనెమోవి నూరె
కరుణ నామీఁదఁ గలిగెనే ॥ మంచి ॥

కానుక లియ్యఁగఁ గాంతలు పుట్టెను
పీనినేరుపులు వింటిరటే
నానుపుఁజెమట నవ్వులు రేఁచెను
మానక విన్నిటై మరిగెనే ॥ మంచి ॥

పూవుల వేయఁగఁ బొందులు గూడెను
శ్రీవేంకటేశు మెచ్చితిరటే
చేపట్టి తియ్యఁగ చెలఁగెఁ గళలు
వావితో నాకిట్టె వలచెనే ॥ మంచి ॥ 497

నాగవరాళి

భోగించవయ్యా మంచిభోగములెల్ల
తీగెసాగినమోహమే దిష్టసంపదాయను ॥పల్లవి॥

పలుకుఁదేనెలు నీపైఁ బలుమారుఁ జిందఁగాను
కలిమిఁ బన్నీటిజలకములాయను
కలికి నవ్వులు నట్టె కలయఁగఁ జల్లఁగాను
అలరి కప్పురకాపునై మించెను ॥భోగిం॥

జిగి సింగారరసము చేరి నీపై నొలుకఁగా
పొగరుమించుల తట్టుపుణుఁగాయను
మగువకాంతులు నిమ్ము మచ్చికతో నొరయఁగా
సొగసుగాఁ జాతుకొన్నసొమ్ములాయను ॥భోగిం॥

అలమేల్మంగ నీవురమందు నెలవుకొనఁగా
బలిమి నన్నిటా నీభాగ్యమాయను
యెలమి శ్రీవేంకటేశ యీకె నినుఁ గూడఁగాను
కలకాలమును నిట్టె కాణాచాయను భోగిం॥ 498

రేకు 1384 దేవగాంధారి

నీయంతవట్టుకు నీవు నెరవాదివి
పాయపుసతులమేవిబదలి కెలఁగవు ॥పల్లవి॥

తగవు జెప్ప జాణవు తరుణులకై తేమ
యెగసక్కెపునీచేత లెంచుకొనవు
మొగము చూచితే నీకు మోవినే నవ్వులు వచ్చు
అగడైనకాంతలు అలసే దెలఁగవు ॥నీయం॥

అందాలు సేయనేర్తువు అంగనలమాటలు
విందుల నీసుద్దులైతే విచారించవు
చెంది నీకు మొక్కితేను సిగ్గులు పైపైనే వుండు
కందువ చెలులలోనికాక నీవెఱఁగవు ॥ నీయం ॥

వొక్కటి సేయనోపుదు వొరసైవనవతుల
తక్కరి శ్రీవేంకటేశ తరి యెంచవు
మిక్కిలి కూడితే నలమేల్మంగనవి చొక్కవు
దక్కనట్టివవితలతచ్చన లెఱఁగవు ॥ నీయం ॥ 499

వరాళి

తనంతనే మంచివయ్యా తరవాతిపనులెల్లా
యెనసి యాతని వంక లెట్టు దిద్దే మిపుదు ॥ పల్లవి ॥

మలసి వొడఁబరచ మనవపమా అతఁడు
తెలిసి మాటలనే పందిలి వెట్టీని
కలికి చెనకితేనే గడుసు విడుచుఁగాక
చెలుల మీతని నేమిసేయఁగల మిపుదు ॥ తనం ॥

తాటించిపెనఁగ మనతరములా యాతఁడు
తేటలనేరుపులు గాదెలఁబోసీని
నాటించేయింతిగోరిక నయానకు వచ్చుఁగాక
యేటతోఁ జెలుల మింతే యేమిసేసే మిపుదు ॥ తనం ॥

చిమ్మిరేఁచనోపుదుమా శ్రీవేంకటేశ్వరుఁడు
మమ్మఁడిఁ దనవిజమే మొలపించీని
పమ్మి యలమేలుమంగ పైకొనఁగాఁ గూడెఁగాక
ఇమ్ముల నిద్దరిభావ మెట్టుమెచ్చే మిపుదు ॥ తనం ॥ 500

పాడి

బంతిపక్షములనే బదుకదొరకొంటివి
వింతవింతచవులే వెదకేవు ॥ పల్లవి ॥

ఆపె చేవట్టుకుండఁగా అట్టె నాతో మాటాడేవు
తీపులను బంకించి తిట్టదా విన్ను
యేపున నొకతె నీకు నేఁకారఁగానే నీవు
పైపైనే మాకింత బత్తిసేసేవు ॥ బంతి ॥

కన్నుల నాపె మొక్కఁగా కడు నాతో నవ్వేవు
సన్నల ముందలవట్టి సాదించదా
మున్నిటమంది యొకతె మొగము చూడఁగానె
వన్నెలుగా నామీఁద వలపు చల్లేవు ॥ బంతి ॥

విందువెట్టి యాపె నీకు విడెము చేతికియ్యఁగా
కందువఁ గూడుతా నన్నుఁ గాఁగిలించేవు
అంది నే నలమేల్మంగ నాపె నీకుఁ జొక్కఁగాను
పొంది శ్రీవేంకటేశుఁడ భోగించేవు ॥ బంతి ॥ 501

లలిత

ఎంత తాలిమిగలది యీమగువ
వింతలు సేయక విన్ను వేఁడుకొనెను ॥ పల్లవి ॥

యెనలేనిచేఁతలు నీవేమేమి సేసినాను
నమవుసేసుక ఆపె నవ్వు నవ్వెను
కొనబుతవాన మరి గురు లెన్నియుండినాను
చనవుసేసుక మోవి చవిగొనెను ॥ ఎంత ॥

కడనుండి యెందరేసికాంతలఁ దెచ్చుకొన్నాను
బడిబడి నిమీఁద బత్తి సేసెను
తరవుగా నాడనుండి తగ నిప్పుడు వచ్చినా
వాడివట్టి తీసి నీతో నానగూడెను ॥ ఎంత ॥

పోరచి తమ్ములము నీపుక్కిటనే వుండఁగాను
గారవించి కాఁగిటఁ గలసె నిన్ను
యీరీతి శ్రీవేంకటేశ యెంత రతినేసినాను
అరయ నోపనవక అభె సమ్మతించెను ॥ ఎంత ॥ 502

మంగళకౌసిక

చెప్పఁగదరా నాతో సిగ్గువడక
చొప్పులెత్తి చొప్పులెత్తి సొలసి యేమనెరా ॥ పల్లవి ॥

పంతాన మాయింటికి పలుమారు రాఁగాను
యింతి నీమొగము చూచి యేమనెరా
చెంతల నేఁ దప్పటి నీచెక్కులరేకలు చూచి
మంతనానఁ జెవిలోన మఱియు నేమనెరా ॥ చెప్పఁ ॥

చెచ్చెర నీవు నాచేతికి లోనై వుండఁగా
యెచ్చుకుందులాడి యాపె యేమనెరా
పచ్చిచెమటలమేను వాఁతిపడి కాఁగిలించి
విచ్చనవిడిని నీతో వెంగేన నేమనెరా ॥ చెప్పఁ ॥

మఱఁగులేక నీవు నామంచముపై నుండఁగాను
యెఱిఁగి కొసరి నిన్ను నేమనెరా
యెఱుకతో శ్రీవేంకటేశ యేలితి నిద్దరి
జఱసి నిన్ను మెచ్చి [1]సమ్మతించేమనెరా ॥ చెప్పఁ ॥ 503

1. సమ్మతించి+ఏమనెరా.

సామంతం

రాఁగదే నీవొప్పు రమణుని కిట్టె
వేఁగలుదేరియు చిగురాయనే ॥పల్లవి॥

చెక్కులచేఁత(చేతు?)లు సిగ్గుల మొక్కులు
అక్కరతో నీకమరెనే
అక్కజమై పతి కని చూడఁజూడ
తక్కక తలపోఁతలై మించెనే ॥రాఁగ॥

పలచని నవ్వులు పయ్యదకప్పులు
చెలియ నీకైతే సింగారమే
నెలవై నీవిభునికి నివియెల్లా
అలరి నందించి ఆసలాయనే ॥రాఁగ॥

కారేటిచెమటలు కాఁగిలింపులును
నేరుపుతోడుత నీభాగ్యమే
యీరీతి శ్రీవేంకటేశ్వరుని కివి
సారపురతికిఁ జవులై వున్నవే ॥రాఁగ॥ 504

రేకు 1385 రామక్రియ

ఎవ్వరు గలిగినాను యింత నేరరు
నివ్వటిల్లినదొరవు నీవాడవే ॥పల్లవి॥

మటి వలపించితివి మచ్చికతో రమణుల
మెఱసి వేల్పరులలో మేఁటివాడవే
వెఱ పించుకంటా తేర వెంటవెంటఁ దిప్పితివి
నెఱతనపుజాణవు నీవాడవే ॥ఎవ్వ॥

చొక్కించి విభుని మేనిసొమ్మొప్పించుకొంటివి
నెక్కొన్న భాగ్యజీవివి నీవౌదువే
చెక్కునొక్కి పనులు సేయించుకొంటివి
వెక్కముఁబంతకత్తెవు నీవౌదువే ॥ ఎవ్వ ॥

ఇయ్యెడ శ్రీవేంకటేశు నిన్నిటాముఁ గూడితివి
నెయ్యపువాసికత్తెవు నీవౌదువే
వొయ్యనే అతవి నన్ను నొనగూరిచితి విట్టె
[1]వియ్యందే దయగలదు నీవౌదువే ॥ ఎవ్వ ॥ 505

తెలుఁగుఁ గాంబోది

చిన్నతనాలే సేసేవు పెద్దవెరిగి
విన్నపములెల్లాఁ జేసి వేసరితి ॥ పల్లవి ॥

యిదివో నీ విందాఁకా నేడ నుంటివయ్యా
వెదకివెదకి విన్ను వేసరితి
వదలక పసపెటువలె నంటెనయ్యా
కదిసి తోమి తోమి కదిగి వేసరితి ॥ చిన్న ॥

యిటువలె పనులు నీవేమి సేసితివయ్యా
విటతనా లివి చూచి వేసారితి
ఘటన నెవ్వతె నేస్తకాఁడ వైతివయ్యా
అటమటాలెల్లా దిద్ది అప్పుడే వేసరితి ॥ చిన్న ॥

వాడిక నెవ్వతె యలవాటు సేసెనయ్యా
వీడెపుమోవి యిచ్చి వేసారితి
యీడనే శ్రీవేంకటేశ యేలుకొంటి వౌనయ్యా
కూడిన పిరితు లెంచికొని నే వేసరితి ॥ చిన్న ॥ 506

1. వి+అందే. ఇది వింతప్రయోగ మంది.

నాదరామక్రియ

అవునయ్యా మంచివాఁడ వౌదువయ్యా
యివలానవలా విన్ను వింత సేయఁజెల్లునా ॥ పల్లవి ॥

అంగనచే నొకమాఁట అప్పణ యిప్పించరాదా
చెంగట నీచెప్పినట్టు సేనేఁగాని
ముంగిటను నీవూడిగమున కంపినంతలోనే
యెంగిలిగా నీకు నే వింత సేయఁజెల్లునా ॥ అవు ॥

చెలిచేతఁ దనకిది నెలవనిపించరాదా
అలరి నీతోఁ బెండ్లాడేఁగాని
కలికి నాచేత నీకు కాని కంపినంతలోనే
యెలమి విన్నంటుకొని యింత సేయఁజెల్లునా ॥ అవు ॥

వనితచేత నాకు వంతు పెట్టించుకోరాదా
వొనర శ్రీవేంకటేశ వూఁకొనేఁగాని
చెనకి నీతో మాట చెప్పి రమ్మన్నంతలోనే
యెనసితివి నన్ను నే వింత సేయఁజెల్లునా ॥ అవు ॥ 507

శంకరాభరణం

పొంచి నీతొల్లిటిపొందులు చూతము
మించి నిజమైతే మెచ్చేనయ్యా ॥ పల్లవి ॥

తెరమఱఁగున తెలివ మాఁటాడె
అరుదంది నీవు ఆలించేవు
తాతెయ్యా అరచి యెఱుఁగుదువా అపె యెవ్వతెయౌతా
శిరసెత్తి నాతోఁ జెప్పవయ్యా ॥ పొంచి ॥

చేయిచాఁచి నిన్ను చెండువ వేసెను
  సోయగాన నట్టె చూచేవు
దాయకపాయక తలఁచుకొంటివా
  యీయెడ నా కానతియ్యవయ్యా ॥పొంచి॥

గక్కనఁ బైకొని కాఁగిలించుకొనె
  చిక్కి ధ్యానములు సేసేవు
యిక్కువ శ్రీవేంకటేశ నన్నేలితి
  చొక్కి నవ్వేవు నాసుద్దు లివయ(యా?) ॥పొంచి॥ 508

శుద్ధవసంతం

కపటాలు వద్దుగాక కాంతలతోను
  యిపుడు చెల్లదా నీకు యెంతసేసినాను ॥పల్లవి॥

తమకాన నాపెపేరు తడవితి వింతేకాక
  మమకారము నామీఁద మఱచేవా
భ్రమసితినంటా నాతో బాసలు సేయఁగనేల
  జమళి నెందరైనా దోసములా నీకేమీ ॥కప॥

నమున నాతోడ నవ్వితి వింతేకాక
  యెమసి నన్ను మన్నించ కేల మానేవు
పవిపరాకంటా నొడఁబఱచఁగ నింతయేల
  తవిలి చాలకుండితే తగదా నీకేమీ ॥కప॥

సొలసి మొక్కఁగా నాపెఁ జూచితి వింతేకాక
  కలసితివి నన్ను నీకడ మున్నదా
తొలుతటిపొందులంటా తొరలించ నిపుడేల
  చెలితో శ్రీవేంకటేశ సిగ్గా నీకేమీ ॥కప॥ 509

సింధురామక్రియ

మేలు మేలయ్యా విన్న మెచ్చితిమి
తాలిమితోడుత నేఁడు తగ వెలిఁగితివా ॥ పల్లవి ॥

సముకాన మెచ్చేవు సారెసారెఁ బొగడేవు
రమణిగు బ్బెటఁగవా రతులఁ దొల్లి
చెమటలు దుడిచేవు చేసురటి విసరేవు
నెమకి చుట్టరికము నేఁ దెలిఁగితివా ॥ మేలు ॥

చెక్కులొత్తె నొక్కేవు శిరసెత్తి దువ్వేవు
చక్కఁదనములు నీ వెంచవా తొల్లి
అక్కరతోఁ బొదిగేవు అసలెల్లాఁ జూపేవు
యిక్కువతో వలపులు యిప్పుడెలిఁగితివా ॥ మేలు ॥

కందువలు చూపేవు కాఁగిటను వించేవు
పొందులు యివెల్లాఁ దలపోయవా తొల్లి
అంది శ్రీవేంకటేశుఁడ అంగనఁ గూడితి విట్టె
అందపువేడుకలు నేఁడల్లె యెలిఁగితివా ॥ మేలు ॥ 510

రేకు 1386 ముఖారి

వెలయఁ బెండ్లాడితివి వెలపేఁటికి
వెలకా వేగు నుండఁగా వెలపేఁటికి ॥ పల్లవి ॥

పాదిపంతము లెరిఁగి బ్రదికించే మొగఁడవు
వేడుక నీవు సేయఁగ వెలపేఁటికి
వాడికసతులలోన వలసినయట్టు మన్నించి
పీదెము నియ్యఁగాను వెలపేఁటికి ॥ వెల ॥

ఆస యిచ్చినవాఁడవు ఆదరించిననామీఁద
వేసితివి నీచేయి వెఱపేఁటికి
యీసుద్దులెల్లా విని యెదుటనే నీవుండి
వేసారక బాసియ్యఁగ వెఱపేఁటికి ॥ వెల ॥

ఘనుఁడ శ్రీవేంకటేశ కాఁగిలించి నన్ను నేలి
వెనుబలమై యుండఁగా వెఱపేఁటికి
పవితోడ రతులను పంతమిచ్చి పారెసారె
వినయాలు నేయఁగాను వెఱపేఁటికి ॥ వెల ॥ 511

రామక్రియ

నయమున నెంతయినా నవ్వవయ్యా
జయముగా నీకుఁ జేయిచాఁచితే నేమాయను ॥ పల్లవి ॥

వేడుకై తేఁజాలు నీకు వేమారుఁ బువ్వులను
వీడుపడకుండా నన్ను వేయవయ్యా
కోడెకాఁడవు మొదల కొమరెవయసుదాన
యీడనే పంతము నేను యిచ్చితే నేమాయను ॥ నయ ॥

చలము చెల్లితేఁజాలు సరుగఁ బన్నీటను
చలువగా వసంతము చల్లవయ్యా
బలిమికాఁడవు నీవు బత్తిగలదాన నేను
వొలిసి నీచేఁతలకు నోర్చితే నేమాయను ॥ నయ ॥

కావలసితేఁజాలు కాఁగిలించి నీవు నన్ను
యీవల విన్నిటాను యేలవయ్యా
శ్రీవేంకటేశుఁడ నీవుచేకొన్నయాలను నేను
మోవరావి వలపుతో మొక్కితే నేమాయను ॥ నయ ॥ 512

## పాడి

చూతముగా నేఁడు నీనుగుడతనములెల్లా
యేతులకు నెంచితే వూరెల్లా గొల్లెతలే ॥ పల్లవి ॥

వంతుల కింతులు నీపై వలపులు చల్లేరు
యెంతని మోచేవయ్యా ఇప్పుడు నీవు
దొంతులువెట్టే రప్పటి దొడ్డదొడ్డకుచముల
అంతటి కీవురమెట్టు ఆనుకొనీనో ॥ చూత ॥

మోవులెత్తుకొ విందరు మోవితేనె లొసఁగేరు
యేమి సేసేవయ్యా నీవు యీఁతామోఁతలు
వాములు వేసేరు నీపై వడిగా రేపల్లెవారు
వోముచు నీతురుమెట్టు వోరుచుకొనీనో ॥ చూత ॥

సొలసి కన్నుఁగలువ చూపులనుఁ బూజించేరు
కొలఁదెట్టు పెట్టేవయ్యా కుప్పలాయను
అలమి విన్నుఁ గూడి అందరముఁ బిలిచేము
వెలయ శ్రీవేంకటేశ నీను లెట్టు వొందీనో ॥ చూత ॥ 513

## భైరవి

ఏమి గలగిన నేనే యిముడుకొందుఁగాక
వేమారును నీగుట్టు వెలివేతునా ॥ పల్లవి ॥

చెలరేఁగి నీవు నాతో చెప్పినమాటలెల్లా
అలరి తెరమాఁటున నాపె వినెను
చెలువుఁడ నేనే చెప్పితినంటా నీవు
పలికేవు నే విన్ను బయలుపరతునా ॥ ఏమి ॥

నవిచి నాతో [1]నాపెను నవ్విన నవ్వులెల్లా
తనకుఁదానే యెట్టో తాఁ జూచెను
ఇనుమడిగా నేనే యెరిఁగించితినంటా
గునిసేవు నే విన్ను కొరత లెన్నదునా ॥ఏమి॥

ఆపెనేసివగుఱుతు లట్టె చూపినవెల్లా
వైపుగాఁ దెలిసె నెవ్వరు చెప్పిరో
యేపున శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
రూపించేవు నే విన్ను రొచ్చులు నేయుదునా ॥ఏమి॥ 514

మాళవిగౌళ

తటితో నీచేతిదింతే ధర్మపుణ్యము
యెఱుఁగుదు మన్నియు విన్నేమనేమయ్యా ॥పల్లవి॥

చెక్కుటిచేతితోడ సిగ్గులనవ్వులతోడ
తక్కక చెలి యింటిలో తా నున్నది
చొక్కటాలాడేవు నీవు సుదతులతో యీడ
యిక్కడ విందరము విన్నేమనేమయ్యా ॥తటి॥

సింగారభావాలతోడ చెంపచెమటలతోడ
అంగన మేడలోన ఆసాస నున్నది
ముంగిట నీవైతేను కమ్మెక రచ్చలునేసేవు
ఇంగితము గంటిమి విన్నేమనేమయ్యా ॥తటి॥

కన్నులతేటలతోడ కడుఁదమకముతోడ
యెన్నిక నీకాఁగిటిలో యింతి వున్నది
మన్నించి శ్రీవేంకటేశ మంచముపై నున్నాఁడవు
యిన్నిటాను జాణఁడవు విన్నేమనేమయ్యా ॥తటి॥ 515

---

1. ఆపెను = ఆపెయును అనియా? ఆపెను తరువాత 'నీవు' అనియుండే అన్వయము సులభమేమో?

దేసాళం

ఏల తప్పులువట్టేవు యిట్టె నన్ను మన్నించు
తాలిమితో నుండితేనే తగ నీకుచ్చితమా ॥ పల్లవి ॥

నీటున నన్నివిధాలా నీచేత నేఁ దనిసితి
మాటలాడకుండితేనే మంకుఁదనమా
చీటికిమాటికి లోలో పిగ్గులనుఁ దలవంచి
గాఁటానఁ జూడకుండితే గర్వమా ఇది ॥ ఏల ॥

మలుగుపై నొరగుండి మరి నీవు రాఁగాను
తలుపు మూయవచ్చితే దంటతనమా
వొలసి నీవు నన్నుఁ బూవులను వేయఁగాను
కలఁగక వుండితేనే గట్టువాయినా ॥ ఏల ॥

రట్టుగాను నీవు మాటలిట్టె నాతో నాడఁగాను
గుట్టుతోడ నుండితేనే గొంటుఁదనమా
యిట్టె శ్రీవేంకటేశ యేలి కాఁగిలించితివి
నెట్టన నిన్ను మెచ్చితే నిండినరాజసమా ॥ ఏల ॥ 516

రేకు 1387 అహిరి

మంచివాఁడ వౌదువయ్య మగువ నింత యేఁతురా
అంచెల నిప్పుడే నీవు ఆదరించవలదా ॥ పల్లవి ॥

మగవాఁ డేమిచేసినా మాటలే పెంతురుగాక
తగవులఁబెట్టుదురా తరుణులు
సొగిసి నీ వెంతేసిజాజిగాఁడవైనాను
తగులువిరిపందేలు తరుణు లాడుదురా ॥ మంచి ॥

చలము సాదించేవాని జంకింతురుగాక
బలువులు చూపుదురా పడఁతులు
వెలలేనివలపులవేఁటకాఁడవు నీవైతే
చలివాసి తమగాలు సకియ లెక్కుదురా ॥మంచి॥

చేవలు మీరినవానిఁ జేవట్టి తీతురుగాక
వావాతఁ దిట్టుదురా వనితలు
శ్రీవేంకటేశ యీపెను చేరి నీవెంత గూడినా
కావిరిఁ దమగుట్లు కాంతలు చెప్పుదురా ॥మంచి॥ 517

బౌళి

ఇట్టె ఆదరించరాదా ఇఁకనైనాను
అట్టాయ నిందరిలోన నెట్టన యీరమణి ॥పల్లవి॥

పట్టెమంచముపై నీవు పవ్వళించి వుండఁగాను
బట్టబయ లాపె వచ్చి పాదాలొత్తీని
గుట్టున నీవది యెఱుఁగుదువో యెఱఁగవో
వెట్టిసేవలు సేసెను వెలఁది యిందాఁకను ॥ఇట్టె॥

సందడిఁ బరాకై నీవు చదురంగమాడఁగాను
అంది యీకె చెవిలో నేకాంతమాడీని
విందువలె నీ వవి వింటివో వినవో కాని
మందుల నూరె మగువ యిందాఁకను ॥ఇట్టె॥

కొండపై శ్రీవేంకటేశ కొలువై నీ వుండఁగాను
నిండుఁజన్నుల నొత్తీని విన్ను నాపె
అండనే నన్నేలితివి అది చూచితివో లేదో
బందుసేసె విన్నిటాను పడఁతి ఇందాఁకను ॥ఇట్టె॥ 518

## సామంతం

ఆనతీవయ్యా అనుమానించక
దానికేమి యింకఁ దప్పుగాదు ॥ పల్లవి ॥

రవ్వలుసేసిటు రాపైతివి విన్న
నవ్వులు నవ్వఁగ నమ్మితివి
యెవ్వరో చెప్పఁగ నీద నున్నాఁడవు
చివ్వన వలపులు చేచిక్కె నా ॥ ఆన ॥

అగడుగ నాకెలంకనే వుంటివి
మొగము చూడఁగా మొక్కితిని
వెగటుదీరఁగ వీడెమిచ్చే నీకు
తగవుతో దయదలఁచితివా ॥ ఆన ॥

దీ(ధీ?)రత వెంటనే తెచ్చితి వాకతెనుఁ
గోరి మన్నించఁగఁ గూడితివి
యీరీతి శ్రీవేంకటేశ చొక్కితి విందు
యేరా చనవెల్లా నిచ్చితివా ॥ ఆన ॥ 519

## హిందోళం

నీవల్లవచ్చినమేలు నీకే తెలుసును
ఆవటించి నేను వినే నానతీవయ్యా ॥ పల్లవి ॥

తక్కక విన్నవిట్టె తప్పకచూచితేను
చెక్కునఁ జేయివెట్టుక సిగ్గువడేవు
చక్కని నీమేనికి మచ్చములేమైనా వచ్చెనో
అక్కరతో నే నెఱఁగ నానతీయవయ్యా ॥ నీవ ॥

నెయ్యముతోడుత విట్టె నీమీఁదఁ జేయివేసితే
వొయ్యనే చేతులెత్తి వొద్దుకొనేవు
నెయ్యావ మరుముద్రలు నెలఁతలెల్లా వించిరో
అయ్యోదఁగలసుద్దులు ఆనతీవయ్యా ॥ నీవ ॥

ముచ్చట శ్రీవేంకటేశ మోవితేనె లడిగితే
రచ్చల నవ్వుతాను శిరసువంచేవు
యెచ్చరి నన్నుఁగూడితి వింకా నేమిదలఁచేవో
అచ్చలావ నాకిట్టె ఆనతీవయ్యా ॥ నీవ ॥ 520

ముఖారి

ఏమీ ననకురే యిచ్చకములే యాడరే
చేముంచి నవ్వకురే సిగ్గువడీ నాతఁడు ॥ పల్లవి ॥

గందము మేనఁ బుయ్యరే కప్పురము నోటికీరే
యెందుండి వచ్చెనో విభుఁ డింత యలసి
విందువలె మరి నేను వెనక మాటాడేఁగావి
చెంది మీరు మాటాడరే సిగ్గువడీ నాతఁడు ॥ ఏమీ ॥

దప్పికిఁ బన్నీరియ్యరే తామరలు ముడువరే
కప్పి యేపనిసేసెనో కడునలసి
చప్పుడుగాక వెనక వంగడిఁ గూచుండేఁగావి
చిప్పిల మీరుండరే సిగ్గువడీ నాతఁడు ॥ ఏమీ ॥

చేపురటి విసరరే శ్రీవేంకటేశుఁడు నేఁడు
రాసికెక్క నన్నుఁ గూడె రతి వలసి
వేసరక యీపేసలే వెవకఁ బెట్టేఁగావి
సేసలు మీరు వెట్టరే సిగ్గువడీ నాతఁడు ॥ ఏమీ ॥ 521

సాళంగం

పాయపువాఁడవు నీకు పచ్చిసేఁతలు దాఁతా
ఆయములు దెలిసియు నడిగేఁగాక ॥ పల్లవి ॥

చెక్కులఁ గళలు వెక్కి చేవదేరెఁ గెమ్మోవివి
యెక్కడఁ గలిగెనయ్య యివి నీకు
చక్కనిరమణులతో సాముసేసేవాఁడవు
అక్కరా నీకివి వూర కడిగేఁగాక ॥ పాయ ॥

చెంగలించె నీకన్నులు చెమరించె మేనెల్లా
అంగవించి యేడఁజేరెనయ్యా నీకు
అంగడివలపులకు ఆసపడేటివాఁడవు
అంగమేకాదా విన్ను నడిగేఁగావి ॥ పాయ ॥

ముంచెఁ గాఁగిట వాసన మూఁపులు మూఁడాయను
కొంచక యెందు నంటించుకొంటివయ్యా
యెంచుకొవి శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
అంచల నీసాటమే అడిగేఁగాక ॥ పాయ ॥ 522

రేకు 1388 రామక్రియ

కపటపునీసుద్దులు కన్నవేకావా
నెపమున నీనేరుపు నెఱపఁగవలెనా ॥ పల్లవి ॥

నేనూ నాతఁడూ నొకటే నీవేమి చెప్పేవే
కానీలేవే యింతయేల కాఁతాళించేవే
దానికేమే సవతివొకటె యెఱఁగరా విన్ను
సోనలుగా వలపులు చొరవేయవలెనా ॥ కప ॥

అతఁడు నన్ను మన్నించు నందు కేమి సేసేవే
రాతిరిఁబగలునేల రాఁపు సేసేవే
గాతల నీకుఁ బొత్తుగలుగుట చూపనేల
యీతరవాతనే నీవు యింత నవ్వవలెనా ॥ కప ॥

శ్రీవేంకటేశుఁడు నన్నుఁ జెనకి కాఁగిటఁ గూడె
కావించి నీవిట్టె ఇచ్చకములాడవే
వావి నీకుఁ గలుగుట వాదవారే యెఱఁగరా
దేవరవలెనే ఇంత తెలుపఁగవలెనా ॥ కప ॥ 523

పాడి

ఇటువంటిదే సో యెదిరిఁజేసినచేఁత
ఘటన వట్టె తనకుఁ గలుగక పోదు ॥ పల్లవి ॥

వలపులు కదుఁజూపి వాడికలు పచరించి
పలుమారు రమణుని భ్రమఇంచేవు
బలిమినే నీవిట్లా పంతాలు మెరయఁగానే
చెలపచెమటలు నీచెక్కుల్ల విందెఁగదా ॥ ఇటు ॥

తమకములు గొనసేసి తాలిములు దూపించి
ఆమరివలపులఁ బతి సాదించేవు
సముకాన నీబింకాలు సారెకు నెరపఁగానే
కొమరెమదము నిన్ను గొబ్బన ముంచెఁగదే ॥ ఇటు ॥

భావించి చూపు చూచి పైపై వినయాలు చేసి
శ్రీవేంకటేశ్వరుఁ గూడి చిత్తగించేవు
సావధానమున రతిసాములు సేయఁగానే
నీ వలమేల్మంగవు నేర్చితివిగదవే ॥ ఇటు ॥ 524

లలిత

ఏమి విన్నవించేము యింకా నీకు
కామునిఁ గన్నతండ్రివి కరుణించవయ్యా ॥పల్లవి॥

వేమరుఁ దరుణిమీఁద వెల్లవిరి సేసేవు
కామునిగరిడిలోనికాఁతాళము
గోముల నీముద్దులకు గొల్లెత లెట్టోరిచిరో
గామిడివిద్యలకెల్లా ఘనుఁడవుగావా ॥ఏమి॥

పొసఁగక వొకమాఁటే పోగులుగాఁ దోసేవు
వనితమీఁదటను జవ్వనమదము
యెనసి పదారువేల నెంతయెలయించితివో
వినుపైనయావినోదము నీసొమ్మేకాదా ॥ఏమి॥

ముత్తిలోఁద సేసలుగా సతిపైఁ జల్లేవు
చిత్తములోపలఁ జిలిపినగజిరు
యిత్తల శ్రీవేంకటేశ యింతి నిన్నెట్టు కూడెనో
వుత్తముఁడ నీపనుల కొక్కఁడవే నీవు ॥ఏమి॥ 525

ముఖారి

ఎక్కడేమి సేసినాను యెట్టువచ్చునో పనులు
చక్కనిసతులతోడ సంతముగావయ్యా ॥పల్లవి॥

చెందిననీసతులలో చిగురుఁగొమ్మ చేఁగే
యెందరితో సాముసేసే వేమయ్యా
అందరును నరసములాడినట్టే నీవాడి
సందడి గుట్టుసేసుక చక్కనుండవయ్యా ॥ఎక్క॥

కొమ్మలమోవులలోన కొనమొదలును తీపే
యెమ్మెలకు గరిసించే వేమయ్యా
యిమ్ముల విచ్చుకముల కిచ్చకములే సేసి
నమ్మరి వడిగినట్టై చనవియ్యవయ్యా ॥ ఎక్కు ॥

యీడమన్న సతులము ఇందరు నీకొక్కవారే
యేడ గొలఁది గూడితి వేమయ్యా
జోడై యలమేల్మంగను జూచినట్టే కృపఁ జూచి
వోడక శ్రీవేంకటేశ వొద్దనుండవయ్యా ॥ ఎక్కు ॥ 526

శుద్ధవసంతం

వరునగావివరున వత్తురా తాను
అరసి నీవొకమాట అడుగరాదా ॥ పల్లవి ॥

మిక్కిలి నీతో నేను మేలములాడఁగాను
అక్కరతోఁ జూడవచ్చి నాపె యెవ్వతో
ఇక్కువచెప్పి నీవే యీడకు రమ్మనంటివో
యెక్కువై నతవవొళ్లి యెద్దతనమో ॥ వరు ॥

పొందుల నీవు నాపొత్తుల నారగించఁగా
విందులు చెప్పఁగవచ్చి వెలఁదెవ్వతో!
యిందుకు నీవు ఆసలేమైనాఁ బెట్టితివో
దించపడి తనలోవిదిట్టతూళతనమో ॥ వరు ॥

నే నలమేల్మంగనై నిన్నుఁ గూడివుండఁగాను
కానుక లియ్యఁగవచ్చీఁ గాంత యెవ్వతో
పూని శ్రీవేంకటేశుఁడ పొంది నీమతకమో
తానే నేరుచుకొనివదంటతనమో ॥ వరు ॥ 527

పాడి

నీకే తెలుసుఁగాక నెరజాణతనమెల్లా
పైకొని విన్నుఁ గొసరేపాటివారమా ॥పల్లవి॥

పంతమాడేవారితోఁద గలవు చూపుటగాక
మంతనాన నవ్వఁగాను మన్నించవద్దా
వింతవాఁడవా నీవు వెలఁదిలా గెఱఁగవా
వొంతనుండి విన్నవించి వోదిసేయఁగలమా ॥నీకే॥

చలపట్టినవారితో సాదించుటగాక
మలసి మొక్కేటివారి మన్నించవద్దా
పెలుచుమనసా నీది ప్రియము నీ వెఱఁగవా
తలఁపించి నీమీఁదితరవుకత్తెలమా ॥నీకే॥

గరివించినవారితో గరిసించవలెఁగాక
మరిగి కూడినవారి మన్నించవద్దా
అరిది శ్రీవేంకటేశ అలమేలుమంగ యీకె
వురముపై నుండఁగా విన్నొదఁబఱచేమా ॥నీకే॥ 521

రేకు 1389 అహిరినాట

సిగ్గువడ వించుకంతా చెలరేఁగేవు నీవైతే
యెగ్గులువట్టేవారెల్లా నేమందురో ॥పల్లవి॥

ఇంతి నీవు వందలాన యెదురుబడి నెక్కి
వింతలుగా నేఁగేవు వీదివీదుల
కంతలవోరబగండ్ల కడమవారెల్లాఁ జూచి
యెంతేసియాసలతోఁద నేమందురో ॥సిగ్గు॥

సరిగా గుఱ్ఱముమీఁద సతియు నీవును నెక్కి-
వరుసలను నేఁగేరు వాడవాడల
విరతితో మేడలెక్కి- నీసతులెల్లాఁ జూచి
యెరవులకాఁతాళాన నేమందురో ॥ సిగ్గు ॥

అలమేలుమంగఁ గూడి అట్టె పల్లకిమీఁద
చెలరేఁగి యేఁగేవు శ్రీవేంకటేశ
కొలిచివచ్చేటినీకొమ్మలెల్లా నట్టె చూచి
యెలమి వేడుకవుట్టి యేమందురో ॥ సిగ్గు ॥ 529

మాళవిగౌళ

ఒకరిఁ దడవితేను వోరుతురా
మొకము చూడఁగానే [1]మొరతురు గాక ॥ పల్లవి ॥

చేతనొడ్డించుకోఁగానే చెలివి పువ్వుల వేసే-
వేతుల కిందరిలోన విదేమయ్యా
కాతరించి యాపె విన్నుఁ గసరుచుఁ దిట్టఁగాను
[2]నీతరుణులెల్లాఁ జూచి విన్ను నవ్వే రిదివో ॥ ఒక ॥

సిగ్గుతోడఁ గొంకఁగానే చెనకుచు కొనగోర
అగ్గలమై చన్నులంటే వదేమయ్యా
వెగ్గల నాపె నీపెదవి గంటిసేయఁగా
విగ్గుల నీవనితలు విన్ను నవ్వే రదివో ॥ ఒక ॥

అలమేలుమంగ వచ్చె వనఁగానే కొంగువట్టే-
వెలమి శ్రీవేంకటేశ యేమయ్యా
కలసి ఆపె విన్నుఁ గళలంటి చొక్కించఁగా
నెలకొన్నకాంతలెల్ల విన్ను నవ్వే రదివో ॥ ఒక ॥ 530

---

[1] 'మొరయు' ధాతువా

సామంతం

ఇప్పటి తెలియఁగరాదు యెంత నేము చెప్పినాను
తప్పు నీపై మోచితేనే తలవంచేవుగాని ॥పల్లవి॥

ఆపె చెప్పినమాట లన్ని తారుకాణవచ్చె
యేపున నాతో బాసలేల సేసేవు
ఆపనుల నీమోవి అద్దములోఁ జూడరాదా
నీపట్టుకు సిగ్గువడి నిజమాడేవుగాని ॥ఇప్ప॥

అందరు విన్నాడుకొనే వవి నేఁడు నిజమాయ
చెంది యమరించవేల చెల్లఁబెట్టేవు
సందడి నీచెక్కు లవి చమరి చూచుకోరాదా
అందపురేకలకు నీ వటు నవ్వేవుగాని ॥ఇప్ప॥

దొడ్డికాడిగొల్లెతలదూరులు దిష్టములాయ
వొడ్డుకొనేల శ్రీవేంకటోత్తమ నీవు
జిడ్డు చూచుకోరాదా [1]చెలెలమేలుమంగను
అద్దము లే కేలితివి అట్టు మెచ్చేవుగాని ॥ఇప్ప॥ ౬౩౧

సాళంగనాట

నీవు గడించినమేలు నీవే యెఱుఁగవలె
నోవల నిదే దిష్టము చూచుకొనవయ్యా ॥పల్లవి॥

అలమేలుమంగమేనియౌవనరాజ్యమున
మొలకలపులకలు మొలచెను
బలిమితో వలపులపంటలును బండె నిదె
కలలెక్కలు విందువు గక్కన రావయ్యా ॥నీవు॥

1. చెలి+అలమేలుమంగ.

అంకెలై యీకామినిలావణ్యజలధిలోన
వుంకువకోరికలు వోడల వచ్చెను
నంకెలేక తమకపుసరకులు పచారించె
సుంకపుటాదాయము లెంచుకొనఁగదయ్యా ॥ నీవు ॥

రచనల నీకెసింగారములతోఁటలోన
కుచముల బంగారు కొప్పెర లుండె
వుచితాన శ్రీవేంకటోత్తముఁడ విన్నుఁ గూడె
ఇచటనే దాఁచుకొని యిట్టె బదుకవయ్యా ॥ నీవు ॥ 532

## దేశాక్షి

ఏలినవాఁడవు నీఇచ్చలోవివారము
యేలాగున నడిపినా ఇంతా సంతోసమే ॥ పల్లవి ॥

మలసి నీమాటలకు మారుమాట లాడనేల
వొలిసి వూఁకొంటాను వుందుదుఁగాక
చలపాదివాఁడవు నీజాడలు విడువ నెందు
చెలరేఁగి ఇట్టె చవిసేసుకొనే విన్నియు ॥ ఏలి ॥

చేసుకొన్నబాసల నీచేఁతకు చేఁత మాకేల
వోసరించి నీకు లోనై వుందేఁగాక
ఆసోదకాఁడవు విన్నవిన్నిటాఁ దమపరాదు
వాసితోనే మెచ్చి సేవలుసేసే విపుడు ॥ ఏలి ॥

చేవదేరెఁ గూడితివి సిగ్గుకు సిగ్గిఁకనేల
వోవరిలో నవ్వుకొంటా నుండేఁగాక
శ్రీవేంకటేశుఁడవు చెల్లుబడి విడువవు
భావించి నీవారమై బతికేము నేము ॥ ఏలి ॥ 533

పూర్వగౌళ

చెప్పవయ్య వినేఁగాని చెవులు చల్లఁగా నేఁడు
దప్పిదేరి నీమనసు తమకించెనా ॥ పల్లవి ॥

వలపులనీసుద్దులే వడిగాఁ జెప్పేవు నాతో
వెలయ వింకా నవి వేడుకయ్యీనా
మొలకలు చన్నులంటా మొందరనే పొగడేవు
అలర నందుపై నీకు ఆసలు పుట్టీనా ॥ చెప్ప ॥

నావద్దనే కూచుండి నవ్వులెల్లా నవ్వేవు
చేవదేరి నీమదము చిమ్మిరేఁగెనా
భావించి నేఁ బండుండఁగా పక్క విట్టె పండుండేవు
కావలసి నామీఁద కరుణ వొడమెనా ॥ చెప్ప ॥

తప్పకిట్టె నామోము తలిగొని చూచేవు
ముప్పిరి నాకింత మోహించితివా
కప్పి శ్రీవేంకటేశుఁడ కాఁగిలించి కూడితివి
యెప్పుడు నాకీచనవు లియ్యదొరకొంటివా ॥ చెప్ప ॥ 584

రేకు 1390 వరాళి

ఇంకానేల మఱఁగులు ఇద్దరికివి
పంకించక సోబానఁ బాడేము నేము ॥ పల్లవి ॥

సురటి విసరీ నీకుఁ జూడరాదా ఆపె దిక్కు
శిరసువంచుక యేల సిగ్గువడేవు
ఇరవుగా నెరిఁగిరి ఇందరు నీసుద్దులు
పరగఁగ సోబానఁ బాడేము నేము ॥ ఇంకా ॥

ఆకుమడిచిచ్చి నీకు నంది పుచ్చుకొనరాదా
చేకొని మరినేల సిగ్గువడేవు
కోకలఁ బైగుఱుతులు సొరిది బాయటఁబడె
పైకొలిపి సోబానఁ బాడేము నేము ॥ఇంకా॥

వూడిగము సేసేయాపె వావగూడి మెచ్చరాదా
చేడెలు చూడఁగానేల సిగ్గువడేవు
కూడితివి నన్ను నిట్టె కోరి శ్రీవేంకటేశుఁడ
పాడితోడ సోబానఁ బాడేము నేము ॥ఇంకా॥ 535

శ్రీరాగం

[1] చిత్తమురా విన్నపము సేసేఁగాని
తత్తరించ కివ్వలికి దాఁటిరావయ్యా ॥పల్లవి॥

వలపు లీఁతలబంటి వాసులు రొమ్ములబంటి
పొలసితే మాటలు పుక్కిటిబంటి
అలసి అవ్వలనుండి అడిగేవు మాగుట్టు
తలపోఁతయేరులు దాఁటిరావయ్యా ॥చిత్త॥

చింతలు చెక్కులబంటి సిగ్గులు పెందొళ్లబంటి
మంతనా లన్నియుఁ జీలమండలబంటి
బంతి నెదురురేవుల పైకొని లోఁతరసేవు
దంతపుమేడకు నిట్టె దాఁటిరావయ్యా ॥చిత్త॥

కూటమి చంకలబంటి కోరికె చన్నులబంటి
మూటగట్టు పరసాలు మొలబంటి
యీటున శ్రీవేంకటేశ యెనసి నన్ను మెచ్చేవు
తాటించి పీవిట్లానే దాఁటిరావయ్యా ॥చిత్త॥ 536

1. 307 రేకు. 24 వం. 37 ఏ పాటను పోలినది.

పాడి

చేయివట్టెనంటానేల చెలువునిఁ దిట్టేవు
ఆయములు గరఁగఁగా ఆసపడవలదా ॥పల్లవి॥

చిక్కనితేనెలతో నీచిగురాకుమోవి చూచి
వుక్కున నీపతికి నోరూరకుండునా
గక్కన నీమోము చంద్రకళదేరఁగాఁ జూచి
పక్కన నీకు నచ్చె బాఁతిపడవలదా ॥చేయి॥

పట్టెఁదేసినవ్రతువనీబంగారుచన్నులు చూచి
చుట్టి యాతనిచూపులు సోఁకఁదగదా
జట్టిగ నందపునీజఘనచక్రము చూచి
రెట్టించి వలపులు రేఁగఁగవలదా ॥చేయి॥

సావధానముల నీచక్కఁదనములు చూచి
యీవేళ శ్రీవేంకటేశుఁ డెనసె నౌనె
తావుల నీకొప్పును బిత్తరిచూపులనుఁ జూచి
యీవులిచ్చి నిన్ను నురమెక్కించుకోవలదా ॥చేయి॥ 537

ఆహిరి

నిన్ను మెచ్చఁగలఁగాని నిష్ఠూరాన కోపను
విన్నటివలెనే నేఁడు విల్పఁగరాదా ॥పల్లవి॥

యెన్ని లేవు నీసుద్దులు యిప్పుడు చెప్పేనంటేమ
వున్నతి మొకదాకిరి నుంటానఁగాక
పన్ని యప్పటి నాతో బానలేం నేసేవు
యెన్నఁగ గుట్టుతో నుండవియ్యఁగరాదా ॥విన్ను॥

నాకుఁ గొత్త నీసేఁతలు నమ్మి ఇయ్యకొనేనంటే
చేకొని వెల్లావిరులు సేయఁగాక
సాకిరేల తెలిపేవు సతులనందరిఁ దెచ్చి
తూకొని తొల్లిటివెల్లా దొంతిఁబెట్టేవు ॥ విన్న ॥

కావరావా నీగుణాలు కమ్మటిఁ బొగడేనంటే
నానఁబెట్టి కొంతగొంత నవ్వేఁగాక
పూని శ్రీవేంకటేశుఁడ పొందితివి దూరనేల
మాని పంతమిచ్చితిని మన్నించరాదా ॥ విన్న ॥ 538

కాంబోది

ప్రియముచెప్పేదే మేలు బిగియనేఁటికి
క్రియగూడుమామాటలఁ గృపసేయవయ్యా ॥ పల్లవి ॥

పంతగారిపతి విన్నుఁ బట్టినదెల్లాఁ దప్పె
యెంతని వుత్తరమిచ్చే వేమయ్యా
వింతగా చేతులువట్టి వేఁడుకొని విడెమిచ్చి
పొంతనే యేకతమాడి బుజ్జగించవయ్యా ॥ ప్రియ ॥

చెందినవాసికత్తె సేసినదెల్లాఁ జేఁతే
యెందాఁకాఁ దారుకాణించే వేమయ్యా
కందువ నవ్వులు నవ్వి కడుఁ బచ్చడము గప్పి
ఇందరిలో గారవించి ఇచ్చలాడవయ్యా ॥ ప్రియ ॥

మానవతులైనవారిమాటలెల్లాఁ దగవులే
ఆవలేల పెట్టుకొనే వదేమయ్యా
ఔను కడపరాయఁడవై శ్రీవేంకటేశుఁడ
తావకమై దూరితివి దండమండవయ్యా ప్రియ ॥ 539

మాళవి

ఎందాఁకా సంకలుదిద్దే వీతనిసుద్దులు నాతో
పందెగాఁడై తానిట్లా బదుకనీఁగదవే ॥ పల్లవి ॥

చెల్లుబడిగలవారు సేసినదెల్లాఁ జేఁతే
అల్లదె వొఁగాదని ఆడఁగనేల
పల్లదాన నేఁ దప్పులు పట్టేటిదాననా
బల్లిదుఁడై తానిట్లా బదుకనీఁగదవే ॥ ఎందాఁ ॥

పంతగాండ్లైనవారు పట్టినదెల్లా మాఁటే
యెంతకెంత తనగర్వా లెంచఁగనేల
వొంతనుండి నేఁ దనకు బుద్ధినేరిపేదాననా
బంతి నుండి తానిటా బదుకనీఁగదవే ॥ ఎందాఁ ॥

కూరిమిగలుగువారు కూడినదెల్లాఁ గూటమి
సారెకుఁ గొసరి యింతజాలియనేల
యీరీతి శ్రీవేంకటేశుఁ డెనసె వీఁకఁ బాసేనా
బారకుఁడై తానిట్లా బదుకనీఁగదవే ॥ ఎందాఁ ॥ 540

రేకు 1391 సామంతం

మొక్కేము నీకును ముందుముందుగా నేము
మక్కువసేసి ఇట్టె మన్నించవయ్యా ॥ పల్లవి ॥

తలఁచి నీవే నన్ను దయఁజూచుటగాక
కొలఁదిమీరి యెందాఁకఁ గొసరేము
చలము సాదించేనంటే సతులము నే మెదురా
మలసి ఇంతటనైన మన్నించవయ్యా ॥ మొక్కే ॥

పనివడి నీవే నాపై బత్తిసేయుటగాక
కొనగొనల నెందాఁకాఁ గొసరేను
మనసు సోదించేనంటే మంకులము నే మెంత
మనసిచ్చి యిపుడైనా మన్నించవయ్యా ॥ మొక్కే ॥

గరిమల నీవే నన్నుఁ గలసి మెచ్చుటగాక
కురులంటి యెందాఁకఁ గొసరేను
యిరవై శ్రీవేంకటేశ యేలితి విల్లాల నేను
మరిగి యింతటనైనా మన్నించవయ్యా ॥ మొక్కే ॥ 541

రామక్రియ

సతుల మిందరమును సంతోసించేము
తతివచ్చె నీఁక విట్టె దాఁచకువయ్యా ॥ పల్లవి ॥

కన్నులనే నవ్వుతాను కలకల మాటాడుతా
వున్నది చెలియ నేఁడు వుల్లాసాన
మన్నించిననీముద్దులు మాతోఁ జెప్ప సిగ్గువడీ
అన్నియు నీవైనా నానతియ్యవయ్యా ॥ సతు ॥

మోమునఁ గళదేరుతా ముచ్చటలు నెరపుతా
వేమారుఁ జెలరేఁగీని వేడుకలను
నీమోహపుగుణములు నే మడిగితే దాఁచీ
ఆముకొని నీవైనా నానతియ్యవయ్యా ॥ సతు ॥

మోవిఁదేనె లొలుకతా ముంచిపరసమాడుతా
వోవరిలో నిన్నుఁగూడి వున్నదిపుడు
శ్రీవేంకటేశుఁడ నే మెంచితేఁ దానే తలవంచీ
అవిధము నీవైనా నానతియ్యవయ్యా ॥ సతు ॥ 542

### పాడి

మావలె నుండవలదా మనసు మనసుఁ బొంది
కైవశ మాతఁడు నాకుఁ గలకాలమెల్లను ॥పల్లవి॥

చనవరినందువు జాణ ననుఁకొందువు
యెనలేవిరమణివి నేల దూరేవే
పెనఁగి పెద్దరికాలు పెంచేది యెఱఁగము
ఘనమై మీగుట్టు నేఁడు కానవచ్చె మాకు ॥మావ॥

నీవే మించితి నందువు నేరుపరినందువు
యీవల నాతని కెంత యేఁకారేవే
భావించి వేసాలు నీవు పచరించే దెఱఁగము
కావిరి వలపు తారుకాణాయ మాకు ॥మావ॥

యెమ్మె చెల్లినందువు యెనసితి వందువు
చిమ్మి శ్రీవేంకటేశుపై చేత వేసేవేమె
నెమ్మి నాతఁడె వన్నెలె నీమనసు యెఱఁగము
తెమ(మ్మః)లై పసంతోసము దిష్టమాయ మాకు ॥మావ॥ 543

### కురంజి

ఏమయ్య తగవు నీవెఱఁగవిదా
కామించితే బిగిసే విక్కడి జాణతనమా ॥పల్లవి॥

కోరికతో విన్ను నాపె కొంగువట్టి తియ్యఁగాను
పారె సిగ్గులువడేది జాణతనమా
నేరుపుతో బత్తిగదు నీమీఁదఁ జేయఁగాను
యీరీతి గుట్టుసేసే విది జాణతనమా ॥ఏమ॥

గోమునఁ బెంచినయట్టిగుబ్బల విన్నొత్తఁగాను
సాముసేసే వాపెతోను జాణతనమా
నేమముతోఁ గామకిచ్చి విన్నుఁ దప్పకచూడఁగా
ఆమనివవ్వులు నవ్వే వది జాణతనమా ॥ ఏమ ॥

కదలేవివిబ్బరాన కాఁగిట విన్నుఁ గూడఁగా
ఇదిసేవు రతులకు జాణతనమా
అదరి శ్రీవేంకటేశ ఆపె నీకు మొక్కఁగాను
తొదరి కొసరే వింక దొమ్మి జాణతనమా ॥ ఏమ ॥ 544

భైరవి

గక్కన చెక్కునొక్కేవు కమ్మటి నీవు
కిక్కిరిసినవేడుకఁ గృపఁ జూడవయ్యా ॥ పల్లవి ॥

నేరుపరిసతినై తే నీతో మాటాడుటగాక
వూరకుండేముద్దరాల నోపుదునా
గారవించి యింతయేల కదిపి వెడ్డువెట్టేవు
మారీతి నీవెఱఁగవా మన్నించవయ్యా ॥ గక్క ॥

చన్నులు గొప్పలై తే పరివెనఁగుదుఁగాక
చిన్నదాన నే వింతేసికిఁ గలనా
యిన్నిటా పారెకునేల యిచ్చకముసేసేవు
కన్నులెదుట నుందాన కరుణించవయ్యా ॥ గక్క ॥

మిక్కిలిప్రౌఢనై తే మేలములాడుదుఁగాక
యిక్కువ సిగ్గరికత్తె వింతసేసేనా
వొక్కటైతివి శ్రీవేంకటోత్తమ యేల దూరేవు
తక్కులఁబెట్టక యిట్టె దయఁజూడరాదా ॥ గక్క ॥ 545

శ్రీరాగం

ఏమయ్య నన్నేల యెలయించేవు నీవు
చేముంచి నీపాదాలసేవ నేసేదానను ॥ పల్లవి ॥

వంతుకు నందరివలె వలచినదాననా
కాంతుఁడ నీవు మన్నించేకాంతను నేను
దొంతివావులు చెప్పేటిదోమటిలోదాననా
మంతనాన నెలకొన్న మచ్చికలోదానను ॥ ఏమ ॥

పూసుకవాసుకవచ్చేపొరుగులదాననా
రాసికెక్కేపట్టపురమణి నేను
వేసాలకుఁ గొసరేటివింతపొందులదాననా
సేసవెట్టి పెండ్లాడినచేతిలోనిదానను ॥ ఏమ ॥

ముంచి కూడపెట్టుకొన్న మూఁకలోనిదాననా
కంచపుఁబాలకూళ్ల కామిని నేను
యెంచఁగ శ్రీవేంకటేశ యేలితి వేదోదాననా
మించిననీవురముపై మేనదాన నేను ॥ ఏమ ॥ 546

రేకు 1392 సౌరాష్ట్రం

ఏలయ్య మాతోడియేలాటాలు
కేలెత్తి మొక్కేము కృపఁజూడవయ్యా ॥ పల్లవి ॥

చల్లలమ్మేవారిసంగడి నుండఁగ
యెల్లవారు విన్న నేమందురు
గొల్లఁడాయ రాచకొడుకు వీఁడంటా
తొల్లే మధురలో దూరిరి విన్న ॥ ఏల ॥

అలఁగాపరై అడవి నుండఁగ
యీలీలఁ బొరులు యేమందురు
బాలుఁడాయ పరబ్రహ్మము వీఁడంటా
పోలిమితోఁ గరిపురజను లవిరి ॥ఏం॥

బందిబోయిఁ(యఁ?)డవై పౌఁజులలో నుండఁగ
యిందువిండ్లవా రేమందురు
దంది శ్రీవేంకటో త్తముఁడా యు వీఁడంటా
విందుఁదిరువతివిలయులు నగిరి ॥ఏం॥ 547

కన్నడగౌళ

చెక్కుచేతి తోడ చింతించేదేకాక
అక్కలాల మిమ్ము వీఁక నవఁగఁ జోచేది ॥పల్లవి॥

చెంతనున్నచెలులే చెలువుడికి లోనై తే
మంతన మెవ్వరితోడ మాటలాడేది
[1] కాంతువిమాటలవొరగలు మీరే దిట్టలైతేను
యెంతటివారికినైనా యెట్టు దరించేది ॥చెక్కు॥

పిలిచితెచ్చేటివారే ప్రియునిఁ గలసితే
చలము లెవ్వరితోడ సాదించేది
బలిమి నాతవికిఁగా బాసకు మీరే వచ్చితే
యిలమీఁద చుట్టరికా లెట్టుసేసేది ॥చెక్కు॥

కాఁగిలించఁబెట్టేవారే కందువలు సోఁకించితే
చేఁగదేర నెవ్వరిపై నేపవెట్టేది
ఆఁగి శ్రీవేంకటేశుమో వప్పుడే నాకిప్పించితే
పాఁగిన మీనేర్పు లెట్టు భావించేది ॥చెక్కు॥ 548

1. విభుని మాటలకు గీటురాళ్లైన మీరే అని యర్థమా? మంచిచెడ్డలను తెలుపువది గదా ఒరగల్లు.

హిందోళవసంతం

చెలులాల మీరూరకే చేతికి కావికియ్యరే
తలఁచుకొని యన్నిటాఁ దానే మన్నించీని ॥పల్లవి॥

పిలిపించ నెంతదాన పెనఁగఁగ నెంతదాన
తలఁపులోపలివాఁడు తానే వచ్చీని
చెలరేఁగి పెండ్లాడినాఁడు చేపట్టినాఁడు తొల్లి
కొలచినందే కొలచి కొత్తసేయవలెనా ॥చెలు॥

అగడుసేయఁగనేల ఆకులు వ్రాశంపనేల
తగులాయమైనవాఁడు తానే వచ్చీని
నగి సేసవెట్టినాఁడు నమ్మించినాఁడు తొల్లి
విగిడినందే విగిడి విందవేయవలెనా ॥చెలు॥

చొక్కించఁగా నెట్టో సొలయఁగా నది యెట్టో
దక్కి నాకుఁ గలవాఁడు తానే వచ్చీని
ఇక్కడ శ్రీవేంకటేశుఁ డితఁడే వచ్చి వన్నెలె
మొక్కినందే మొక్కి మరి మోపుగట్టవలెనా ॥చెలు॥ 549

దేసాళం

ఎలయింపుఁజేఁతల నీ వెంత సేసేవు
చలములు సాధించక చనవియ్యరాదా ॥పల్లవి॥

మాటలకుఁ దలపెట్టి మనసెల్లా భ్రమయించి
ఆఁటదాని వింతయేల అలయించేవు
పీటున బుసకొట్టుచు నిలుచుండెప్పవటమండి
గాఁటావఁ బానువువను కలయఁగరాదా ॥ఎల॥

బట్టబయలు నవ్వించి పరాకులు పుట్టించి
చుట్టమవై యీపెనేల సూడువట్టేవు
దట్టపుఁజెమటతోడ తప్పకచూచీ నిన్ను
నెట్టుకొన్నరతులఁ దనివిసేయరాదా ॥ఎల॥

చేతులు మీఁదవేసి చిమ్మిరేఁచి వలపుల-
కాతర మీకె కంటించి కాఁగిలించేవు
యీతల శ్రీవేంకటేశ యెనసి నీకింతి మొక్క-
రాతిరిఁబగలు నిద్దె రమియించరాదా ॥ఎల॥ 550

బౌళి

చెల్లఁజెల్లు నోయి నీవు సేసినంతాను
కొల్లన నవ్వేవు నీకొంగువట్టఁగాను ॥పల్లవి॥

పంతగాఁడవా వోయి పలుమారుఁ జెనఁగేవు
చెంతనుండి నీసేవసేయఁగాను
వింతవాఁడవావోయి వెరగంది చూచేవు
మంతనాన నేఁడు నీమర్మము లంటఁగాను ॥చెల్లఁ॥

అందగాఁడవా వోయి అదివట్టె ఆడేవు
అంది నే సుద్దులు నిన్ను నడుగఁగాను
సుందరీఁడవా వోయి మంతులెల్లా నెరపేవు
విందు చెప్పి చెక్కునొక్కి వేఁడుకొనఁగాను ॥చెల్లఁ॥

నాటకాఁడవా వోయి వంటునఁ దలవంచేవు
కోలుముందై కాఁగిటిలో కొసరఁగాను
యీతల శ్రీవేంకటేశ ఇటు నన్ను నేలితివి
జాణఁడవా మోవిచ్చితే పచ్చిగాఁ జేయఁగాను ॥చెల్లఁ॥ 551

పాడి

బలిమాయ ఇఁక విట్టే బతుకరమ్మా
తలమోచి సవతులు దగ్గరఁజోచేది ॥పల్లవి॥

ఇచ్చక మాటఁ దాదితే వియ్యకొందువు నీవైతే
హెచ్చిన నేరుపరులే ఇద్దరును
పచ్చిదోఁచె మీమోవుల పనులెల్లఁ జక్కనాయ
తచ్చి సవతుల కిఁకఁ దగులఁజోచేది ॥బలి॥

నవ్వు నాతఁడు చూచితే సారె మొక్కుదువు నీవు
ఇవ్విటా జాణలే మీరిద్దరును
కన్నులఁ దేటలు విందె కాయములు పులకించె
కన్న విన్న సవతులు కలయఁజోచేది ॥బలి॥

శ్రీవేంకటేశ్వరుఁ దేలె సేవ సేసితివి నీవు
యీవల నావల ఘనులిద్దరును
వావి చూచి నన్నుఁ గూడె వరుస వితఁడే వేఁడు
భావించి సవతులిఁకఁ బదరఁజోచేది ॥బలి॥ 552

రేకు 1393 దేశి

ఏల సిగ్గువడేవే యెందాఁకాను
వేళవేళతోఁ బతికి విడెమియ్యవే ॥పల్లవి॥

పండినపంటవంటిది పాయపునాఁటిమదము
నిండుఁజెరువువంటిది నెయ్యపుటాస
వుండనుండ నవి లోలో మదివోవకుండును
అందనుండివపతికి నప్పగించవే ॥ఏల॥

పెరతేనియవంటిది ప్రియములతమకము
విరివాసనవంటిది వేడుకనవ్వు
సరికిబేసికి నవి చవిదప్పకుండాను
దొరకె నాతనికే విందులు నేయవే ॥ ఏల ॥

చేవ చిగురువంటిది చెందినకాఁగిటిరతి
భావముసొంపువంటిది పైకొన్నమేలు
వావితోఁ గూడితి నిఁక వరుసదప్పకుండాను
శ్రీవేంకటేశ్వరుని సేవ నేయవే ॥ ఏల ॥ 553

## బౌళిరామక్రియ

నమ్మటూరిచెన్నుఁడా జాణఁడ వౌదువయ్య
పమ్మి యన్నిటాను చెల్లుబడియాయ వలపు ॥ పల్లవి ॥

తమ్మిపువ్వుల వేసేవు తప్పకచూచితినంటా
దొమ్మినేసేవు పాదముతొక్కితినంటా
నిమ్మపండు పిందేవు నిన్ను నే దొబ్బితినంటా
ముమ్మాటికిని మెయికి మయ్యాయ వలపు ॥ నమ్మ ॥

కోరి పన్నీరు చిమ్మేవు కొంగు నేఁ బట్టితినంటా
గిరేవు గోరను గిలిగించేవంటా
యేరా చన్నులు నిపికే నిట్టె కొప్పంటితినంటా
మారుకొనొకటి కిమమడియాయ వలపు ॥ నమ్మ ॥

కప్పురము చల్లేవు కాఁగిట నిగించితినంటా
గుప్పేవు పరిమళాలు కూడితినంటా
యిప్పుడే శ్రీవేంకటాద్రి నేలితివి మెచ్చేవంటా
చప్పుడుమోవితేనెల జంటాయ వలపు ॥ నమ్మ ॥ 554

ఆహిరి

ఎన్నఁ దెలిఁగేవు నీవు ఇంతి నీపైఁజేసేబత్తి
సన్న యెరిఁగి ఇప్పుడే చనవియ్యరాదా ॥పల్లవి॥

చెలియ నీకుఁ గతలు చెప్పి చెప్పి దప్పిగొనె
యెలమిఁ గప్పురబాగా లియ్యరాదా
మెలుపునఁ బాదాలొత్తి మేనెల్లఁ జెమరించె
వెలయ సురటిఁగొని విసరరాదా ॥ఎన్నఁ॥

సతి వూడిగాలు నేసి సారెకు మేను బడలె
ఇతవుగా మోవిపండు ఇయ్యఁగరాదా
తతితో జూజాలాడి తమకించి బుసకొట్టె
పతివి నీతొడమీఁదఁ బవ్వళింపించరాదా ॥ఎన్నఁ॥

మగువ నీతోఁ గూడి మనసు విప్పెరగందె
జిగిగోర నెచ్చరిక సేయఁగరాదా
విగిడి శ్రీవేంకటేశ నీతో జాగరాలు సేసె
మిగులా విందురతుల మెప్పించరాదా ॥ఎన్నఁ॥ 555

సామంతం

కంకణసూడిగెములకామివివి యీ-
యంకెల నీభావమెల్లా నానతియ్యవే ॥పల్లవి॥

వెలఁది మొక్కేవు నీవు వేమారు మరువికే
మెలుపై నీకీలుగంటు మిట్టిపడఁగా
పులకుఁగుచములతో నూఁగేటిసరులతో -
వలసే విదేమి గోరే వానతియ్యవే ॥కంక॥

గరిమ నోమేవు నీవు కంతునిఁ బూజలుసేసి
శిరసుచెమట మేనఁ జిందఁగాను
వరుస నూరుపులతో వలగొని బడలేవు
అరిది నీతలఁపెల్లా నానతియ్యవే ॥కంక॥

మంతనాన నొడిగేవు మదనమంత్రములే
దొంతిపులకలు మేనఁ దొడరఁగాను
యింతి నీవు శ్రీవేంకటేశు నీకాఁగిటఁ గూడి
అంతలో నవ్వినదేమి ఆనతియ్యవే ॥కంక॥ 556

భూపాళం

మరుఁడు సేసినయట్టిమాయ లివి
కరఁగె మే విందు లోనుగాకుండవచ్చునా ॥పల్లవి॥

తరుణి నీపతిఁ బాసి తమకాన బడలవు
విరహ మిందరి కొకవిధమేకాదా
పెదరేఁచి కూరిములు పెట్టినపాట్లనెల్లాఁ
బొరలక మన కవి పొంతఁ దోయవచ్చునా ॥మరుఁ॥

నెవ్వగఁ జిత్తములోన నీకేల చింతింప
జవ్వన మిందరి కొకపరిగాదా
యెవ్వరేకాలమునందు యెట్టుండవలె నట్టు
దవ్వుచేరువలు నమ్మి తప్పించవచ్చునా ॥మరుఁ॥

చెక్కుటిచేతితోడ చెలులపై నొరగేవు
చక్కఁదన మిందరికి జయమేకాదా
యెక్కువతో శ్రీవేంకటేశుఁ డిదె నిన్నుఁ గూడె
కక్కసమేఁటికి విఁకఁ గాదనఁగవచ్చునా ॥మరుఁ॥ 557

ఆహిరినాట

మెలుఁతలు బెళుకుల మెఱసినను
విలువునఁ గాంతలో నీదలు విలిచె ॥పల్లవి॥

క[illegible]ల నాడుచు మగువలు నీపై
[illegible]సిసొలసి నినుఁ జూడఁగను
ఘన నీపై నీలపుసరులై
దండలై కలగొన బెరసె ॥మెలుఁ॥

ముద్దరు మురిపెపునడపుల
[illegible]జములఁ జెన్నుగను
[illegible]బ్రుపుఁబేరులసొమ్ములు
తనుఁ[illegible]లోఁ దగులములాయ ॥మెలుఁ॥

తిరుపుగొనుచు నినుఁ దేఁకువ నొరయుచు
సరుసనె నగవులు చల్లినను
గరిమల శ్రీవేంకటపతి నీకివి
తెరమఱఁగురతుల తేజములాయ ॥మెలుఁ॥ 558

రేకు 1394 సౌరాష్ట్రం

మాటలాడఁగదవె మంతులేఁటికి
[1]నాఁటుకొనీతఁడు నీతో నవ్వు నవ్వఁగాను ॥పల్లవి॥

చెఱఁగేల కట్టేవే చెక్కుచేయేలపెట్టేవే
మఱి యెదుటనే నీమగఁ డుండఁగా
నెఱిలేల ముడువవే నేలనేమి వ్రాసేవే
తఱితో నీతఁడు నీదండ నుండఁగాను ॥మాట॥

1. నాఁటుకొని+ఈతఁడు.

చెమటేల తుడిచేవే శిరసేల వంచేవే
తమకిం చీతఁడు విన్ను దప్పిదేర్చఁగా
సమమై యేల మొక్కేవే సారెనేల యలసేవే
జమళి నీతఁడు నీచన్ను లంటఁగాను ॥ మాట ॥

దిక్కులేల చూచేవే తెరయేల వేసేవే
విక్కి శ్రీవేంకటేశుఁడు విన్నుఁ గూడఁగా
చొక్కి యెంత కొసరేవే సొలపు లెంత సేసేవే
మిక్కిలి యీతఁడే నీతో మేలమాడఁగాను ॥ మాట ॥ 559

సాళంగనాట

కూరిమి నెక్కువయ్యే నాకుచదుర్గాలు
యేరీతినైనా వారి నేమనఁగఁగలవు ॥ పల్లవి ॥

యేతల చూచినా సతులెందరైనా నుండఁగాను
నాతోనే సారెసారె నవ్వు నవ్వేవు
కాతరించి వారెల్లా నొక్కపై దొమ్మి సేసితేను
యేతులుమెరసి నీవు యేమనఁగఁగలవు ॥ కూరి ॥

కుచ్చివట్టి యిందరూ నీకొలువు సేయఁగాను
మచ్చికసేసి నాతోనే మాటలాడేవు
పచ్చిగా నందరు విన్ను బలిమిఁ బై కొంటేను
హెచ్చి నీవింతటిలోన యేమనఁగఁగలవు ॥ కూరి ॥

ఆసపడినసవతులు అంటి సేవలుసేయఁగా
లేసులకు నన్నుఁ గాఁగిలించి కూడేవు
వాసితో శ్రీవేంకటేశ వారు సేసలు వెట్టిరి
యీసరికే వచ్చి రిఁక నేమనఁగఁగలవు ॥ కూరి ॥ 560

## ముఖారి

[1] నిలుచున్నాఁ దల్లవాఁడె నివ్వెరగుతో
తలఁపెల్లఁ జేకొని దగ్గరవే తరుణి ॥ పల్లవి ॥

తప్పకచూచుచు నట్టె తలఁచు నిన్నాతుమలో
పుప్పొడిగా జుంజుకొవఁ బులకించును
వుప్పతిల్లువిరహాన వూరకే గోర గీరు
దప్పిదేరవిమ్మని దగ్గరవే తరుణి ॥ నిలు ॥

అడుగిడుఁ గాఁకలార అరగంటఁ గెంపు వించు
అడవిలోనే తిరుగు నాసోదాన
కడువలపులు రేఁచు కందువమాయలు నేసి
తడవి నీపతి వాఁడే దగ్గరవే తరుణి ॥ నిలు ॥

సిగ్గులు విడువఁజూచు చిమ్ముల నెనయఁజొచ్చి
విగ్గుదేర విన్నుఁ గని నెయ్యముతోడ
అగ్గమై శ్రీవేంకటేశుఁ డంతలోనె విన్నుఁగూడె
తగ్గక దినము నిట్టె దగ్గరవే తరుణి ॥ నిలు ॥ 561

## సామంతం

ఆయనాయఁ జాలుఁజాలు నట్టె వుండరా
వాయలపలుకు లివి చవులయ్యీనా ॥ పల్లవి ॥

యెంతవడి నావద్ద నిచ్చకమై వుండినా
పంతపునీతలఁ బెందుఁ బారకుండినా
ఇంతలేసియావలు నీ వెన్ని వెట్టుకొన్నామ
కొంతైన నామనను గొని నమ్మీనా ॥ ఆయ ॥

1. ఇందు దళావతారవమవ్వయము కలదు.

కదంగి నీవెంత నన్నుఁ గాఁగిలించుకుండినాను
కదవారిమీఁద నీకుఁ గాఁక మానీనా
విడువక నీవెంత వేసరక బొంకినాను
వుడివోవి నామనసు వొదఁబడీనా ॥ అయ ॥

కొంకక నీవెంత నాతో గుట్టువేసుకుండినాను
వుంకువనీతమకము లుండనిచ్చీనా
పొంకపుశ్రీవేంకటేశ భోగపుఁగాఁగిట నన్ను
కంకిగాఁ గూడితివి నేఁ గాదనేనా ॥ అయ ॥ 562

మాళవిగౌళ

ఇలమీఁద నివి గొన్ని యింద్రజాలాలా నీ-
కులుకువలపు నాపై గురిసేయవలెనా ॥ పల్లవి ॥

యెదురై మొక్కేవు నాకు యేదలేనివినయాన
యిది గొంత ఆరదే నా కిందరిలోన
పొదివి నీవెఁ(వెం?)దైన భోగించి వచ్చి యీడ
వెదకి నాపైఁ జొప్పు వేయవలెనా ॥ ఇల ॥

పెట్టెడి నాపెండె మిది పెట్టుకొంటి విందరిలో
ముట్టి నాకు విది గొంత మోచిదింపులా
గుట్టున నీచేఁతలును గుణములు వెద్దువెట్టి
అట్టున మామాటలే యాఅది సేయవలెనా ॥ ఇల ॥

ఇందాఁకా యేఁచి నన్ను యిప్పుడే శ్రీవేంకటేశ
పొందితి విన్నియు నీకుఁ బొద్దువోకల
మందలించి నే నీకు మన్నించు పతి వింతే
అంది నాకు వింతప్రియము చెప్పవలెనా ॥ ఇల ॥ 563

శంకరాభరణం

ఓహో ఇదేఁటి నవ్వు లూరకుండవే
నాపలుకు వింటి విఁక నవ్వులేకావా ॥పల్లవి॥

యేమే వచ్చితివి నీవెన్నఁడు లేమి। వో-
కామిని నీరమణుఁ డీకడ కంపెనే
యేమిపని గలిగె నేఁడేఁటికొత్తలే
ఆమాఁటకే వో నన్నడుగనేలే ॥ఓహో॥

మగిడి యాసుద్దులేల మరిమాఁటేలే। వో-
మగువ నీవిభుఁడు రమ్మనుమనెనె
యెగసక్కెములు నాతో నివియుఁ గొన్నా।యేమో
నిగిడి యాతనిగుట్టు నీవెఱఁగవా ॥ఓహో॥

తనిసితి నింక నవి తడవకువే।నీ-
వెనకనె వాఁడె శ్రీవేంకటేశుఁడు
అననేమున్నది విన్ను నాయఁడదవే।మీ-
మనసు లెననె వింకా మఱఁగేఁటికే ॥ఓహో॥ 564

రేకు 1395 సామంతం

కంటిమి నీలో మేలు కాంతల మిందరమును
జంటవాయ కతనితో సతమై వుండఁగదే ॥పల్లవి॥

నెలవి నవ్వు లుండఁగా చెక్కుపై చేఇఁకనేలే
మలసేనీపతితోడ మాటలాడవే
వలపు లోన నుండఁగ వట్టి యలుక లింకేల
కలయికకు రమ్మని కప్పుర మియ్యఁగదె ॥కంటి॥

కనుచూపు పదరఁగ కాఁకలు మేనిపైనేలే
చెనకి విభునిమీఁద చేఇచాఁచవే
మనసు బాఁతిపడఁగ మఱుఁగుదనములవేల
మొనసేటిరతులకు మోవి చూపఁగదవే ॥ కంటి ॥

భావము కలఁకుంధఁగ పంతపుమోసములేలే
శ్రీవేంకటేశ్వరుఁ గూడి చెలరేఁగవే
వావి కాఁగిట నుండఁగ వట్టితరితీపులేల
వోవరిలో నుండుమని వుంగరాన నొత్తవే ॥ కంటి ॥ 565

ముఖారి

చందురుఁడు నుదఇంచె చల్లున వెన్నెలగాసె
చందములు సేసుకొని సమ్మతించరాదా ॥ పల్లవి ॥

దొరకొనినమాటల దొంతులు నీవు పెట్టఁగ
యెరవుల మారుత్తరా లేమిచ్చేము
తరుణి వాతనికి నాతఁడు నీకు రమణుఁడు
మరిగి నీకోపమెల్ల మానరాదా ఇఁకను ॥ చందు ॥

యెంచి ఆతనినేరాలే ఇటు వాములువేయఁగ
అంచెల నెందాఁకా నేము ఆడుకొనేము
కొంచక కాతఁడు బాసిచ్చె గురిగా నిలిచితివి
ఇంచుకంత మోవితేనె లియ్యరాదా ఇఁకను ॥ చందు ॥

కేరడపువవ్వులే కిమ్ముల పెదవెట్టఁగ
పారెపారె పిన్నెట్ల సాదించేము
కోరి శ్రీవేంకటేశుఁడు గూడె నీవు గూడితివి
వూరడై నొక్కుమ్మడి నీవుండరాదా ఇఁకను ॥ చందు ॥ 566

భైరవి

ఏమనిన వడిఁబడు నీవేళను మీ-
రేమాటకైన నిట్టె ఇయ్యకొనరే ॥పల్లవి॥

చిత్తము గోమలము చిగురింతే దేహము
వొత్తి విన్నవించకురే వోపదు చెలి
గుత్తపురమణి నీపై గోపగించి వున్నదిదె
అత్తి యాకె ఆదినట్టే అడరే మీరు ॥ఏమ॥

తెగువలే ఘనము దీమసము గొంచము
వొగి నౌఁగాదనకురే వోపదు చెలి
మిగులా విరహమున మేరమీరి వున్నదిదె
మొగమిచ్చులే సేసి ముచ్చటాడరే ॥ఏమ॥

కూరిమి వెగ్గళము కూడపెట్టెఁ జలము
వూరకుండరే మీరు వోపదు చెలి
కోరి శ్రీవేంకటేశుఁ గూడుకొనెఁ దనుఁదానే
చేరిచేరి యిందరును సేస చల్లరే ॥ఏమ॥ 567

చెంచుమలహరి

ఒకటొక టింక నాకు నుడువవలసె
మొకమిచ్చమాటలకు మొదలుకొనవలసె ॥పల్లవి॥

అతనితో నేఁడు నే నలిగి వుండఁగఁగదా
వెతఁబొంది మదనునికి వెఱవవలసె
తతి వంతలో విభుఁని దలపోయఁగాఁగదా
మతిఁ గరఁగి నామేను మఱపందవలసె ॥ఒక॥

విరహతాపపు(ము?)వెదవెట్టఁ బొరలఁగఁగదా
గరిమ నాచెలులతోఁ గసరవలసె
జరసి నాతమకములు చలముకొనఁగాఁ గదా
సిరులఁ బతి పంతములు చెల్లించవలసె ॥ ఒక ॥

పెనఁగి తొల్లిటిరతులు పెరరేఁచఁగాఁగదా
మునుప నే నతనికి మొక్కవలసె
చనవు శ్రీవేంకటేశ్వరుఁ డియ్యఁగాఁగదా
తనిపొంది కలసి సంతములు గావలసె ॥ ఒక ॥ 568

సాళంగనాట

అతఁ డెంతవిలిసిన నలిగిరావు నీ-
కతమున వింకేమి గాఁగలదో ॥ పల్లవి ॥

చూచినట్టు రాదు సూనసాయకుని-
రాచకార్య మిది రమణి
తూచిలుకల గుబ్బుపుదళములు మించె-
నేచె నిన్నిఁక నవి యేమనునో ॥ అతఁ ॥

తలఁచినట్టు రాదు తగ వసంతుని-
బలమెంత గలదో పడఁతి
నలువంకఁ గోవిల నల్లఁబజలవెన్ను-
బలములు మోహరించెఁ బనిగాదుసుమ్మీ ॥ అతఁ ॥

కదిసినట్టు రాదు కదు శ్రీవేంకటపతి-
చిదుముగోరికొన చేకత్తుల-
అదవ నినుఁ గూడె అతనువిబలముల-
కెదిరి పలికితివి యిందాఁకాను ॥ అతఁ ॥ 569

1. ఎంత + విలిచిన.

రామక్రియ

ఎవ్వరంటాఁ జూచేవు యింతిని వోనాయకుఁడ
జవ్వని యారతిరాజసంపదే కాదా ॥ పల్లవి ॥

చెలియచిత్తములోనిచిత్తజునమ్ములేకావా
చిలుకుఁజూపరలై చిమ్మిరేఁగెను
చలువైననెమ్మోముచందురువెన్నెలే కాదా
పలచనినవ్వులై పచ్చిదేరేవి ॥ ఎవ్వ ॥

సతికొప్పుమేఘముజడివానలేకావా
మితిలేనిచెమటలై మేన నున్నవి
చతురైనదిమియాకసపుమెఱుఁగులేకావా
తతితో బంగారువన్నెతళుకు లివి ॥ ఎవ్వ ॥

కుత్తికలో గోవిలకూఁతలు నేఁ డివె కావా
కొత్తయి నీకాఁగిటిలోఁ గుమ్మరించేవి
హత్తినశ్రీవేంకటేశ అంగననీకూటములు
మొత్తమి వొంగేటిభావములసొంపుగాదా ॥ ఎవ్వ ॥ 570

రేకు 1396 సామంతం

ఇతరులతరమా యింతేసి -
అతిరాజసమున నీ వాడితిగాక ॥ పల్లవి ॥

కల్లయు నిజమునుఁ గానక పతితో -
నుల్లస మాడఁగ నుచితములా
బల్లిదురాలవు పట్టపుదేవివి
చెల్లఁగనక అటు సేసితి నీవు ॥ ఇత

వెనకముందు భావించక నీపతి
పెనగొని యిటు గోపించితివి
వెనుకొని యాతనివిరహము నీపై(
జనవును( గలు(గ(గ జందములాయ ॥ ఇ౯ ॥

అకట నీతమక మా(ప(గ లేకే
మొకమోడక చెయి ముంచితివి
వెకలియైనశ్రీవేంకటేశ్వరు( —
దొకటవి కూడ(గ నొద్దికలాయ ॥ అక ॥ 571

సాళంగం

కన్నవారెవ్వరు దీని( గాంతలాల
యెన్నియైనా మీరిట్టె యేమఱకు(డీ ॥ పల్లవి ॥

వొక్కటై విలిచె మేన నొరసి వొరసి చన్ను —
జక్కవల కిదె పుట్టె జగడములు
గక్కన నట్టనడుమ గదిదేరె నింతలోనె
యెక్కడెక్కడిపనులు యెటు వచ్చునో ॥ కన్న ॥

కొమ్మ కనుగండుమీలు కోరి బొమ్మలవిండ్లు
యెమ్మెలకు విరుమేలా నేట్లాడీని
దిమ్మరేచే చెలికొప్పు దక్కులు చీ(కటి సేసె
కమ్మకొన్న దెటువంటి కాలమహిమో ॥ కన్న ॥

కంతునిబాణములై నకరపల్లవములకు
అంతరంగమై పుట్టె ననురాగము
యింతలో శ్రీవేంకటేశు( డింతి పట్టె కూడ(గాను
బంతినే తొల్లియు నేతపము సేసెనో ॥ కన్న ॥ 572

గుండక్రియ

ఘనుఁడ నీకియ్యాట గలితేఁ జాలు।తొల్లి
యెనసి పొందినసతు లెట్టుండి రేమీ ॥ పల్లవి ॥

తరుణికుచము నీకు దాగిలిముచ్చులాడ-
నిరవాయ రమణుఁడ యిదివో నీకు
అరిదిఁ గుచగిరులు అచ్చనగండ్లాడ
వొరపాయ విదివో నీకున్న వేమీనేల ॥ ఘను ॥

వెలఁది మోము నీకు వెన్నెలపులుఁ గమాడ
నెలవాయ విలలోనే నీకిదివో
చిలుపచెమటలెల్ల చిమ్మనగోవాటలాయె
యింపై నెక్కడినుద్దు లేమైనా నేమీ ॥ ఘను ॥

కోమలికెమ్మోవి నీకు గుజ్జనఁగూళ్లాయ
గామిడి శ్రీవేంకటేశ(శ?) కాఁగిటిలోనే
కామించువారినెల్లా గఁనితి విట్లానే
వేమరు నెందరైనా వేసట నీకేది ॥ ఘను ॥ 573

ముఖారి

ఇవు దివ్నిటికి పైరించవలెఁగా
కపటా లివ్నియు మీఁదఁ గనుకొనేఁగాని ॥ పల్లవి ॥

యేదలేవిమచ్చికల కింత చిక్కనవేళ-
నాద(డి?)నెట్టైల్లా నే నాదవలెఁగా
వేడుకై తేఁ జాలుఁగాక విసుగనేఁటికి నే
సూడువట్టి యెప్పుడైనాఁ జూచుకొనేఁగాని ॥ ఇవు ॥

పంతపునాకోరి తెలవారికిఁ జిక్కినవేళ
వింతలు నీవేమనిన వినవలెఁగా
మంతనాన నాతోఁద మాటలకుఁ బనిలేదు
అంతయు నీరతివేళ నాడుకొనేఁగాని ॥ఇపు॥

చిత్తము నీకొప్పగించి చేతికిలోనైనవేళ
కొత్త నీచెం(చేఁ?)తల కియ్యకొనవలెఁగా
పొత్తుల శ్రీవేంకటేశ పొందితివి చాలు నీ-
తత్తరపులచ్చనల దాఁచుకొనేఁగాని ॥ఇపు॥ 574

భూపాళం

ఇప్పుడేమి దప్పిపోయె నింతలోనె
కప్పుక యాతఁడు నాపైఁ గరుణించీఁగాక ॥పల్లవి॥

విడువనిపతిఁ బాసి విరహానఁ బొరలఁగ
పడఁతులిందరి కాడఁబట్టాయఁగా
యెడరైతి నొకవేళ యేమినేయవచ్చు మాటఁ
బడవలెఁగాక ఇట్టె పదరనేలే ॥ఇప్ప॥

అలిగి యాతఁడు నేను నవ్వులిమోపైతే
పొలఁతులకును నవ్వఁబొద్దాయఁగా
తలము దప్పినవేళ దానికేమి గొరతాయ
వలపినట్లయ్యీని వగవకువే ॥ఇప్ప॥

యెన్నికతో శ్రీవేంకటేశుఁడు గూడఁగ నన్ను
మున్నిటివారిపొంపు మూలఁబడెఁగా
అన్నువ నప్పటిచేఁత లట్లాయ నేఁ డిప్పు-
డిన్నిటాఁ బంతము చెల్లె నిఁకనేఁటికే ॥ఇప్ప॥ 575

శంకరాభరణం

ఎప్పటికి విన్నపము ఇదియేసుమ్మీ
తప్పక నీవాడఁబాటు తరుణికి నీవు ॥పల్లవి॥

వలపుచవులు చూపి వలచెఁ జేకొంటి వింక
తెలుపున వేరొండుఁ దలఁచకుమీ
కలసి వుండుఁ గావి కడచెఁ గొనట్లానే
చెలఁగి తియ్యఁబనోరఁ జేదు చవిగాదు ॥ఎప్ప॥

యిందరు నెఱఁగఁ జెలి నింతగా మన్నించితివి
కందులేవిచనవిచ్చి కరుణించుమీ
చందమున నాకెమాఁట జవదాటకుండవయ్యా
పంపువెట్టిఁ బగ వద్దు వేడుకయ్యా నీకను ॥ఎప్ప॥

పూరకుండినరమణి నొక్కటొక్కటె చేసి
చేరి కూడితివి రతిఁ జెలఁగించుమీ
యీరీతి శ్రీవేంకటేశ యీబంగారుకొండ
గారవానఁ జేపటి కడమేల నీకు ॥ఎప్ప॥ 576

రేకు 1397 సామంతం

చెల్లఁబో తియ్యవినోరఁ జేఁదేలయ్య
కల్లనిజములు నొక్కట నుండఁగా ॥పల్లవి॥

మొదలఁ జెలియమీఁద మోహము చల్లినవాఁడ–
విదివో కమ్మరఁ గాఁకలేల చల్లేవు
కదిసి కూటములు కపటము లొకచోటఁ
బొదలించితే నవి పొసఁగునా నీకు ॥చెల్లఁ॥

ప్రేమపుటాసలు మతిఁ బెంచినవాఁడవు
    యేమన్నా నూరకుండే విదేమయ్యా
తామసాలఁ దత్తరాలఁ దగులఁగట్టేనంటే
    భూమిలోన వెటువంటిపొందు గలదా ॥చెల్లఁ॥

కంచపుమోవిపొత్తు కలిగి కూడినవాఁడ-
    వించుకంత పరవశ మిదియేలయ్యా
సంచితపువలపు జవ్వనాలు సరిగావా
    యెంచఁగల శ్రీవేంకటేశ్వరుఁడా ॥చెల్లఁ॥ 577

కాంబోది

నామేనే యెంతసేసె నాయెదుకు
    కామించి కదవారు గాఁబోయేరా ॥పల్లవి॥

యెవ్వరి నేమనలేక ఇందరుఁ జూడఁగానే
    జవ్వనభారముచేత జడియఁగానే
పువ్వుకిపూచినయట్టు పులకజొంపము మేనఁ-
    గువ్వవిపేరులవలె గుదిగొనీనే ॥నామే॥

ఇన్నియు నోరుచుకొని ఇంతుల దూరఁగలేక
    కన్నులపెట్టె పొద్దు గడపఁగను
వున్నరీతినే వుండి వొట్టినచూపులు నాకు
    పున్నమవెన్నెలనీడై పొంగు వచ్చీనే ॥నామే॥

చక్కఁదనములన్నియుఁ జవిచేసుకొనీనే
    చెక్కుటిచేతితోడఁ జింతించఁగా
యిక్కడనె శ్రీవేంకటేశుఁడు గూడఁగాను
    మక్కువ పరవశాన మఱపాయెనే ॥నామే॥ 578

ముఖారి

ఎన్నఁడును నిట్టివల పెఱఁగనమ్మ
తన్నుఁదానె పులకించి తనివొందీని ॥పల్లవి॥

పతిఁ జూచిచూచి తా పరవశమందె నీ-
యతివ కన్నులనే మోహము చల్లీని
మతిలోనే కరఁగీని మలఁగుపై నొరగీని
రతులు దలఁచి సివ్వెరగుపడీని ॥ఎన్నఁ॥

చిప్పిలుఁబ్రియము లింతి చెలులతోఁ జెప్పీని
వుప్పతిల్లుఁగోరికల నోలలాడీని
రెప్పలు మయ్యనేరక రిచ్చపడి యిందరిలోఁ
జెప్పరానికోరికలఁ జెంగలించీని ॥ఎన్నఁ॥

కమ్మరఁగమ్మరఁ దమకమెల్లఁ బెడరేఁచి
కొమ్మ దనయాసలెల్లఁ గుమ్మరించీని
సమ్మతై శ్రీవేంకటేశ్వరుఁడు గూడఁగ నిట్టె
చిమ్ముఁజెమటలచేత సేదదేరీని ॥ఎన్నఁ॥ 679

అహిరి

ఎంతేసి కాఁగలదో ఇన్నియును నిట్లాయ
యెంతవింతలు వొడమె నెమరెమరనె ॥పల్లవి॥

పడఁతివేసరి జారి పగలు చీఁకట్లాయ
పొడలఁ బులకలు చుక్కలురక పొడమె
తొడరి కనుబొమ్మలనె ధూమకేతువు దోఁచె
పొడమెనుత్పాతములు పూఁటపూఁటకును ॥ఎంతే॥

పరిగొనుచు విరహంపుపతిసూర్యుఁ డుదయించె
  వారిమఁ జెమటలజ ధు లుప్పొంగెను
  ఇరవైనపిట్టూర్పు లేదుగాడ్పులు విసరె
  పరగ విపరీతంబు పైపైనె మెరసె ॥ ఎంతే ॥

జడిగొనుచు కుచగిరులు చంద్రశకలము లలరె
  నగవులను పిచ్చపున్నమ లాయను
  సొగిసి శ్రీవేంకటేశుఁడు చెలియఁగూడఁగా
  పగలు రేయును సేరుపడదాయమ ॥ ఎంతే ॥ 580

ఆహిరినాట

రమణుఁడ నీమై రచన లివి
  చెమటల చెలియకు చెలువాయ ॥ పల్లవి ॥

తరుణికి నీపైఁ దప్పులు వెదకఁగ
  సరసపుమాటలు చవులాయ
  విరహపుఁదరుణికి వెన్నెలమోమే
  పరితాపపువైభవ మాయె ॥ రమ ॥

సుదతి విన్నఁ గవి సొలపులు సొలయఁగ
  ముదితకు నవ్వులమోమాయ
  కదలేతురుమునఁ గొంత నదవఁగా
  కుదురుఁగుచములకుఁ గులుకాయ ॥ రమ ॥

చెలి పిను గోళ్లఁ జెక్కు నొక్కఁగా
  తెలి మనునొవికిఁ దీపాయె
  వెలఁది కిపుడు శ్రీవేంకటేశ్వరుఁడ
  అలుకలు దీరఁగ ననువాయె ॥ రమ ॥ 581

కేదారగౌళ

ఏమిటికిఁ దలపోఁత యిన్నీ రోఁత
వేమారు ననలేను వెల్లవిరి నేను ॥పల్లవి॥

చెంగట నీమోవిచెలువెల్లా దేవి నేవి
మెంగిలై నచీకాకు యేఁటికి నాకు
సంగతాయ నటువోర సారె నేల నిన్నుదూర
యింగితపునీగుణాలు యెఱిఁగితిఁ జాలు ॥ఏమి॥

మొక్కేటిది యీమొక్కు మున్నిటిచెలులు పెక్కు
తొక్కితొక్కి కోపానఁ దోసిన వోల
యెక్కడఁ దలఁచరాదు యేమనినఁ గడువాదు
పెక్కుమాఁట లింకనేల పెనఁగేటివేళ ॥ఏమి॥

కాఁగిటినీకూటములు కన్నచోటివోటములు
తోఁగిననాతోడిపొందు దొరకు విందు
దాఁగక శ్రీవేంకటేశ తనువు లొక్కట రాసె
కాఁగినకాఁకలు దేరె కందువలు చేరె ॥ఏమి॥ 582

రేకు 1398 వరాళి

మాఁటలాడఁబోయి చెలి మందమిరియాలు చల్లె
నీటుగాదు మేటిగాదు నీకే పోదయ్యా ॥పల్లవి॥

చూపులఁ గొసరఁబోయి సోయగాన జంకించె
కోపము నిలుపలేక కోమలి నిన్ను
కోపుల నవ్వఁగఁబోఇ గుంపించె కాఁతలెల్ల
యీపడఁతి కన్నె ఇంతె యెగ్గనకువయ్యా ॥మాట॥

తగులనాడఁగఁబోయి తప్పులెంచీ నీమీఁద
అగడైన విరహాగ్ని నాఁపఁగలేక
మొగము చూడఁగఁబోయి మొక్కె నొకచేత నీకు
ఇగురుఁబోఁడిభావ మియ్యకొనవయ్యా ॥మాట॥

సరసమాఁడఁగఁబోయి సరుగ నీకాలు దొక్కె
ఇరవైన శ్రీవేంకటేశుఁడ నేఁడు
కరఁగి కూడఁగఁబోఇ కాఁగిటిలో విన్ను మెచ్చె
తరుణి ఇట్టె నీకుఁ దగుఁగదవయ్యా ॥మాట॥ 583

ఆహిరి

ఆకెకును నీకుఁ బాయవిచుట్టరికము గన
చేకొందు విప్పుడే విచ్చేయవయ్యా ॥పల్లవి॥

ధరఁ గొలవి తామరలు తపనుఁ డుదయుంబైన
విరివిఁ జెంగలించి వికసించును
తెరవముఖకమలమైతే నీవు రాకుంటే
వెరవార నాయకుఁడ వికసించదు ॥ఆకె॥

సంతతముఁ గలువ లివి చందురునిరాకలకు
వింతగాఁ బైపైనే విరసించును
యింతియీకమఁగవ లివియైతే నీవదన-
కాంతిచంద్రుఁడు రాక కదువిరియవు ॥ఆకె॥

మిమకు మయూరములు మేఘోదయంబైన
తనయిచ్చ వేడుకల తగనాడును
యెనలేవి శ్రీవేంకటేశ యిటువలె నేఁడు
వనితఁ గూడకయున్న వహికెక్కదు ॥ఆకె॥ 584

సామంతం

మరుల దెలిపియు నాను మాటలాడ నాదరే
అరమోడ్పుఁ గన్నులనే లలసీఁ జెలియ ॥పల్లవి॥

తరుణి మై చెమరించె తలఁపెందు సున్నదో
విరహపుఁజింతలలో వెదకీని
కురులెల్ల నెరవిచ్చె గుణ మెందు దాఁగెనో
పరవశములోఁ జిక్కి భావించీ నిదివో ॥మరు॥

చెక్కులెల్లఁ బులకించె చిత్త మేమిసేసెనో
మొక్కుల శిరసువంచి మొరసీని
ముక్కున నూర్పులు ముంచె ముందు నేమి గాఁగలదో
నీకుఁ గుచగిరులతో నిలువీఁడీ నదివో ॥మరు॥

సిగ్గులెల్ల నుడివోయ చేఁత లిఁక నేఁటివో
కగ్గని శ్రీవేంకటేశు కాఁగిటిలోన
అగ్గపువేడుక లబ్బె నంగవనోముఫలాన
తగ్గుమొగ్గులెల్లాఁ దీరి తమకించీ నిదివో ॥మరు॥ 585

ముఖారి

ఎంతైన మాగుణాలు యిటువంటివేకావి
అంతటి నీఘనతే అది యెంచుకొమ్మీ ॥పల్లవి॥

తలఁపు నిలుపలేక తమకింతుఁగాని నాపైఁ
గలమోహ మెరుఁగుదు ఘనుఁడ నీవు
చెలఁలము గాన మాకుఁ జెల్లు నేమాటాడిన నీవు
నిలువుగంభీరుఁడవు నీకుఁ బోదుసుమ్మీ ॥ఎంతై॥

1. త్రిగీత గండి వ్రాతలోనే అస్పష్టము.

సంగడి మచ్చరమున సాటెఁ గోపుదుఁగాని
అంగపునీమన్నన నే నదెఱుఁగుదు
కంగి చంచలాక్షులముగాన మాటాడలవింతే
వంగడమైననీవరు సెంచుకొమ్మీ ॥ ఎంతై ॥

చనవున బొమ్మలనే జంకించితిఁగాక నీ-
వెనసినమహిమ నే నెఱుఁగుదును
మనువైనయింతుల సమయపుమాట యిది
వొనర శ్రీవేంకటేశ వొగిఁ దెలుసుకొమ్మీ ॥ ఎంతై ॥ 586

దేశి

నేనెంతగబ్బినైన నీకుఁ బోదుగా
నీవెంతనైనఁ గాప నీకుఁ బోదుగా ॥ పల్లవి ॥

పెరిగి నాకుచములు పెద్దపెద్దకొండలైనా
నెఱసులేక సాదించ నీకుఁ బోదుగా
సిరులనామోవి ఇది చిగురైనా చేవసేయ
విరతి నోరమణుఁడ నీకుఁ బోదుగా ॥ నేనెం ॥

వలుద నాకురులు లిపి యెంతరకొంతరలైనా
విలిపి చిక్కుదియ్య నీకుఁ బోదుగా
నలువై నాకన్నులంచు నల్లఁదెల్ల గలిగిన
నెలకొవి మెచ్చుమెచ్చ నీకుఁ బోదుగా ॥ నేనెం ॥

గారవపుఁగాఁగిటను కాలు చేఁజాఁకినాను
నేరమెల్ల మఱవక నీకుఁ బోదుగా
కూరిమి శ్రీవేంకటేశ కూడితివి నామనసు
నీరైనఁ బాలైన నీకుఁ బోదుగా ॥ నేనెం ॥ 587

శ్రీరాగం

చెప్పరాదు చూపరాదు చిగిరించీ భావమెల్ల
తప్పని జవ్వనపువసంతవేళోకాని ॥పల్లవి॥

అతనిముద్దులు వింటే అంగమెల్లఁ జెమరించె
రతి నాచిత్తపుమోహరసమోకాని
తతిఁ జేరుకొంటేను తనువెల్లాఁ బులకించె
అతనుబాణములకు అయమోకాని ॥చెప్ప॥

కందువలు దలఁచితే కన్నుల నీర్లురాలీ
విందులయానందముల వెల్లులోకాని
చెందిన నీముద్దు చూచి జిగి గుండె జల్లురనీ
చందురువెన్నెలకుప్ప జారెనోకాని ॥చెప్ప॥

శ్రీవేంకటేశుఁ గూడి సెలవి నవ్వులు చిందె
చేవదేర నాలోనిసిగ్గులోకాని
నీవి జారినంతలోనే నీకు సంతసము నిండె
యేవిధానఁ దానే చనవిచ్చెనోకాని ॥చెప్ప॥ 588

రేకు 1899 సామంతం

అతనిగతు లొరుల కలవడునా
తతి నెటుచూచిన ధగధగమెరుపు ॥పల్లవి॥

ముందర దెలియక మొయిలు చేకొనక
గొందినే కూరిమి గొసరేవు
అందరివలెనా అతనిచిత్తము
యెంతచూచినా యింపులయెరవు ॥అత॥

రెప్పల నవ్వక రేసుల బ్రమయక
తప్పులె యెన్నదు తమకమున
చెప్పుదురతు లాచెలువ లతనికే
కుప్పలుఁ దెప్పలు కోరిక కొసరు ॥ అత ॥

మూతలు దియ్యక కసరులు దియ్యక
ఆతఁ డిట్ల నీకలవడునా
శ్రీతరుణీపతి శ్రీవేంకటపతి
యేతెరు వేఁగిన యేనుగవీధి ॥ అత ॥ 589

తెలుఁగుఁగాంబోది

సతిచక్కఁదన మెంతో సరసునిమోహ మెంతో
చతురిక లిందరును సరిఁజూడరమ్మా ॥ పల్లవి ॥

కాంతకన్నులు వ్రాసి కడలు వ్రాయఁగ రాక
చింతతోఁ దలవంచెఁ జెలిపతిఁడు
పంతపుచనుము వ్రాసి బయలువ్రాయఁగ రాక
కొంతదడ వున్నారనెఁ గోమలిప్రాణేశుఁడు ॥ సతి ॥

కలికిచుబాలు వ్రాసి కఠినము వ్రాయలేక
తలపోయఁదొడఁగెఁ బంతపుపతిఁడు
నలినాక్షిమోము వ్రాసి నవ్వుఁ వ్రాయఁగ రాక
విలువున వెరగందె నెలఁతరమణుఁడు ॥ సతి ॥

వనితకాఁగిటఁ దన్ను వ్రాసి రతి వ్రాయలేక
తనువెల్ల మఱచెను తమకమున
వెనకముందర వ్రాసి వేడుక వ్రాయఁగ రాక
చినుకుఁజెమట వ్రాసె శ్రీవేంకటేశుఁడు ॥ సతి ॥ 590

వరాళి

పదరిన మాకాపని గాదు
ఇదియే విన్నప మింకాఁ జుమ్మీ ॥పల్లవి॥

విఱువున నాతఁడు విసుఁగని నవ్విన
కెలసి బొమలఁ జంకించితివి
చలమీదేరక సరికినరాయను
కల దిఁక సంతముగావలెఁజుమ్మీ ॥పద॥

ఆసల పతి విన్నంగాడిఁ జెనకిన
వోసరి కుచముల నొరసితివి
తాసులవలె మీతమకము లలరెను
యీసుల తెరమరఁగింతేసుమ్మీ ॥పద॥

ఘనుఁడగు శ్రీవేంకటపతి గూడఁగ
మనసున విప్పుడె మఱచితివి
చనవులు మనవులు చందములాయను
వినయమే విభునికి వేడుకసుమ్మీ ॥పద॥ 591

సౌరాష్ట్రం

అప్పటి మానవు నాపై నానవెట్టేవు
యెప్పటి నీగుణములు యెందుఁ గొత్తలౌనా ॥పల్లవి॥

విన్నటివునుకుల నీజాదలెల్లఁ గంటిమి
అన్నియు నాతో నీ వాడకులెనా
యెన్నరావిబాసలెల్ల యేల మనఇద్దరిలో
సన్నకు సన్నలే చాలుచాలు సుందరా ॥అప్ప॥

అటువంటివాఁడవని అంటినా విన్నెమైనా
కటకట ఇంతకెల్లఁ గలనా నేను
కిటుకుఁగూటమికొంటె కిందటి మవపొందు —
లటు దలఁచుకొనుట అదియే మేలు ॥ అప్ప ॥

యింతలోనే యేమిదప్పె యెట్లైన నేమాయ
ఇంత నన్ను బుజ్జగించే విది వలెనా
చెంతలఁ గూడితి నన్ను శ్రీవేంకటేశ్వర
యింతి వింతే నీకు నే నెదురాడేనా ॥ అప్ప ॥ 592

## ముఖారి

విరిగినట్టిబండివారే వెట్టివారుగాక నీవు
యెరవు సతము నేసుకొంటి వేమి నేతువే ॥ పల్లవి ॥

పొలిఁతి నీవు అతనిఁ బిలువఁబోఇనట్టిపొద్దు లేద
విలువుఁజెమటతోడియలపు నీకిదేడదే
వెలుఁగు చేనుమేసినట్టివిధము దోఁచె నీ యందు
అలసినొలసి విన్ను వింక నాడనేఁటికే ॥ విరి ॥

యింతి నేను విరహమునను యెదురు చూచుచేద; నీపు
వింతపులకగముల విట్టువీఁగు చేఁటిదే
కంతుసంచకారులోనె కల్ల దోఁచె నీయందు
మంతనమున నీతోడిమాట లేఁటిదే ॥ విరి ॥

వనిత శ్రీవేంకటేశ్వరుఁడు దానే నన్నుఁ గూడె
చనవిమనవి వితవితోడి సన్న లేఁటికే
తనరి నీఁవు గానరాఁగ దాఁగినట్టి చందమాయ
వెనక నాకుఁ బ్రియము చెప్పి వేఁడనేఁటికే ॥ విరి ॥ 593

ఘంటారవం

ఇప్పటిగతి యిదె యెంచినను
కప్పినభ్రమయో కరుణో యెఱఁగ ॥ పల్లవి ॥

తలఁపున నాపతిఁ దలఁచినంతలో
నెలకొని ముందట నిలిచె నిదె
కలసినట్లనే కమ్మరఁ దోఁచీ
కలయో నిజమో కపటమో యెఱఁగ ॥ ఇప్ప ॥

అడుగిడీనే నేఁ దలిగిననాఁడే
బడివాయనిపతిభావ మిదే
అడియాలంబులు అవెయివె నాపై
తడయనితగులో తమకమో యెఱఁగ ॥ ఇప్ప ॥

గక్కన శ్రీవేంకటపతి నాకును
నిక్కపుఁగూటమి నెంపె విదే
యిక్కువ లివివో ఇందాఁకానే
యెక్కడ నేమో యేదియు నెఱఁగ ॥ ఇప్ప ॥ 594

రేకు 1400 లలిత

అపుడే నీకు లోనైతి విదే నీ-
రపమిఁక నాబీరము చెల్లీనా ॥ పల్లవి ॥

తేటలమాటలఁ ద్రిపురాంగనలను
కూటువఁ గూడినకొనబలిమి
పాటైరుకుమిణి బలిమినె తెచ్చితి
గాఁటపునిను నేఁ గాదనఁగలనా ॥ అపు ॥

తిరముగ మందలఁదిరిగెడిమగువల
వెరవువఁ గూడినవిటుఁడవు
అరిదిఁ బదార్వేలతివల నేలిన
దొరవిటు చెనకినఁ దోయఁగఁగలనా ॥ అపు ॥

చలిమిపి బలిమిని జలధికన్యకనుఁ
గలసిన శ్రీవేంకటపతివి
మలసి నీవు నన్ను మన్ననఁ గూడితి-
వెలమి నగించే వింతకుఁ గలనా ॥ అపు ॥ 595

శంకరాభరణం

వాసియు వన్నెయుఁ గంవనిత నేను, నీవు
వేసర వెదుకన్నైనా వెరతు నే నిందుకు ॥ పల్లవి ॥

వొద్దువొద్దు వాదులేల పుమ్మడినే పుండనీరా
కొద్దిమీరి బడలించుకొననేఁటికి
కద్దు నీకు నలవాటు కదు శిశుపాలువిచే-
నద్దలింపులఁ బడితి వంతకు నే నోపను ॥ వాసి ॥

పట్టఁబట్టకురా నన్ను బలిమి నంతేసి నేఁడు
గుట్టున నుండరా నీవు గొంత యేఁచక
యిట్టునట్టు వెన్నలకు విండ్లిండ్లెల్లా దూరి
కట్టువడితి రోలఁ గలమా నే మెందును ॥ వాసి ॥

పోతుపోతు మంత నీవు పొందితి శ్రీవేంకటేశ
చేకొవి పెదమనసుచేఁతవాఁడవు
కాకరివై యనసూయ కదరుబాలుఁడవై తి
నీకు నిది మెచ్చుగాక నేరి మాకుఁ దగునా ॥ వాసి ॥ 596

తెలుఁగుఁగాఁబోది

ఇన్నియుఁగూడె నీ యింతికిని
విన్నటిమాఁటలు నిజమౌఁతుపులు ॥పల్లవి॥

పులకల[1] మొలకలపున్నమనాఁడే
తలిరుఁబోఁడికినిఁ దలఁబాలు
నొలపులవగవుల సోమవారమునఁ
గలయురతుల కంకణవారములు ॥ఇన్ని॥

ననుపుగ చిత్తానక్షత్రంబున
వినుకలిఁ బెట్టినపీదెములు
పదివడి చెలి సౌభాగ్యయోగమున
కొనచూపులకొంగుముడిసిరులు ॥ఇన్ని॥

మిక్కిలికూటపుమిథునలగ్నమున
తొక్కటిపాదపుదోపట్లు
గక్కన శ్రీవేంకటపతిచేకులు
వొక్కట నెదిరినవుంపవలు ॥ఇన్ని॥ 591

శంకరాభరణం

ఉడిచె విరహమున నొఁటిపదె। మన-
కివం నీకెతో నిది యేపాటు ॥పల్లవి॥

చిత్తము చెదరఁగ చెంతల పూవుల-
నెత్తులఁగట్టిని లేమ
యిత్తలనత్తల నెడనెడ దండలు
గుత్తము రారో కొమ్మకుఁ దాడు ॥ఉడి॥

1. వైశాఖ శుద్ధ పూర్ణిమ.

పాసి విభుపితోఁ బాదంబున భువి
వ్రాసెఁ జిత్తరువు వగఁ బరణి
యీసతిచెలులము యింక నేమైనాఁ
జేసినచేఁత చేయకపోము ॥ఉవి॥

గాదిలిశ్రీవేంకటపతి కాఁగిట
నేదలు దేరము చెలిపుకును
మోహ మిప్పుడుగా మొనకొనె మనకును
యేదెస నుంటిమి యిందాఁకాను ॥ఉవి॥ 598

సాళంగనాట

అతఁడు మెఱసెనే యనంగుఁడూ
రతివంటి మిటు వాడుగదా ॥పల్లవి॥

కోమలిశిరసునఁ గూడెను యిప్పుడు
యేమికారణముననో యీయలులు
ఆమనికుసుమముల నలవడి పుట్టెను
కామునిచేవగతి గాదుగదా ॥అతఁ॥

యిత్తరిఁ జెలిమో మింతయుఁ గైకొనె
కొత్తగ నయనచకోరములు
కుత్తికకోవిలకూఁతలు రేఁగెను
చిత్తజబలి మిటు చెదరదుగదా ॥అతఁ॥

కొమ్మజవ్వనము కొల్లలు చేరెను
కమ్మగ శ్రీవేంకటపతికి
నెమ్మది నెంతయు నిలిపె సీతఁదే
యిమ్మడి మరుఁడయి యేఁచెఁగదా ॥అతఁ॥ 599

ఆహిరినాట

ఇద్దరిజాణతనము లెటువంటివే యిందు
వొద్దనున్న చెలులాల వోటవంత మేది ॥పల్లవి॥

హత్తినసతియుఁ బతి యలిగి మాటాడమని
వొత్తి యానవెట్టుకొని రొకరొకరు
మొత్తమి నాకె దవకు మొక్కినభావ మతఁడు
చిత్తరువులో వా(వ్రా?)సిన చెలిఁ జూచి నగెను ॥ఇద్ద॥

బలిమి నొకరొకరిఁ బట్టమని పంతమాడి
చలపట్టి మారుమంచము లెక్కిరి
విలువుటద్దములోనినెలఁతనీడరూపు
చెలువుఁడు దగ్గరించినఁ జెలి నగెను ॥ఇద్ద॥

అంగవయు శ్రీవేంకటాధిపుఁడు నధరము
యెంగిలి వియ్యమని యెన్నికఁ గూడి
ముంగిటికెంపులు పంటిమొనలనే మోవిమీఁదఁ
జెంగట వించినఁ బతి చెలిఁ జూచి నగెను ॥ఇద్ద॥ 600



# 1-వ అనుబంధము

## ఆకారాదిగ రాగ-సంకీర్తనసంఖ్యా సూచి

| రాగము | | సంకీర్తన సంఖ్యలు |
|---|---|---|
| అమరసింధు | ... | 380. |
| ఆరిభి | ... | 43. |
| ఆహిరి | ... | 25, 28, 55, 76, 97, 107, 127, 136, 143, 165, 198, 218, 227, 267, 282, 285, 325, 340, 350, 381, 388, 404, 426, 447, 453, 482, 517, 538, 555, 580, 584. |
| ఆహిరినాట | ... | 7, 24, 61, 121, 181, 255, 310, 392, 401, 458, 468, 491, 494, 529, 558, 581, 600. |
| కన్నడగౌళ | ... | 35, 62, 110, 188, 248, 349, 409, 548. |
| కాంబో (భో) ది | ... | 8, 22, 111, 137, 158, 162, 202, 250, 371, 446, 475, 539, 578. |
| కుంతలవరాళి | ... | 5 343, 444. |
| కురంజి | ... | 80, 279, 338, 544. |
| కేదారగౌళ | ... | 125, 208, 238, 276, 364, 582. |
| కొండమలహరి | ... | 114. |

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
|---|---|
| గుండక్రియ | ... 216, 578. |
| గౌళ | ... 12, 26, 68, 108, 229, 288, 346, 405, 432, 489. |
| ఘంటారవం | ... 594. |
| చెంచుమలహరి | ... 568. |
| తెలుగుగాం(కాం)బోది | ... 39, 101, 120, 180, 197, 264, 318, 430, 450, 506, 590, 597. |
| తోండి | ... 210. 237. |
| దేవక్రియ | ... 74. |
| దేవగాంధారి | ... 145, 183, 249, 266, 326, 381, 480, 499. |
| దేశా (సా) ళి | ... 52, 214, 235, 308, 415, 490, 533. |
| దేశి | ... 199, 225, 553, 587. |
| దేసాళం | ... 2, 6, 57, 63, 115, 131, 140, 159, 187, 213, 231, 243, 257, 258, 289, 315, 354, 390, 411, 442, 464, 473, 487, 516, 550. |
| ద్రావిళభైరవి | ... 47, 421. |
| ధ(ద)న్నాశి (సి) | ... 18, 85, 281, 478. |
| నట్టనారాయణి | ... 17. |

| రాగములు | | సంకీర్తనసంఖ్యలు |
|---|---|---|
| నాగగాంధారి | ... | 495. |
| నాగవరాళి | ... | 221, 341, 498. |
| నాదరామక్రియ | ... | 30, 48, 83, 112, 117, 126, 176, 207, 270, 299, 306, 398, 407, 431, 477, 496, 507. |
| నారాయణి | ... | 93, 314, 416. |
| నీలాంబరి | ... | 122. |
| పడ(ళ)వంజరం | ... | 13, 70, 190, 222, 427. |
| పాడి | ... | 11, 21, 36, 42, 84, 87, 102, 105, 129, 150, 200, 205, 217, 224, 303 321, 345, 357, 366, 372, 377, 393, 399, 419, 423, 455, 465, 470, 486, 501, 513, 524, 528, 537, 543, 552. |
| పూర్వగౌళ | ... | 254, 353, 428, 534. |
| బౌళి(భవుళి) | ... | 19, 33, 41, 45, 64, 96, 100, 123, 141, 173, 194, 201, 212, 228, 273, 281, 297, 302, 328, 348, 369, 395, 459, 467, 518, 551. |
| బౌళిరామక్రియ | ... | 113, 492, 554. |
| భల్లాటి | ... | 38, 365. |
| భూపాళం | ... | 58, 71, 86, 557, 575. |

| రాగములు | | సంకీర్తనసంఖ్యలు. |
|---|---|---|
| భైరవి | ... | 9, 69, 79, 88, 98, 144, 223, 287, 292, 359, 400, 469, 514, 545, 567. |
| మంగళకౌశ(సి)క | ... | 59, 191, 301, 334, 410, 422, 429, 449, 503. |
| మధ్యమావతి | ... | 29, 172, 260, 305, 437. |
| మాళవి | .... | 178, 220, 413, 466, 540. |
| మాళవిగౌళ | .... | 56, 95, 138, 148, 154, 160, 182, 239, 242, 296, 316, 382, 425, 484, 515, 530, 563. |
| మాళ(వి)వశ్రీ | .... | 184, 293, 451. |
| ముఖారి | .... | 3, 20, 23, 46, 73, 89, 99, 118, 156, 175, 226, 230, 271, 278, 358, 370, 373, 433, 438, 485, 485, 511, 521, 526, 561, 566, 574, 579, 586, 593. |
| మేచబౌళ | .... | 90, 203, 309, 439. |
| మేఘరంజి | .... | 277. |
| రామక్రియ | .... | 37, 65, 92, 128, 135, 155, 169, 189, 240, 247, 272, 298, 329, 374, 391, 408, 417, 448, 461, 479, 505, 512, 528, 542, 570. |

# 2-వ అనుబంధము

## అకారాదిగ సంకీర్తన-రాగ-సంఖ్యా సూచి

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తనసంఖ్య |
|---|---|---|
| అంగడినేల | నాదరామక్రియ | 126 |
| అంగవ నాపతి | మంగళకౌసిక | 191 |
| అంగవ వింతట | కన్నడగౌళ | 349 |
| అంగనలఁగనుఁగొంచే | పాడి | 102 |
| అంటుకొంటి | రామక్రియ | 135 |
| అందమంద | ఆహిరినాట | 458 |
| అందనున్న | బౌళి | 123 |
| అందరికిఁదారు | సామంతం | 78 |
| అందరివలె | పూర్వగౌళ | 428 |
| అందుకు నిందుకు | భైరవి | 223 |
| అందుకు మనసు | కన్నడగౌళ | 35 |
| అందుకేపో | ముఖారి | 370 |
| అందుకే మెచ్చ | హిజ్జిజి | 342 |
| అందుకేమే | ధన్నాశి | 18 |
| అందులకే | ఆరిబి | 43 |
| అందువంక | ఆహిరి | 136 |
| అటుగాన | పాడి | 372 |
| అటువంటి | శ్రీరాగం | 133 |
| అట్టైకాపీ | పాడి | 465 |
| అడుగరాదా | మంగళకౌసిక | 449 |
| అడుగరే యీమాట | దేసాళం | 57 |

| పంక్తి మొదలు | రాగము | పంక్తి సంఖ్య |
|---|---|---|
| పరమంద | మేఁచబౌళి | 203 |
| పతి చక్కఁదన | తెలుఁగుఁగాంబోది | 590 |
| సిగ్గువడ | ఆహిరినాట | 529 |
| నెలవిచ్చితి | బౌళి | 96 |
| సేలపాల | నాదరామక్రియ | 299 |
| నే సేవుపచార | లలిత | 15 |
| సౌరిది పీ | ఆహిరినాట | 7 |

# 3-వ అనుబంధము

## సందిగ్ధపద సమీక్ష.

[తాళ్ల పాకకవుల వాఙ్మయములో అపూర్వపదరాశి గొప్పది. ప్రత్యేకముగ ఈపని గొప్పగ సాగవలసియున్నది. దాని కుపస్కారకముగ, ఈ సంపుటములో నాదృష్టికి వచ్చినకొన్ని పదములను లఘువుగ చర్చించితిని. నిఘంటువుల కెక్కనివీ, ఎక్కినా అన్యార్థములందు ప్రయోగింపబడినవీ, వ్యాకరణమును పట్టిచూచేవి, ఇతర భాషా నిఘంటు ప్రసిద్ధములు మాత్రమే ఇందు చర్చింపబడినవి.]

### 1. ఊరఁగూటము: పాట 44

వేర్వేరు ఊర్ల వారు ఒకయూరిలో కలియుట, ఊరఁగూటమని లాక్షణికముగ వాడినట్లున్నది. పరస్పరము సంబంధములేని పదార్థములు ఒకచో కలియుటకు ఈవ్యవహారము ఆనాడుండినదేమో.

## 2. గోవాళుఁడు: పాట 114

గోవాళుఁడు=యువకుడు, విటుడు ఇత్యాదిగా తెలుగు నిఘంటువులు. "విటనామధేయమౌ విటకాఁడు, వేడుకకాఁడు, బొజుఁగు, ననుపుకాఁడు, లంజకాఁడనఁగ, నివియుఁగాక గోవాళ్ల - నఁగా నొక్కశబ్దంబు గలదు బహుత "— ఆం. భా 2-116. దీనిని ఏకవచనములో వాడుట వింత.

## 3. మునిపితే: పాట 110

ముని=మునివు=మునిసు=మునిసు = కోపము, auger, wrath, passion, rage! enemity ఇత్యాదిగా కిటెల్. దాని రూపమే 'మునిపితే' కావచ్చు.

## 4. ముమ్మదము: పాట 297

'ముచ్చట, మున్నీరు' వలె, కాయిక-వాచిక-మానసిక-ములైన మదములు మూడు ముమ్మతమై ఉండవచ్చు.

## 5. వాగపు: పాట 245

'వాగము' శబ్దము విశేషణించినరూపమో, లేక 'వాగుస' అనుకన్నదపదము యొక్క అర్థాంతరమైనపామ్మినో = ఎమ్మో=అది కలిగినవారు అని అర్థమో కావచ్చు.

## 6. విత్తరాలు: పాట 31

'బిత్తరాలు' కు రూపాంతరముగా తోచుచున్నది. బిత్తరము = విలాసము. "బిత్తరము కులుకు బెడఁగు బెళుకు హొయలనఁగ విలాసమొప్పుచుండు" — (ఆం. భా 1-189) — అది కలది బిత్తరాలు.

## 7. వెలకా: పాట 511

'వెళక్కు' శబ్దవికారమేమో వెళక్కు=దీపము అని తమిళ నిఘంటువు.



...ల తిరుపతి దేవస్థానముల ప్రెస్, తిరుపతి., శా. 2000

